## సోవియట్ రష్యా, చైనా రాజ్యాంగాలు :

**0-12-0**

**అభిప్రాయాలు :**

"........తెలుగు భాషలో ఆ యా దేశాల రాజ్యాంగ వివరాలను తెలుసుకోవాలనుకునే జిజ్ఞాసువులకు ఎంతగానో ఉపకరిస్తుంది...."

—ఆంధ్రప్రభ.

"సోవియట్ రష్యా రాజ్యాంగచట్టాన్ని, కమ్యూనిస్టు చైనా రాజ్యాంగ ప్రణాళికను, సెక్షనువారీగా ఈ పుస్తకంలో తర్జుమాచేశారు. ఇండియా రాజ్యాంగ చట్ట నిర్మాతలు, శాసనసభ్యులు, పోల్చి చూసుకునేందుకు పనికివచ్చే పుస్తకం. క్లిష్టసమస్యల నా దేశాలలో ఏవిధంగా పరిష్కరించిందీ తెలుసుకోవచ్చును."

—ఆంధ్ర పత్రిక.

## ఫ్రెడరిక్ ఎంజెల్సు- జీవితం, ఉపదేశాలు :

**1-0-0**

"మార్క్సిజం వయస్సు ఒకశతాబ్దం దాటింది. సోవియట్ రాజ్య నిర్మాణంతో మార్క్సిజం స్పష్టమైన కార్యరూపం దాల్చింది. దీనికి గతంకంటె భవిష్యమే అధికంగావుంటుందని ప్రపంచ పోకడ గమనించేవారికి తెలియకపోదు "

"ఈ సిద్ధాంత జనకులు కారల్ మార్క్సు, ఫ్రెడరిక్ ఎంజెల్సు అన్న మేధావులు........ ఎంజెల్సు యావజ్జీవితమూ పీడితవర్గ విముక్తికి అర్పితంజేసి, ధనికజీవిత విలాసాలను త్యజించిన మహాత్యాగి."

—తెలుగు స్వతంత్ర.

•

[మైటిలు 3 వ పేజీ చూడుడు]

# సంసారసుఖం

## (నవల)

రచన:

టాల్‌స్టాయ్.



అనువాదం:

నిడమర్తి ఉమారాజేశ్వరరావు,

కొండేపూడి శ్రీనివాసరావు

ప్రగతి ప్రచురణాలయం, నిడమర్రు.

# సంసార సుఖం.

## అధ్యాయం 1.

క్రితం కుర్రాలు కాలంలో మమ్మల్ని దుఃఖసముద్రంలో ముంచి మా అమ్మ పరలోకాన్ని జేరుకుంది. ఆ శీతకాలమంతా మాతృశోకంలో ఒక్క కాట్యా, సోన్యాలతో ఆ పల్లెప్రాంతంలో గడిపాను.

కాట్యా మా కుటుంబానికి చిరకాల స్నేహితురాలు; చిన్ననాటి నుండి మా ప్రేమానురాగాలకు పాత్రురాలై మమ్మల్ని పెంచి పెద్దచేసిన సంరక్షకు రాలామె. ఇక సోన్యా నా చిట్టిచెల్లెలు. పొక్రావ్‌స్కోలోని మా పాతయింటిలో అతి విచారపూరితము, కాంతిశూన్యము అయిన ఆ శీతకాలాన్ని యేవిధంగా తరలించామో ఆ భగవంతునికే తెలియాలి! వ్రేళ్ళు కొంకర్లుపోయే విపరీతమైన చలిగాలులు వీచేవి. మంచుగుట్టలు కిటికీలకన్న యెత్తుగా పెరిగేటంత అధికంగా వుండేది హిమపాతం. కిటికీ అద్దాలెప్పుడూ మంచుతోనిండి తేజోవిహీనంగా వుండేవి. ఆరోజుల్లో బాహ్యప్రపంచంతో సంబంధమే వుండేదికాదు మాకు. మమ్మల్ని చూడటానికికూడ అట్టేమంది వచ్చేవారుకాదు. వచ్చినవారైనా మాకు తెచ్చిన శాంతేమీ వుండేదికాదు. వారంతా విచారపూరిత వదనాలతో, నిద్రించేవారిని లేపుతామేమోనని భయపడుతూన్నట్లుగా క్షీణస్వరాలతో మాట్లాడేవారు. నవ్వు వారిముఖాల్లోనికి పొరపాటుననైనా తొంగిచూచేది కాదు. నావంక, ముఖ్యంగా నల్లగౌను తొడుక్కొని కూర్చున్న మాచిట్టి సోన్యావంక చూచినప్పుడుమాత్రం తరుచు నిట్టూర్చి, కండ్లనీరు గ్రుక్కుకునేవారు. మృత్యుఛాయలు మా యింటిని వీడిపోలేదు. వాతావరణమింకా మృత్యుదేవత విడిచివెళ్ళిన భయవిషాదాలనుండి విముక్తం కాలేదు. మా అమ్మగదికి తాళంవేశారు. నా పడకగదికి వెడుతూ అటు వెళ్ళినప్పుడల్లా శీతలము, నీరవము, నిర్జనమైన ఆ గదిలోనికి చూడాలను ఆదొకరకమైన వింతయు, విచారకరము అయిన కోరిక కలిగేది.

మా అమ్మ చనిపోయేటప్పటికి నావయస్సు పదిహేడేళ్లు. ఆయేడే నాకు పీటర్సుబర్గు సమాజాన్ని పరిచయంచేద్దామనుకుంటూవుండేది మా అమ్మ. మా అమ్మ మరణం నాకు తీరని దుఃఖహేతువు. నా యౌవనము, సౌందర్యమూ (నే నందంగా వుంటాననే అందరూ అనేవారు) పల్లెసీమల ఏకాంతంలో రెండవయేడుకూడ వృధాయైపోతున్నదే అనే మరొక బాధకూడ ఆ దుఃఖానికి వెనుక నా మనస్సును పీడిస్తూవుండేదని ఒప్పుకోక తప్పదు. ఆ శీతకాలం అంతమయేలోగా యీ బావురుమనే యేకాంతము, వ్యసనము, విసుగు యెంతగా నన్నావరించాయంటే కాస్సేపు పియానో వాయించుకోడంగాని, ఒక పుస్తకం చదువుకోడం గాని, ఆఖరికి గదివిడిచి నాలుగడుగులు వెయ్యటానికిగాని నా మనస్సంగీకరించేది కాదు. ఏదో ఒకపనిలో నిమగ్నురాలినవమని కాట్యా నన్ను హెచ్చరించినప్పుడల్లా నాకది సాధ్యంకావటంలేదని చెప్పేదాన్ని. కాని వెంటనే నామనస్సులో "నా జీవితంలో ముఖ్యమైనభాగం యీవిధంగా వృధాయైపోతూంటే యేపనిచేస్తే మటు కేమిలాభం" అనే ప్రశ్న చెలరేగేది. బొటబొట రాలే కన్నీరుతప్ప ఆ ప్రశ్నకు వేరు జవాబేదీ స్ఫురించేది కాదు.

నేను చిక్కిపోతున్నాననీ, నాముఖం కళావిహీన మౌతోందనీ అంటూండేవారంతా. కాని ఆ మాటలుసైతం నాలో మార్పేమీ తీసుకు రాలేకపోయాయి. అలా జరుగుతేమటుకేమి? ఎవరికేమినష్టం? నా జీవితమంతా అదేవిధమైన ఏకాంతంలో, నిస్సహాయ నిర్జనత్వంలో దొర్లిపోతుందేమో ననిపించింది నాకు. దానినుండి బయటపడే శక్త్యుత్సాహాలుగాని, కోరికగాని నాలోలేవు. ఆ శీతకాలాంతానికి నా యీ స్థితిని చూసి కాట్యా ఆందోళన చెందనారంభించింది. నన్ను పరాయి ప్రదేశాలకు తీసుకువెళ్ళటానికికూడ ప్రయత్నాలు చేసింది. కాని ప్రయాణానికి డబ్బు కావాలికదా? మా అమ్మ చనిపోయినప్పటినుండి మా ఆర్థిక పరి

స్థితి యేలాగున్నదీ మా సంరక్షకుడు వస్తేగాని తెలియదు. అందుచేత యేరోజు కారోజు ఆయన రాకకై యెదురుతెన్నులు చూస్తూండేవాళ్ళం.

ఆయన మార్చినెలలో వచ్చాడు.

ఒకరోజున యేపనీ, యే భావమూ, యేకోరికాలేకుండా ఛాయలా గదిలో అటునిటు పచారుచేస్తున్నాను. ఇంతలో "బ్రతికించావురా భగవంతుడా!" అంటూ హడావిడిగా కాట్యా వచ్చి "సెర్జీ మిఖాలిచ్ వచ్చాడట. మన క్షేమసమాచారం కనుక్కొని తాను భోజనానికి యిక్కడికి వస్తానని చెప్పమన్నాడుట" అని గుక్కతిరక్కుండా చెప్పి "మీరంటే ఆయన కెంతప్రేమ! ఇల్లా ముఖం వ్రేలవేసుకుని కూర్చుంటే యేమను కుంటాడు? మాతల్లి కాదూ! లే అమ్మా మాషా" అని హెచ్చరించింది.

సెర్జీ మిఖాలిచ్ మా పొరుగింటివాడు. మా నాన్నకన్న చాల చిన్నవాడైనా మా నాన్నతో చాల స్నేహంగా వుండేవాడు. ఆయన రాకవల్ల మా ప్లానులు కొనసాగవచ్చు. మేమీ పల్లెటూరినుండి విముక్తిచెందవచ్చు. పైగా ఆయనపట్ల భక్తిపూర్వకమైన ప్రేమ నాలో పాదుకొనివుంది. కాట్యా నన్నుత్సాహంగా వుండమని హెచ్చరించినప్పుడు ఏ యితర స్నేహితుల ముందుకన్న ఆయనముందు నిరుత్సాహంగా, మందకొడిగా నే నుండలే ననేవిషయం ఆమె సరిగ్గానే ఊహించగలిగిందని తెలుసుకున్నాను. కాట్యా, సోన్యాలనుండి మాయింట్లోని పనివాళ్ళవరకు అందరివలెనే నేనుకూడ ఆయనను ప్రేమిస్తూనే పెరిగాను. మా అమ్మ నాచిన్నతనంలో ఒకమారు "మాషా! నిన్నాయనవంటివాని చేతుల్లోపెడితే నా ప్రాణం కుదుటపడుతుందే" అన్నది. ఆ మాటలు యిప్పటికీ నాకు జ్ఞాపకమున్నాయి. ఆ మాటలే నా మనస్సులో ఆయనకొక ప్రత్యేకతను కల్పించాయికూడా. కాని అప్పటిలో యీ విషయం విపరీతంగాను, వికారంగాను కూడ తోచింది. నా స్వప్నలోకపు ఆదర్శపతి రివటలా సన్నగా, పాలవలె తెల్లగా, ఆలోచనావ్యధితుడుగా వుండేవాడు. మరి సెర్జీమిఖాలిచ్

నా ఆదర్శానికి భిన్నంగా మధ్యప్రాయంలో, పొడుగ్గా, దృఢంగా, సంతోషంతో కిలకిలలాడుతూన్న ట్లుండేవాడు. అయినప్పటికీ మా అమ్మ మాటలు నా చెవుల్లో రొదచేస్తూనే వుండేవి. ఇప్పటి కారేండ్లక్రితం, నా పదకొండవయేట ఆయన నన్నింకా "రోజా మొగ్గ" అనే ముద్దుపేరుతో పిలిచేటప్పుడుకూడ "అకస్మాత్తుగా తన్నాయన పెండ్లాడమని కోరితే నే నేంచెయ్యాలబ్బా ?" అనే భయంకరమైన ప్రశ్న నన్ను వేధిస్తూండేది.

ఆపూట కాట్యా రెండుమూడు పిండివంటలు, మరిరెండు అధరువులు చేసింది. భోజనపువేళకు ముందే సెర్జీమిఖాలిచ్ వచ్చాడు. అల్లంత దూరంలో ఆయనబండి చూడగానే, ఆయన రాకవిషయం నాకు తెలియనే తెలియదన్నట్లు, ఆకస్మిక సంతోషకరమైనట్లు నటించాలని ఆఫీసుగదిలోకి దౌడుతీశాను. కాని ఆయన బూట్ల టకటక, పెద్దగొంతుక, కాట్యా హడావిడి వినగానే యిక అక్కడ వుండబట్టలేక నేనుకూడ ఆయనను కలుసుకోటానికి వెళ్లాను. కాట్యా కరస్పర్శచేస్తూ బిగ్గరగా మాట్లాడుతూ, మధ్యమధ్య నవ్వుతూ వున్నవాడల్లా నన్నుచూడగానే ఆయన నిశ్చేష్టుడై కొంతసేపు నన్ను పలకరించకుండానే ఒళ్ళంతా కళ్లుచేసుకొని నన్నుచూస్తూ నిలబడిపోయాడు. దానితో నాశరీరమంతటా సిగ్గు దొంతరలు ప్రసరించిన ట్లనిపించింది.

"అరే నువ్వేనా! గుర్తే పట్టలేకపోయానే! ఎంతగా మారిపోయావు ? ఎంత పెద్దదానివయ్యావు! నిన్ను "రోజా మొగ్గ" అని పిలిచేవాణ్ణి, కాని యిప్పుడిక నువ్వు మొగ్గవుకాదు. బాగావికసించిన రోజా పుష్పానివి!" అంటూ నన్ను సమీపించి కరసంచాలనానికి తన చేతి నందిచ్చాడు.

ఆయన తన పెద్దచేతిలోనికి నా చేతిని తీసుకుని నొప్పికలిగేటంత గట్టిగా అదిమాడు. నా చేతిని చుంబిస్తాడేమోనని ఆయనవంకకు ఒరిగాను గాని నా చేతిని మరల ఒకమా రదిమి తన మామూలు దృఢము, సంతోషపూర్ణమైన కండ్లతో నా కండ్లలోనికి తిన్నగా చూశాడు.

అరేంద్లక్రిత మాయన్ను చూచినప్పటికీ, యిప్పటికీ ఆయనలో చాల మార్పువుంది. వయస్సు ముదిరింది. ముఖము గౌరవర్ణం తిరిగింది. ఆయనముఖానికేమీ బాగుండని గడ్డమొకటి పెరిగింది. ఆయన పూర్వపు సరళత్వంలోను, విశాలము, సౌజన్యపూరితము అయిన ముఖ కవళిక ల్లోను, మిలమిల మెరిసే ఆయన తెలివైన కండ్లలోను, స్నేహపూర్వకము, బాల్యస్నిగ్ధము అయిన ఆయన నవ్వులోనూ మాత్రం యేమార్పూ లేదు.

అయిదునిముషాలు దాటకుండానే ఆయనపట్ల క్రొత్తపోయి సేవకులతో సైతం మా అందరికీ చనువుచిక్కింది. ఆయనకు పరిచర్యలు చేయాలని వారుచూపే ఆతురతనుబట్టి ఆఖరకు సేవకులుకూడ ఆయన రాకకెంతగా సంతోషించారో వ్యక్తమైది.

మా అమ్మ చనిపోయాక మమ్మల్ని పరామర్శించ వచ్చిన వారికీ, ఆయనకూ యెంతభేదమున్నది! వారంతా మాతో వున్నంతసేపూ పరమ విశ్శబ్దంగా కూర్చుని, కళ్ళవెంబడి నీళ్లు పెట్టుకోవడం అవసర మని తలచారు. మరి ఆయన దానికి విరుద్ధంగా పిచ్చాపాటీ హుషారుగా మాట్లాడుతూ, మా అమ్మవిషయమే తలపెట్టకుండా సమయం తరలించేశాడు. సన్నిహిత కుటుంబ మిత్రుడైన ఆయన యీ విశ్శబ్దం మొదట చాల విలక్షణంగాను, విరుద్ధంగాను కూడ కనిపించింది. కాని ఆయన విశ్శబ్దానికి కారణం మనఃపూర్వక సానుభూతియేనని గ్రహించుకున్న తర్వాత నామనస్సాయనపట్ల విశేష కృతజ్ఞతతో నిండిపోయింది. ఆ సాయంత్రం మా అమ్మ బ్రతికున్న రోజుల్లో కూర్చునేచోటనే కూర్చుని కాట్యా మా అందరికీ టీ పోయనారంభించింది. నేనూ, సోన్యా ఆయన ప్రక్కనే కూర్చున్నాం. మా ముసలిబట్లరు గ్రిగరీ యిల్లంతా తిరగేసి మా నాన్న పాతపైపు ఒకటి పైకితీసి బూజుదులిపి ఆయనకిచ్చాడు. ఆయనకూడ పూర్వపురోజుల్లోలాగే పైపుకాలుస్తూ గదిలో అటుయిటు పచార్లు ప్రారంభించాడు.

"ఈ కుటుంబంమీద యెన్ని ఆపదలు విరుచుకుపడ్డాయి?" అన్నా డాయన మధ్యలో ఆగి.

"ఔనౌను" అంది కాట్యా పెద్దనిట్టూర్పువిడిచి గిన్నెమీద మూత పెట్టి ఆయనవంకచూసి యేడ్పుకుసిద్ధమైంది.

"మీనాన్న గుర్తున్నాడనుకుంటానేమమ్మాయ్?" అని అడిగాడా యన నాకేసితిరిగి.

"అంతబాగాగుర్తులేదు" అన్నానేను.

"ఇప్పుడాయనవుంటే ఎంతమురిసిపోయేవాడోకదా నిన్నుచూసి?" నాముఖంపంకచూస్తూ అన్నాడాయన నెమ్మదిగా. "ఆయనంటే నాకెంత ప్రేమ!" అన్నాడాయన మరింత నెమ్మదిగా. ఆసమయంలో ఆయన కళ్లు పూర్వస్మృతితో మిలమిల మెరిసిపోయినట్లుగా నాకుతోచింది.

'ఇప్పుడు తల్లినికూడాయెత్తుకుపోయాడుమాయదారిభగవంతుడు!' అంటూ చేరుమాలు అడ్డుపెట్టుకొని యేడ్పుసాగించింది కాట్యా.

"అవునమ్మా, కష్టాలెప్పుడూ ఒంటరిగా రావంటారిందుకనే" అంటూ పక్కకుతిరిగి, "సోన్యా! యేవమ్మా నీబొమ్మలు, నాకొకమారు చూపించు" అని వరండాలోకి వెళ్లిపోయారు. ఆయనవెళ్లిపోగానే అశ్రు వులతోనిండిన నాకళ్లను పైకెత్తేసరికి కాట్యాకూడ అదేస్థితిలో కనిపించింది!

"ఎంతటి మహత్తరమిత్రుడు!" అంది కాట్యా. ఆయన నాకే లాంటి బంధువూకాకపోయిన ఆసత్పురుషుని సానుభూతిలో నాకు దుఃఖోపశమనమూ, మనశ్శాంతీ లభించినట్లుతోచింది.

వరండాలో ఆయన సోన్యాతోబాటు తిరుగుతూన్నధ్వనీ, బిగ్గ రగా మాట్లాడుతూన్న సోన్యా బాల్యస్వరం నాకువినిపిస్తున్నాయి. ఆయ నకు టీ వరండాలోనికే పంపాను. ఇంతలో సోన్యా చిట్టిచేతులను పుచ్చు

కుని పియానోదగ్గరకూర్చుని కుంయ్ కుంయ్ లాడించిన శబ్దం విన వచ్చింది.

తర్వాత "మేరీ అలెగ్జాండ్రోనా! ఏదైనా ఒకపాట వాయించ రాదూ?" అన్న ఆయనపిలుపు వినిపించింది.

నాపట్ల ఆయన సరళప్రవర్తన, ఆయనస్నేహపూర్వక ఆజ్ఞా స్వరం నాకెంతో సంతోషం కలిగించాయి. నేను వెంటనేలేచి ఆయన వద్దకు వెళ్ళాను.

"ఈపాటవాయించు" అని బీథోవెన్ పుస్తకములో ఒకపాట నాయన చూపించాడు. "ఎంతబాగావాయిస్తావో చూస్తాగా" అంటూ టీకప్పు చేతబుచ్చుకుని గదిలో ఒకమూలకువెళ్ళి కూర్చున్నారు.

పియానోవాయిద్యం నాకంతబాగారాదనే సాకుచెప్పి ఆయన అడిగి నప్పుడు వాయించ నిరాకరించడం అసంభవమని తోచింది. అందుచేత పియానోముందు ఒదిగికూర్చుని నాకు చేతనయినంత బాగావాయించ నారంభించాను. కాని ఆయనకూడా సంగీతమందు అభినివేశముండ టంచేత ఏమైనా తప్పువాయిస్తానేమోనని బెదురుతూనేవున్నాను. టీత్రాగే కాలంలో జరిగిన సంభాషణ కలుగజేసిన పూర్వస్మృతులకాపాటీ తగి యుండుటచేత అదిబాగానే వాయించాననుకుంటాను. కాని వేరొకపాట మొదలెట్టగానే ఆయన అడ్డువచ్చి "అబ్బెబ్బే, అదినువ్వు సరిగావాయించ లేవు. మొత్తంమీద నీవాయిద్యం బాగానేవుంది" అంటూ దగ్గరకు వచ్చారు. అస్వల్పపొగడ్తే నామనస్సును సంతృప్తి. సంతోషాలతో నింపి వేసి చిరుసిగ్గునుకూడ కలిగించింది. ఆయన నాతండ్రి ప్రాణస్నేహి తుడూ, సమకాలికుడూను. అట్లాంటిఆయన చిన్నపిల్లతోవలె ఆషామా షీగాకాక నాతో గంభీరంగా మాట్లాడ్డంనాకు వింతగాను, విశేషసంతోష దాయకంగానూ తోచింది. సోన్యాను నిద్రపుచ్చడానికై కాట్యామేడమీదికి వెళ్ళియుండటంచేత వరండాలో మేమిద్దరమూ ఒంటరిగామిగిలిపోయాం.

నేనింకా బొమ్మలపుస్తకాలతోనూ, ఆటబొమ్మలతోనూ, కాలం గడిపేరోజుల్లో మానాన్నతో ఆయనకు కలిగిన ప్రధమపరిచయ స్నేహాలనుగురించీ, వారిద్దరూకలిసి గడిపినసుఖమయ దినాలనుగురించీ నూతన నిష్కల్మష, నిరంతరోత్సాహపూరితవ్యక్తిగా నాముందు చిత్రించాయి. నాయిష్టానిష్టాలనుగురించీ, చదువుసంధ్యలనుగురించీ, నా భావికార్యక్రమాన్ని గురించికూడ అడిగి తనకుతోచిన సలహాలిచ్చారు. ఆసమయంలో ఆయన వ్యక్తిత్వమే మారిపోయినట్లనిపించింది. హుషారుగా కిలకిలమంటూ నవ్విస్తూ, యేడ్పిస్తూ, బొమ్మలుచేసిపెడుతూండే నిరంతరానంద మగ్నుడైనవ్యక్తి నిష్క్రమించి, గంభీరుడు, నిరాడంబరుడు, ప్రేమమయుడు అయిన ఒక నూతనవ్యక్తి ప్రవేశించాడు! ఆయనపట్ల విశేషప్రేమగౌరవాలు ప్రదర్శించకుండా ఉండలేకపోయాను. నిరాడంబరుడైన ఆయనతో సంభాషణ నాకెంతో సంతోషకరంగానేవుంది. కాని అదేసమయంలో ప్రతిమాటనూ యెంతోజాగ్రత్తగా తూచితూచి వాడవలసిన అవసరంకూడ కనిపించింది. ఆయన తన ప్రియస్నేహితుని పుత్రికగా నన్నంతకుపూర్వమే ప్రేమించనారంభించాడు. కాని నాకంతతోనే తృప్తిజనించక, ఆయన ప్రేమాభిమానాలను ప్రత్యేకంగా చూరగొనవలెననే బలీయమైన కోరికతో మథనపడ నారంభించాను.

అంతలో సోన్యాను నిద్రలేచ్చి కాట్యా మేమున్నచోటుకువచ్చి నానిరుత్సాహాన్నిగురించి ఆయనతో పితూరీచేయనారంభించింది. అంతవరకు నేనావిషయమే యెత్తుకోలేదు.

"అయితే అన్నిట్లో ముఖ్యమైనవిషయమే నాతోచెప్పకుండా దాచేసిందన్నమాట!" అంటూ హాసపూర్ణమైన తనముఖాన్ని నాపై నిందారోపణ చేస్తూన్నట్లు ఊపారు.

"పెద్దచెప్పేందుకేముంది? రెండురోజుల్లో పోనేపోతుందికదాఅని చెప్పలేదులే" అని జవాబిచ్చాను. (అప్పుడు నానిరుత్సాహదశ త్వరలోనే

గడిచిపోతుందనీ, అప్పటికప్పుడే గతించిపోయిందనీ, అసలెప్పుడూ అదిలేనేలేదేమోననీ అనిపించింది )

"నాలుగురోజులు ఒంటరిగా గడపవలసివచ్చేసరికల్లా నిరుత్సాహంచెంది నీళ్ళుకారిపోవడం యేమంత మంచివిషయంకాదు. అప్పుడే పెద్దదానివై పోయావా యేమన్నానా?" అన్నారాయన.

"అవునుమరి, పెద్దదాన్నికాక పసిపిల్లనానేను?" అన్నాను నవ్వుతూ.

"అయితే, నలుగురూ తనచుట్టూచేరి తన్నుపొగడుతూన్నంతసేపూ హుషారుగావుండి, ఒంటరిగామిగిలిన మరుక్షణమే నిరుత్సాహ, నిరానంద సుడిగుండాలలోపడి యేపనీతోచని—పైకిపటాటం, లోనలొటారంగా వుండే స్త్రీలంటే నాకేమీ గౌరవంలేదు" అన్నారాయన.

"నేనంటే మీకున్న ఉన్నతాభిప్రాయానికి కృతజ్ఞత!" అన్నాను యేదోఒకటి చెప్పాలికదా అనేఉద్దేశ్యంతో.

ఒక నిముషం నిశ్శబ్దంగావుండి మరల అన్నారాయన: "తండ్రి పోలిక ఊరికేపోతుందా? అందుకనే నీలోయేదో ప్రత్యేకత...." ఆయన దయాపూరితము, శ్రద్ధాభరితము అయిన చూడ్కులు నన్ను మరల ఆనంద కరమైన తొట్రుబాటులో ముంచేశాయి.

ఆయన అందరికీ అత్యుత్సాహవంతునివలె కనిపిస్తాడు. కాని ఆఉత్సాహానికి మరుగున శ్రద్ధ, దానిమరుగున విచారము ఆయన విలక్షణమైన ముఖకవళికలలో నాకానాడే ప్రథమపర్యాయం గోచరమయాయి.

"నువ్వు నిరుత్సాహంగా, మందకొడిగా ఉండనూకూడదు;-ఉండనూరాదు. సంగీతంవచ్చు; హాయిగా సాధనచెయ్యి. గ్రంథాలున్నాయి; పఠించు. ఆవగింజలో అరవయ్యోవంతు కాలేదింకా; నీజీవితమంతా ముందేవుంది! భావిజీవితానికి కావలసిప్రయత్నాలన్నీ తొందరగాపూర్తి చేసుకో. గడచినక్షణం మరి తిరిగిరాదు తల్లక్రిందులుగా తపస్సుచేసినా.

తర్వాత తలుచుకుని విచారిస్తే ఫలితం పీసమెత్తైనా వుండదు" అని బోధించారాయన.

తండ్రివలె మాట్లాడారాయన. మాట్లాడుతూన్నంత సేపూ నాతో సమానస్థానంలో మాట్లాడటానికి విశేషప్రయత్నంచేసినట్లు తోచింది నాకు. నాతో చిన్నపిల్లతోవలె మాట్లాడినందుకు నాకు ఒకవంక కోపం కలిగినా; నాఒక్కతెతోమాత్రమే వేరువిధంగా మాట్లాడుట కాయన ప్రయత్నించినందుకు వేరొకవంక చాల సంతోషం కలిగింది.

ఆసాయంత్రంలో మిగతాకాలమంతా కాట్యాతో మా కుటుంబ ఆర్థికస్థితిగతులనుగురించి మాట్లాడుతూ గడిపారు.

"సెలవు!" అంటూ ఆయనలేచి నాదగ్గరకువచ్చి నాచేయితనచేతి లోనికి తీసుకున్నారు.

"పునర్దర్శనమెప్పుడు?" అని అడిగింది కాట్యా.

"వసంతఋతువులోనే. ఈవెళ్లటంవెళ్లటం దేనిలోవ్కా (ఇది మారెండవజమీ) వెళ్ళి అక్కడిపరిస్థితులనుచూసి చెయ్యవలసిన యేర్పాట్లు చేసి అక్కడినుండి నాసొంతపనిమీద మాస్కో వెళ్తాను. తిరిగి వేసవిలోనే మనం కలుసుకోవటం" అని అప్పటికీనాచెయ్యి పట్టుకొనే జవాబిచ్చారు.

"అంతకాలం దూరంగాఉండిపోవలసిందే?" అని అడిగాను. ఆయనను ప్రతిదినమూ చూడాలనే ఆశలునాలో మొలకెత్తాయి. ఆనాఆశలు నిరాశలుకాగానే నాలో విచారం పొంగిపొర్లనారంభించింది. నాలో నిరుత్సాహం తిరిగి తలయెత్తుతుందేమోననే భయంకలిగింది. అప్పటి నాముఖభంగిమ, నాక్షీణస్వరం ఆనాభయసందేహాలను వ్యక్తంచేసియుంటాయి.

"యెప్పుడూయేదో ఒకపనిచేస్తూ ఉత్సాహంగా వుండాలి" అన్నారాయన. ఆయున కంఠస్వరాన్నిబట్టి నావిషయమై ఆయనసంబంధంలేనట్లు,

యేమంతపట్టించుకోనట్లు తోచిందినాకు. "వసంతకాలంలో నేనిక్కడికి వచ్చినప్పుడు నిన్నుపరీక్షించి చూస్తాగా యీవిషయంలో" నాచేయిని వదలి వేరొకవంకచూస్తూ అన్నారాయన.

వరండాలోకివచ్చి ఆయనకు మేమువీడ్కోలిచ్చిన సమయంలో కూడ తొందరతొందరగా తన ఉన్నికోటును వేసుకుని నావంకకాక వేరొకవంకకేచూస్తూ వుండిపోయారు. "ఆయన పశ్చాత్తాపపడుతున్నారు! నావంక ఆయన చూడాలని ఆత్రుతతో పడి చచ్చిపోతున్నానను కున్నారేమో? అనటానికాయన మంచివారే. చాలమంచివారనికూడా చెప్పవచ్చు. కాని అంతమాత్రమే" అనే ఆలోచనలతో నిండిపోయింది నామనస్సు.

ఆరాత్రి చాల ప్రొద్దుపోయేవరకూ నేనూ, కాట్యా ఆయనను గురించికాక వేసవిలో మాకార్యక్రమాన్నిగురించీ, వచ్చేవసంతం యెట్లా యెక్కడగడపాలన్న విషయంగురించీ కబుర్లుచెప్పుకుంటూ గడిపాము. "నేనెల్లాగవుంటే యెవరికేం? ఏంచేస్తే మటుకేమిలాభం?" అన్నభయంకరమైన ప్రశ్నమాత్రం నేను అడగటం మానేశాను. నాకిప్పుడా భయంకరమైన ప్రశ్నకు విస్పష్టము, నిరాశమైన జవాబు దొరికినట్లనుపించింది. ఆనందమే జీవితపరమావధి. భావిలో ఆనందం అనంతంగా కలుగబోతున్నట్లుగా నామనస్సును సమాధానపరచుకున్నాను. ఆభావం నామనస్సులో ప్రవేశించగానే మానిస్తేజపురాతనగృహం అద్భుతమైన తేజస్సుతోను, చైతన్యంతోను నిండిపోయినట్లుగా తోచింది.

# అధ్యాయం 2.

ఇంతలో వసంతకాలం వచ్చింది. మాపూర్వపు విరానందభావం గతించిపోయింది. కాని వసంతకాలం తనతోకొనివచ్చే స్వప్నపరంపరలు, అనిర్దిష్టమైన ఆశాకోర్కెలు నాలో అశాంతిని రేకెత్తించాయి. శీతకాలారంభంలో గడిపిన విధంగాకాక నాకాలాన్ని పియానోవాయిద్యంలోను, గ్రంథపఠనలోను, సోన్యా విద్యాబోధనలోను గడుపుతున్నాను. అంతేకాక తరచుగా పుష్పవాటికలలోని కాలిబాటలవెంబడి నడుస్తూనూ, తోటలో చెట్లసరసను గంటలతరబడి కూర్చునీ కాలం తరలించేదాన్ని. అట్టి సమయాలలో నా భావవీథులలో యెన్ని ఆశాకోరికలు పొడచూపుతూ వుండేవో ఆ భగవంతునికే తెలియాలి. ఒక్కొక్క రాత్రిపూట, అది వెన్నెలరాత్రి అయితే ముఖ్యంగా మా పడకగది కిటికీలో కూర్చుని తూర్పున అరుణోదయరేఖలు పొడచూపేవరకూ గడిపేసేదాన్ని. కాట్యా చూడనిరోజున తలపైనొక పల్చని ముసుగుమాత్రం వేసుకుని తోటలో ప్రవేశించి దట్టంగా మంచుతో కప్పబడిన నేలపై ఆ వంకనున్న చెరువు వరకు పరుగెత్తి తిరిగివచ్చేదాన్ని. ఇంకొక రోజున తోట దాటిపోయి విశాలమైన పొలాలలో ప్రవేశించి, ఆ రాత్రిపూట యేకాంతంగా తోటచుట్టూ ప్రదక్షిణంచేసి వచ్చేదాన్ని.

ఆ రోజుల్లో నా మనోపథాల నాక్రమించుకున్న స్వప్నసమాన భావాలను యిప్పు డర్ధంచేసుకోవటంగాని, ఆకళింపుకు తెచ్చుకోడంగాని అసంభవంగా కనిపిస్తోంది. వాటిని స్మృతికి తెచ్చుకోగలిగినా అవి యెంత వింతగాను, యథార్థజీవితానికి సంబంధం లేనివిగాను వున్నాయంటే నా స్వప్నాలావిధంగా నిజంగావుండేవా అని నాకే శంక కలుగుతోంది.

సెర్జీమిఖాలిచ్ తనమాట చొప్పున మేనెలాఖరుకు తిరిగివచ్చారు. అసాయంత్రం అకస్మికంగా ఆయన వచ్చారు. వరండాలో టీ బల్ల

చుట్టూ మేమంతా కూర్చున్నాము. అప్పటికే తోటలోని చెట్లన్నీ పచ్చని ఆకులతో నేత్రోత్సవం చేస్తున్నాయి. గుబురుకొమ్మల మాటుని దాగొని కోయిలలు కుహూకుహూ నాదాలు చేస్తున్నాయి. గుబురైన లీలక్ పొదలు రక్త, శ్వేత మిశ్రమవర్ణపు నవవికసిత పుష్పములతో విరాజిల్లు తున్నాయి. బారులుతీరియున్న బిర్చి వృక్షాగ్రాలు సాయంసమయపు బంగారు సూర్యకిరణాలలో స్నానాలుచేస్తున్నాయి. వరండాలో చల్లని నీడలు ప్రసరించాయి. పచ్చికపై సాయంకాలపు మంచు దట్టంగా పడు తోంది. తోటచివర గొర్రెల, ఆలమందలు గోధూళివేళ యిండ్లకు పోతూన్న పగటికాలపు అంతిమశబ్దాలు వినవస్తున్నాయి నికొన్ తోట బాటవెంట నీళ్ళబండిని తోలుకువస్తున్నాడు. మా వరండాలో స్టవ్ బుస కొడుతూంది. టేబిల్పై ప్లేట్లలో వెన్న, బిస్కెట్లు వున్నాయి. కాట్యా తన గుండ్రనిచేతులతో త్వరత్వరగా కప్పులను కడుగుతోంది. అప్పుడే స్నానంచేసివచ్చిన నేను పెనుఆకలితో టీ కొరకై వేచియుండక వెన్నతోచేర్చి రొట్టెను తింటున్నాను. నేను వదులైన గౌను ధరించి అప్పటికింకా తడిగావున్న జుట్టుకు చేతిరుమాలు కట్టుకొనియున్నాను. ఆయన లోనికి రాకపూర్వమే కాట్యా ఆయనను చూచింది.

"ఓహ్! సెర్జీమిఖాలిచ్! మీరేనా? ఇప్పుడే మిమ్మల్నిగురించి తలుచుకుంటున్నాము. వెయ్యేళ్లాయుష్షు మీకు" అంది కాట్యా బిగ్గరగా.

నా దుస్తులు మార్చుకుందామని తొందరగాలేచి లోనికి పోబో యాను. కాని ఆయన నన్ను గుమ్మంవద్దనే ఆపివేశారు.

"ఎందుకింత ఖంగారు? పల్లెటూళ్ళలోకూడ యీ పటాటోప మేమిటమ్మా?" అంటూ ఆయన నా తలగుడ్డవంక నగుముఖంతో చూడ నారంభించారు. "మీ బట్లరు గ్రిగరీవుంటే నువ్వు సిగ్గుపడటం లేదుకదా, మరి నేనూ అతనివంటివాడినే" అన్నారు మళ్ళీ. కాని ఆయన చూపు లకు, గ్రిగరీ చూపులకూ అనంతమైన భేదమున్నదని అప్పుడే గుర్తించ గలిగాను. వెన్వెంటనే పెనుసిగ్గుతోడి తొట్రుబాటు నన్నావరించుకుంది.

"ఒక్క నిముషంలో వచ్చేస్తా" అంటూ లోనికి పరుగెత్తాను.

వెనుకనుండి "ఇప్పుడు మార్చకపోతే యేం మునుగుకుపోయిం దమ్మా? చక్కని పల్లెపడుచులు ధరించే దుస్తుల్లాగున్నాయి." అన్న ఆయన ఉచ్చస్వరం వినవచ్చింది.

"ఆయన నాపై బరపిన వీక్షణా లెంత విలక్షణంగా వున్నాయి! ఆయన రావటం బాగా నేవుంది. రోజులు హుషారుగా గడచిపోతాయి" అనుకుంటూ మేడమీద త్వరత్వరగా దుస్తులు మార్చుకున్నాను. అద్దంలో ఒకసారి నా మూర్తిని చూసుకొని చకచకా మేడమెట్లు దిగి వరండా లోకి వెళ్ళాను. తొందరగా దిగి రావటం మూలాన కలిగిన ఆయాసం నా తొందరను బట్టబయలుచేసింది. కాట్యాతో మా ఆర్థిక విషయాలను గురించి మాట్లాడుతున్న ఆయన ఒకమారు తల పైకెత్తి నావంక చూచి చిరునవ్వు నవ్వి తిరిగి సంభాషణలో లీనమైపోయారు. ఆయన చెప్పిన సంగతులనుబట్టి మా ఆర్థికస్థితి మంచి సౌష్ఠవంగా వుందనీ, వేసవి అనంతరం సోన్యా విద్యార్థమై పీటర్సుబర్గు నగరానికిగాని, యితర ప్రదేశాలకుగాని వెళ్ళగలమనీ తెలియవచ్చింది.

"మీరుకూడ మాతో రాగలిగితే యెంతబాగుండును?" అన్నది కాట్యా.

"మీతోబాటు ప్రపంచమంతా చుట్టిరమ్మన్నా చుట్టివస్తాను" అన్నా రాయన సగం హాస్యంగా, సగం గంభీరంగా.

"అయితే నడవండి. ఆలస్యమెందుకు? ప్రపంచం చుట్టివద్దాం" అన్నాను.

ఆయన నవ్వి తలపంకించారు.

"మా తల్లి నేంచెయ్యమన్నావు? మావ్యవహారాలన్నీ యేగంగలో కలపమన్నావు? సరే, ఆవిషయాలన్నీ యెందుకులే యిప్పుడు. నీ కాలం యెల్లాగడిపావు? మళ్లీ నిరాశతో కృంగిపోలేదనుకుంటానేం?" అని ప్రశ్న పరంపరలు కురిపించారాయన.

ఆయన లేనికాలంలో నేనేదో ఒకపనిచేస్తూ కాల మెట్లాగడిపానో ఆయనకు సవిస్తరంగా చెప్పాను. కాట్యాకూడ నేచెప్పిన మాటలను బలపరచగానే ఆయన నావంక దయార్ద్రదృక్కులను బరపుతూ పసి బిడ్డనువలె యెంతో మార్దవంగా మెచ్చుకున్నారు. ఆ విధంగా మెచ్చుకో దానికి తనకు హక్కున్నవానివలె మెలిగా రాయన. ఆయనతో అతి విపులంగా విశదంగా దాపరికం లేకుండా నేను చేసిన పనులన్నింటినీ గూర్చి పూసగ్రుచ్చినట్లు చెప్పాను. ఆయనకు నచ్చని నా ప్రవర్తనను గురించికూడ దైవసన్నిధిని నివేదించుకున్నట్లుగా హృదయపూర్వకంగా వెల్లడించి నా మానసిక భారాన్ని తొలగించుకున్నాను. ఆ సాయం సమయం అతి హృద్యంగా వుండటంచేత టీ పాత్రలు తీయించివేసి వరండాలోనే కూర్చున్నాము. అతి రసవంతంగా సాగిపోతూన్న మా సంభాషణలో లీనమైపోవటంవల్ల యింటిలోని నౌకర్ల కలకలంకూడ క్రమక్రమంగా మా చెవులను జేరటం మానివేసింది. పుష్పసౌరభాలు నలుమూలలనుండీ అంతకంతకధికంగా మమ్మావరించుకొన నారంభిం చాయి. పచ్చిక మంచుతో తడిసిపోయింది. సమీపంగానున్న ఒక లీలక్ పొదలో కోయిల ఒకటి కూస్తూకూస్తూ మా స్వరాలువిని ఆగిపోయింది. మిలమిల మెరిసే నక్షత్రాలతోటి ఆకాశం మా శిరస్సులపై వచ్చి వాలు తోందా అని అనిపిస్తోంది.

అప్పటికే చీకట్లు అలుముకుంటున్నాయి. కాని ఆ విషయం తూరీగ ఒకటి మెల్లగా, ఆకస్మికంగా వరండాలోప్రవేశించి నా తెల్ల శాలువ చుట్టూ తటతట కొట్టుకో నారంభించేవరకూ నేను గుర్తించనే లేదు. నేను గోడకు అనుకుపోయి కేకలువేయ నారంభించాను. కాని అంతలో తూరీగ వచ్చినవిధంగానే శీఘ్రంగా నిశ్శబ్దంగా తోటలోని అర్ధాంధకారంలో మాయమైపోయింది.

"మీ యీ అందమైన యిల్లంటే నా కెంతప్రీతి! నా జీవితమంతా

వరండాలో యిల్లాగేకూర్చువి గడిపెయ్యగలిగితే యెంతబాగుండు నవి పిస్తోంది" అన్నారాయన తన సంభాషణను మారుస్తూ.

"అయితే, అల్లాగే గడిపెయ్యండి!" అన్నది కాట్యా.

"నువ్వుచెప్పేది బాగానేవుంది. కాని జీవితం స్థాణువుకాదనే విషయం మరచిపోతున్నావు" అన్నారాయన.

"మీరు పెళ్ళిచేసుకోరెందుచేత? మీరేకనక యిష్టపడితే మీకంటె మంచిభర్త యెవరులభిస్తారెవరికైనా?" అని అడిగింది కాట్యా.

"ఏం నాకు స్థాణువులా ఒకచోటకూర్చోవటం యిష్టంకనుకనా?" అని ఆయన పక్కున నవ్వారు. "అబ్బెబ్బే కేటరీనా! నాకుపెళ్లేమిటింకా? పెళ్లిపెటాకులూలేవి ఘోటకబ్రహ్మచారిగా లోకులిదివరకే నన్ను జమ కట్టేశారు. నాకైనా ఆవిషయంలో వారితో అభిప్రాయభేదం కించిత్తైనా లేదు. బాధఅంతకన్నాలేదు. ఇల్లా యేబాదరబందీ, చీకుచింతలూలేకుండా వుంటేనే నాప్రాణం హాయిగావుంది."

ఆయన మాటలు రెచ్చగొడుతూన్నట్లుగా విలక్షణంగా కనపడ్డాయినాకు.

"చాల్లెద్దురూ, మాటలునేర్చిపోయారు! ముప్ఫదియారేండ్లకే ముదివగ్గులైపోయారా?" అన్నది కాట్యా.

"కదలక మెదలక ఒకచోట కూర్చోవాలనేవాడు ముదివగ్గుకాక మరేమిటి! పెండ్లికొడుకు కుండవలసిన కోరికేనాఅదిమరి? పోనీ యీవిషయంలో ఆమె అభిప్రాయం కనుక్కొనిచూడు నేచెప్పినది తప్పేమో?" అన్నారు నావంకచూచి తలఊపుతూ. "ఆమెవయస్సు పిల్లలు వివాహమాడితే అందమూ చందమూను, మనం చెయ్యవలసిన దంతా వాళ్లనిచూసి సంతోషించటంమాత్రమే."

ఆయన స్వరంలో దాగొనియున్న విచారము, హద్దులు మీరరాదనే శ్రద్ధాసక్తులు వృధాగాక నామీద బాగాపనిచేశాయి. ఆతర్వాత కొంతసేపు విశ్శబ్దంగా వున్నారాయన. నేనూ, కాట్యాకూడ యేమీమాట్లాడలేదు.

తన ఆసనంలో ఒకవంకకు తిరిగి "మీమాషా—అదే మేరియా అలెగ్జాంద్రోనావంటి పదిహేడేండ్ల అమ్మాయినినేను పెండ్లాడటమనే దుర్ఘటన సంభవించిందే అనుకోండి. మంచిసంగతే. అది సంభవమైతే నాకూ సంతోషమే. అంతకన్న సంతోషకరవిషయ మింకేముంటుంది?" అన్నారాయన.

నాకు నవ్వొచ్చింది. ఆయనకు సంభవించిందేమిటో, సంతోష మెందుకోమాత్రం నాకర్ధంకాలేదు.

వేళాకోళంచేస్తూన్నవారివలె నావంకతిరిగి, "దాపరికంలేకుండా గుండెపైచేయివేసుకుని చెప్పుమాషా, ఆ నీ పడుచుహృదయంలో చెల రేగుతూన్న ఆశాకోర్కెలు భగవంతుని ఊహకుకూడ అందవుకదా? మరి అల్లాంటప్పుడు స్థాణువులా ఒకచోట కూర్చోవాలని కోరుకునే నావంటి ముసలినీరసుని జీవితంతో నీజీవితాన్ని జోడించుకోవాలని కోరుకుంటు న్నావానువ్వు నిజంగా ?" అని ప్రశ్నించారాయన.

తొట్రుపాటుకలిగి ఆయనకేమిజవాబివ్వాలో తోచక ఊరుకున్నాను.

"నన్ను పెండ్లాడమని కోరుతున్నాననుకు నేవుసుమా ? కాని, గోధూళివేళ ఏకాంతంగా తోటలో బారులుతీరిన పచ్చనిచెట్లమధ్య నడ యాడేటప్పుడు నీస్వప్నసమానభావాలలో గోచరమయ్యే నీఆదర్శపతి నావంటివాడేనా నిజంగాచెప్పు మాషా? నావంటివాడేఅయితే అది దురదృ ష్టమే అని చెప్పాలికదా ?" అని అడిగారాయన నవ్వుతూ.

"కాదు, దురదృష్టమన్ని యెందుకనుకోవాలి ?" అంటూ యేదో చెప్పనారంభించాను.

"కాని, దుస్సంఘటనమాత్రం అవును" అని ఆయన నావాక్యాన్ని పూర్తిచేశారు.

"అయితేకావచ్చు. కాని నాయభిప్రాయం పొరపాటుకావచ్చు కదా ?...." ఆయన మరల నామాటలకడ్డువచ్చారు.

"అదుగో చూశావా? నేచెప్పలేదూ! ఆమెచెప్పింది అక్షరాల నిజం. ఉన్నమాట వున్నట్లుగా చెప్పినందుకు ఆమెకు నాకృతజ్ఞత. అసలీ సంభాషణజరిగినందుకుకూడ చాల సంతోషిస్తున్నాను. కాని యింకొక్క విషయంకూడ చెప్పాలి. మరి అదుస్సంఘటనేకనుక సంభవించినట్లయితే అదినాకుకూడా దురదృష్టమేఅని చెప్పాలి" అన్నారాయన.

"బలేవింతమనుష్యులండీ మీరు! పూర్వానికీ యిప్పటికీ పీసమెత్తు మార్పుకూడాలేదుమీలో" అంటూ కాట్యా వరండావదలి రాత్రిభోజనపు ఏర్పాటు చెయ్యటానికై లోనికి వెళ్లింది

మేమిద్దరమూ నిశ్శబ్దంగా కూర్చున్నాము. మాచుట్టూకూడ నిశ్శబ్దం ఆవరించుకొనియుంది. గతరాత్రి ఆగిఆగికూసిన కోయిల తన అవిరామ సంగీతంతో తోటను ముంచెత్తుతోంది. వెంటనే ఆసాయంత్రం వరకు తన గళమెత్తని మరొకకోయిల లోయలోనుండి దానికి జవాబుగా కూయనారంభించింది. తోటలోని కోయిలవింటూన్నట్లుగా ఒక ఘడియఆగి, పూర్వంకన్న తన స్వరస్థాయిని హెచ్చించి గింగురుమనే దీర్ఘ ఆరోహణావరోహణ క్రమమైన సంగీతాన్ని కొనసాగించింది. రేయివిప్పిన నీలిరెక్కలపై పయనముచేసివచ్చిన ఆపక్షుల మృదుమధుర స్వరాలలో రాజార్హమైన గంభీరత తొణికిసలాడుతూంది. తనపడక ప్రదేశమైన పొదరింటిపై పుకుపోతూన్న తోటమాలి మోటుబూట్లధ్వని క్రమక్రమంగా మందగిస్తోంది. కొండవద్ద నెవరో యీలవేసినధ్వని వినవచ్చి ఆవెన్వెంటనే గంభీరనిశ్శబ్దం అలుముకుపోయింది. గాలితాకిడికి ఆకులు కదులుతూన్న శబ్దంమాత్రం వినవస్తూంది. ఒకఅనిర్వచనీయమైన పరిమళం వరండాను నింపివేసింది. అంతకుముందు జరిగిన సంభాషణ తర్వాత నిశ్శబ్దంగా కూర్చోడం అసందర్భంగా తోచింది; కాని యేమి మాట్లాడాలోమఃటుకు పాలుపోక ఆయనవంక చూచాను. అర్థాంధకారంలో మెరుస్తూన్న ఆయనకళ్లు నావంక తిరిగాయి.

"జీవిత మెంత మధురమైనది!" అన్నారాయన.

నేను విట్టూర్చాను- యెందుకనో మాత్రం నా కర్థంకాలేదు.

"కాదూ" అన్నారాయన తిరిగి.

"జీవితం మధురమైనదే" నేనుకూడ రెట్టించాను.

మరల నిశ్శబ్దం ఆవరించింది. దానితో నాలో తిరిగి తొట్రుపాటు జనించింది. ఆయన ముసలివాడేనని ఒప్పుకోవటంద్వారా ఆయన మనస్సును గాయపరిచానని ఊహించుకోకుండా వుండలేకపోయాను. అంతే కాదు; ఆయన మనస్సుకు ఊరటకలిగించాలనే కోరికకూడ కలిగింది. కాని అది యేవిధంగా చెయ్యగలనో మాత్రం నాకు తోచలేదు.

"చాలా ఆలస్యమైపోయింది. మా అమ్మ భోజనంచెయ్యకుండా కనిపెట్టుకుని కూర్చుంటుంది. ఈవేళ కాస్సేపైనా ఆమెవద్ద కూర్చోలేదు. యింక సెలవు" అంటూ ఆయన లేచారు.

"మీకింకా కొత్తపాట వినిపిద్దామనుకున్నానే" అన్నాను.

"తొందరేముందిలే తర్వాత వినవచ్చు" అన్నారాయన.

ఆయన చాల నిరుత్సాహంగా మాట్లాడిన ట్లనిపించింది నాకు.

"సెలవు !"

ఆయన మనస్సును గాయపరిచాననే విషయం నాకు మరింత బాగా అర్థమైంది. అందుకు చాల విచారంకూడ కలిగింది. ఆయనకు వీడ్కోలిచ్చేందుకై నేనూ, కాట్యా మెట్లుదిగి క్రిందకు వెళ్ళి, మా దృష్టిపథము నుండి అదృశ్యుడయ్యేవరకు అక్కడే నుంచున్నాము. ఆయన గుర్రపు గిట్టల చప్పుడు క్షీణించిపోగానే నేను మరల వరండాలోనికి వచ్చి తోట వంకకు చూస్తూ కూర్చున్నాను. నేను చూడాలనీ, వినాలనీ కోరుకున్న వన్నీ కురుస్తూన్న మంచువర్షంలోను, నిశీథసమయ ప్రత్యేకములైన శబ్దాలలోను చాలరాత్రి గడిచేవరకు చూస్తూ, వింటూ అక్కడే కూర్చుండి పోయాను.

ఆ తర్వాత ఆయన రెండుమూడు మార్లు వచ్చారు. ఆ వింత సంభాషణవలన జనించిన అసందర్భ వికారభావం శాశ్వతంగా అంత

రించిపోయింది. ఆ వేసవిఅంతా ఆయన వారానికి రెండుమూడు మార్లైనా వస్తూండేవారు. ఆయన రాకపోకలకు నే నెంతగా అలవాటు పడిపోయానంటే ఆయనకనుక కొన్నిరోజులపాటు మాయింటికి రాకపోయినట్లయితే నాకేమీ తోచకపోవటము, ఆయనపై కోపంరావటమే కాక నన్ను కలుసుకోకపోవడంలో ఆయన చాల దుర్మార్గంగా ప్రవర్తిస్తున్నారనికూడ తలపోసేదాన్ని. ఒక బాలునితోవలె ప్రవర్తించేవారాయన నాతో. ప్రశ్నలడిగేవారు. పూసగ్రుచ్చినట్లుగా విషయమంతా చెప్పమని ప్రోత్సహించేవారు. నా జవాబులు విని ఒక్కొక్కమారు మెచ్చుకొని సలహాలిచ్చేవారు; మరి యొక్కొక్కమారు కూకలువేసి హెచ్చరిస్తూండేవారు. నాతో సమానంగా ప్రవర్తించాలని ఆయన నిరంతరప్రయత్నం యెంతగా చేస్తున్నప్పటికీ ఆయనవిషయంలో నా కర్థమైనభాగం వెనుక వేరేదో మాయలోకం వుందనీ, అందులోనికి నన్ను ప్రవేశించనీయడం అవసరమైనదిగా ఆయన తలుస్తున్నారనీ మాత్రం నాకు పూర్తిగా తెలుసు. ఆ విషయమే ఆయనపట్ల నా గౌరవాన్ని, నాపట్ల ఆయన ఆకర్షణను చిరకాలం నిలపడానికి చాల తోడ్పడింది. కాట్యావల్ల, మా యిరుగుపొరుగువారి వల్ల ఆయన తన ముసలితల్లి పోషణ, రక్షణలు, తన పొలంపుట్ర విషయాలు, మా గృహవిషయాలేకాక అనేక కష్టనిష్ఠురాల కాకరమైన ప్రజాహితైక కార్యాలను కూడ తనపైన వేసుకుని నిర్వహిస్తున్నట్లుగా తెలుసుకున్నాను. కాని ఆయన యెప్పుడూ తన నోటివెంట ఆ విషయాలపట్ల తన అభిప్రాయమేమిటో, తన ఆశయాలు, సంకల్పాలు, కోర్కెలు యేమిటో మాత్రం యెన్నడూ పొరబాటున కూడ వెలిబుచ్చలేదు. ఒక వేళ నేనెప్పుడైనా ఆవిషయమై కావాలని కదిపినా కూడ "అది నీకు సంబంధించిన విషయం కాదు. దయవుంచి ఆవిషయం ఎత్తకు!" అన్నట్లు విలక్షణమైన భ్రుకుటి విక్షేపంచేసి సంభాషణ క్రమాన్ని యితర విషయాల్లపైకి మరలించేవారు. ఆదినాకు ప్రధమంలో బాధనే కలిగించినా

తర్వాత తర్వాత అది సహజమేననే భావంకలిగి, వాస్వవిషయాలు మాత్రమే సంభాషణలో చర్చించేందుకు అలవాటు పడిపోయాము :

నావేష భూషణాదుల విషయంలో ఆయన సంపూర్ణ అలక్ష్యమే కాక, ఒక విధమైన అసహ్యాత కూడ చూపుతూండేవారు. ఆ విషయంలో కూడ నాకాయన ప్రవర్తన ప్రథమంలో బాధను కలిగించినా క్రమ క్రమంగా మాత్రం సంతోషదాయకమైంది. నేనందంగా వుంటానని పలుకువల్లగాని ఆయన యేనాడూ సూచీ ప్రాయంగానైనా వ్యక్తంచేసి యెరుగరు. పైగా తన సమక్షంలో యెవరైనా నా సౌందర్యప్రసక్తి తెస్తే ఆయన కనుబొమలు ముడివేసి, నవ్వేవారు. నాచూపులలో లోట్లను వెతికి, నన్నేడ్పించడంలో కూడ ఆయన సరదా చూపేవారు. పండుగ పబ్బాలు వచ్చాయనేసరికి కాట్యా హడావిడిగా కొత్తబట్టలతో నన్ను సింగారించి, నున్నగాదువ్వి జుట్టును ఆకర్షణీయంగా సవరించేది. అల్లాం టప్పుడల్లా ఆయన నన్ను వేళాకోళంచేసి వేధించేవారు. దయామయి కాట్యా ఆయన ఎగతాళివిని చాల నొచ్చుకునేది; ప్రథమంలో నాకు కూడ బాధగానే వుండేది. ఆయనకు నాపై ప్రేమ జనించిందని కాట్యా నిర్ధారణ చేసుకుంది; కాని తాను ప్రేమించిన స్త్రీ అందమైన వేష భూష ణాదులతో ఆకర్షణీయంగా వుండాలనే కోర్కెలేని ఆ వింతమానవుని మనస్తత్వం మాత్రం ఆమెకు రవంతైనా అర్థంకాలేదు! కాని నేను మాత్రం త్వరలోనే ఆయన ఉద్దేశాన్ని గ్రహించాను. నా ప్రవర్తనలో ఆడంబరం, నటన అనేవి మచ్చుకైనా ఉండరాదని ఆయనభావం. ఆవిషయం నేను గ్రహించగానే నావేషభూషణాదుల్లోను, హావభావా దుల్లోనూ ఆడంబరానికీ, నటనకూ స్వస్తి వాచకం చెప్పేశాను. ఆ నా యౌవనకాలంలోనే నా ఆడంబరత్వం స్థానంలో సహజ సిద్ధమైన నిరా డంబరత్వం చోటు చేసుకుని బలపడిపోయింది. ఆయన నన్ను ప్రేమి స్తున్నారనే విషయంలో నాకేమీ సందేహంలేదు; ఆ ప్రేమ యెట్టిది? నన్ను బాలికగా ప్రేమిస్తున్నారా? స్త్రీగానా? అవి మాత్రం నన్నునేను

అప్పటికింకా ప్రశ్నించుకోలేదు. ఆయన ప్రేమవిలువను మాత్రం నేను గుర్తించాను. ఈ విశాల ప్రపంచంలోని స్త్రీ లందరికన్న నన్ను మిన్నగా ఆయన తలుస్తున్నారని కూడ గ్రహించాను. ఆ విధంగానే ఆయన నా విషయంలో శాశ్వతంగా మోసపోతూ వుండాలని కోరుకోకుండా కూడ ఉండలేకపోయేను. ఆయనను మోసగించాలనే కోరిక నాకు లేకపోయినా ఆయనను మోసగించనూ మోసగించాను; ఆ నా మోసకార్యక్రమంలో పరిశుద్ధురాలనుకూడ అయ్యాను. నాదేహ సౌందర్య ప్రత్యేకతలనుకాక, నామనోవీధులను, నాహృదయపు లోతులను ఆయనకు చూపాలనే గాఢ మైన ఉత్తమమైన తమి నాకు కలిగింది. నా సుందర హస్తద్వయం, దీర్ఘ వినీలకేశాలు, నల్లని నయనద్వయం, హావభావాలు అన్నీ ఆయన అంతకు ముందనేకమార్లు చూసియున్నవే! ఆయనను మోసగించాలనే కోర్కెతప్ప ఆయనకు కొత్తగా చూపగల దేహసంబంధ విశేషాలేమీ లేవు. నామనోహృదయాల నాయన గాఢంగా ప్రేమిస్తున్నారు. జననాభి వృద్ధిక్రమ మార్గంలో ముందుకుపోతున్న నామనోవిచిత్ర వీధులనుగాని, నాహృదయపు లోతులనుగాని ఆయన యెన్నడు చూసి యెరుగరు. మరి ఆవిషయంలో ఆయనను మోసగించనూకలను; మోసగించాను కూడా. ఈ విషయం గ్రహించగానే ఆయన సమక్షంలో నాప్రవర్తన యెంత సుగమము, సులభము అయింది! నా అనవసర ఆడంబర డంబాలు, విలక్షణచేష్టితాలు ఒక్కమారుగా అదృశ్యమైపోయేయి. ఆయన యేవిధంగా చూసినా నన్ను నఖశిఖపర్యంతమూ యెరుగుదురనీ, నా అందచందాలతో, హావభావాలతో ఆయన తన అలవాటుకు విరుద్ధంగా యితరులందరివలెనే నేనందమైనదాన్నని పొగడనారంభిస్తే నాకసహ్యం కలిగేదనుకుంటూ? మా సంభాషణలో నామాటలువిని ఆయన తన ఉద్రే కాన్ని వేళాకోళపునవ్వు వెనుక మరుగుపరచి, తీక్షణంగా నా వంక చూస్తూ: "నీలో మాత్రం 'యేదో' ప్రత్యేకత వుంది! ఉన్నవిషయం చెప్పొద్దూ, నువ్వు బలేపిల్లవ్!" అని ఆయన అన్నప్పుడు నాహృదయ

మెంతగా భారవిముక్తమై, సంతోషపూరితమయ్యేదో చెప్పలేను!

ముసలి గ్రిగరీ తన మనుమరాలిపట్ల చూపు ప్రేమలో నేను సానుభూతి చూపినంత మాత్రాన, ఏదో ఒక గీతం లేక నవల చదివి నప్పుడు హృదయం ద్రవించగా నా నయనాలు అశ్రుపూరితాలయ్యాయని చెప్పినంత మాత్రాన, షులాఫ్ రచనలకన్న మొ జార్ప్ రచనలన్న నాకెక్కువ ప్రీతియని చెప్పినంత మాత్రాన నన్నాయన పై విధంగా మెచ్చుకుని నామనస్సును తృప్తితోను, గర్వంతోను నింపివేసేవారు! ప్రేమింపదగ్గ విషయాలివీ అనే నిశ్చయ భావాలులేని ఆరోజుల్లోనే మంచిచెడ్డల విచక్షణలో నాచురుకుదనానికి నాకే ఆశ్చర్యం కలిగేది. నాపూర్వపు అలవాట్లు, అభిరుచులు ఆయనకు నచ్చేవికావు. నేను చెప్ప బోయే విషయం ఆయన ముందుగానే గ్రహించి, చూపుమాత్రంతోనో, భృకుటి విక్షేపంతోనో తన అనిష్టాన్ని వెల్లడించేవారు. అంతమాత్రం తోనే నా పూర్వాభిప్రాయం మారిపోయినట్లు తోచేది నాకు. ఒక్కొక్క మారు ఆయన నాకివ్వదలచుకున్న సలహా యింకా ఆయన మనస్సులో వుండగానే నాకు బోధపడిపోయేది! నాముఖంలోనికి తన చూడ్కులను బరపుతూ నన్నేదైనా ప్రశ్న అడిగినప్పుడల్లా ఆయన చూపే నానుండి ఆయన కోరిన జవాబును పొందగలిగేది. ఆ రోజుల్లో నాభావాలు, ఉద్దే శాలు యేవీ కూడ నిజానికి నావికావు. అన్నీ ఆయన భావాలకు ప్రతిధ్వ నులే! అవే నాలో ప్రవేశించి, నా స్వంతమైపోయి నా జీవితాన్ని కాంతి మయం చేశాయి. జీవితంపట్ల నా దృక్పథం నాకు తెలియకుండానే మారి పోయింది. కాట్యా, సోన్యా, నౌకర్లు, చాకర్లు, నేను, నా పనిపాటలు అన్నీ నాకు కొత్తగా వింతగా కనుపించ నారంభించాయి. ఒకానొక ప్పుడు కాలం తరలించెయ్యటానికి చదివిన పుస్తకాలీనాడు ఆయన తెచ్చి యిచ్చిన కారణాన, మేమిద్దరమూ కలిసి చదివి చర్చించి నంత మాత్రాన నా జీవితంలో ముఖ్యమైన, ఆనందప్రదాయకమైన వస్తువు లైనాయి. అంతకుముందు సోన్యాకు పాఠాలు చెప్పటం తప్పనిసరి తద్ది

నంగాను. బరువైన బాధ్యతగాను యెంచి నిరుత్సాహంగా నిర్వర్తిస్తూండే దాన్ని. కాని సోన్యాకు పాఠం చెప్తూండగా ఆయన కూడ వచ్చి ఒక మారు పాల్గొన్నప్పటినుంచీ సోన్యా విద్యాబోధన నాకు పరమసంతోష దాయకమైంది. అంతకుముందేదైనా పాట అంతా పూర్తిగా కంఠస్థం చేయటం అసంభవమని తోచేది నాకు. కాని యిప్పుడా పాటను ఆయన విని మెచ్చుకోవచ్చుననే భావంతో నలభై యాభై మార్లు కూడ యేక్ దమ్మున వాయించ నారంభించాను. పాపం కాట్యా మాత్రం వినలేక చెవుల్లో దూదిని పెట్టుకునేది కాని అదేమిచిత్రమో నాకు మాత్రం విసు గనిపించేది కాదు. పాతపాటలే యెంతో శ్రావ్యంగాను, చక్కగాను విని పించేవి. నా ప్రాణసమానురాలైన కాట్యా కూడ నాకొక నూతనవ్యక్తిగా కనుపించ నారంభించింది. మాకు మాతృదేవతలేని లోటు తోచనీయ కుండా ఆజన్మమిత్రురాలివలెను, దాసివలెనూ మాకు సేవచేయవలసిన బాధ్యత ఆమెపై న్యాయానికేమీ లేదని అప్పుడే ప్రప్రథమంగా నాకు బోధపడింది. ఆ ప్రేమమయి ఆత్మత్యాగము, గాఢమైన ప్రేమానురాగాలు తలుచుకోగానే నా హృదయం ఆమెపట్ల అధికతర ప్రేమాదరాలతో నిండిపోయింది. మాదాసదాసీలను, నౌకరు చాకర్లను ఒక కొత్త దృష్టిలో చూడటం నేర్పినది కూడ ఆయనే. వారిమధ్య నేనప్పటికి పది హేడు నిండుసంవత్సరాలు గడిపినప్పటికీ నా కిసుమంతైనా తెలియదని చెప్పుకోటానికి నాకు సిగ్గు కలుగుతోంది. వారికి కూడ నాకువలెనే సుఖ దుఃఖాలు, రాగద్వేషాలు, ఆశాపాశాలు వుంటాయనేభావం ఒక్కమా రైనా నా మనస్సులో అంతకుముందు ప్రవేశించనేలేదు! అంతకుముం దనేక సంవత్సరాలుగా చూస్తూన్న మా పొలంపుట్రలు, తోటలు అన్నీ అకస్మాత్తుగా నూతనంగా, శోభాయమానంగా మారిపోయాయి. ఇతరుల కొరకై త్యాగపూరిత జీవితం గడపటమే జీవితంలోకెల్ల అత్యంత సుఖప్రదమైన విషయం అని ఆయన చెప్పిన వాక్యం పరమసత్యం. అప్పట్లో ఆ విషయం నాకు అర్థంకాక వింతగా తోచినా క్రమక్రమంగా

అనుకోకుండానే అది నా ఆశయంగారూపొందింది. నా జీవిత విధానంలో యేమీ మార్పులు లేకపోయినా, నా మనోభావాలకు ఆయన తన వ్యక్తిత్వాన్ని తప్ప వేరేమీ ఓర్చకపోయినా నాప్రస్తుత జీవితంలో మాత్రం ఆయన అర్థవసమానమైన ఆనందాన్ని చవిచూపాడు. నా చిన్ననాటినుండి జరిగిన ఘటనలన్నీ అకస్మాత్తుగా చైతన్యం పొంది నామనోవీధులలో మెలగనారంభించాయి. ఆయన దర్శన మాత్రాన సర్వవిషయాలూ నాకు స్పష్టమై, సంతోషదాయకా లవుతున్నాయి.

ఆ వేసవికాలంలో మేడపై పడుకున్నప్పుడనేకమార్లు వసంత కాలపు నా నిరానంద, నిరాశాభావాల స్థానంలో అనిర్వచనీయము, అపూర్వమైన ఆనంద తరంగాలుద్భవించి నా మనస్సును నింపివేసేవి. ఆ భావాలతో నిద్రపట్టక కాట్యాపక్క కూర్చొని నేనెంత ఆనందంగా వున్నానో ఆమెకు వెళ్లబోసుకునేదాన్ని. ఆమె స్వయంగా చూసి గ్రహించిన నా ఆనంద విషయం నాకునేనై ఆమెతో చెప్పటం యెంత అనవసరం? అనిపిస్తోం దిప్పుడావిషయం తలుచుకుంటే. కాని ఆమె తాను కూడ చాల తృప్తిగాను, ఆనందంగాను వున్నానని చెప్పి నన్ను ముద్దు పెట్టుకుంది. ఆమెమాటను నేను మనసారా నమ్మాను. ఆ రోజుల్లో ఆమె ఒక్కతేఅన్నమా టేమిటి, యీ జగమంతా ఆనందమయంగా ఉండటం యెంతో అవసరమనీ, సాధ్యమనీ కూడ అనిపించేది నాకు. నా పోదెతో కాట్యాకు నిద్రసరిగా వుండేదికాదు పాపం. ఆమె కోపం తెమ్చుకున్నదానివలె నన్ను తన పక్కపైనుండి త్రోసివేసి నిద్రపోయేది. నేను మాత్రం గంటల తరబడి నాపక్కపై కూర్చుని నా ఆనందకారణాల కొరకై వెతుకులాడేదాన్ని. ఒక్కొక్కమారు దైవప్రార్థన తిరిగి తిరిగి చేస్తూ నాకు కలుగజేసిన ఆనందానికై నా స్వభాషలో భగవంతునికి కృతజ్ఞత తెలిపేదాన్ని.

గది అంతా గాఢ నిశ్శబ్దం ఆవరించుకునివుంది. నిద్రించుతూన్న కాట్యా శ్వాసనిశ్వాసలు, గడియారపు టిక్కుటిక్కుధ్వనీ తప్ప వేరు

శబ్దమేదీ వినరావటంలేదు. తలుపులు, కిటికీరెక్కలు వేసివున్నాయి. తూరీగ కాటోలు ఒకటి జుంయ్‌మంటూ గదివెలుపల యెగురుతూన్న ధ్వని వినవస్తూంది. ఆ గదిలోనే శాశ్వతంగా వుండిపోవాలనీ, యిక ఉదయం కానేరాదనీ, నా అప్పటి మనోవైఖరీ, స్థితీ శాశ్వతంగా మారకుండా అల్లాగే ఉండిపోవాలనే గాఢమైన కోర్కె గలిగింది! నా స్వప్నాలు, ప్రార్థనలు సజీవాలనీ, అవి ఆ అంధకారంలో నా చుట్టూ ముసురుకుంటున్నాయనీ, నాపై వాలుతున్నాయనీ అనిపించ సాగింది. ఆయన భావాలే నా భావాలు; ఆయన యిష్టానిష్టాలే నా యిష్టానిష్టాలు. అప్పటికింకా అది ప్రేమయని నాకు తెలియదు. కాని పరిస్థితులన్నీ యెన్నటికీ ఆ విధంగానే కొనసాగిపోవచ్చుననీ, దారిలో కష్టనష్టాలుండవనీ అనాటి నా భావం!

# అధ్యాయం 3.

ఆ రోజున మా పొలంలో కట్టివేత జరుగుతోంది. కాట్యా, సోన్యాలతో నేనువెళ్ళి తోటలో లోయఅంచున గుబురైన నిమ్మచెట్లనీడలో పొలం చక్కగా కనుపించే ఒక మనోజ్ఞమైన ప్రదేశంలోవున్న బల్లపై కూర్చున్నాను. అప్పటికప్పుడే సెర్జీమిఖాలిచ్ మాయింటికి వచ్చి మూడు రోజు లైపోయింది. ఆ రోజున వస్తారని యెదురుచూస్తూన్నాం. పైగా ఆయన పంటపొలం చూడటానికి వస్తామన్నారని మా రైతుకూడ చెప్పటంవలన తప్పక వస్తారని నిశ్చయించుకునాము. మధ్యాహ్నం రెండుగంటలవేళ గుర్రంపై 'రైతు' పొలానికి వచ్చిన ఆయనమూర్తి మా కంటపడింది. కాట్యా చిరునవ్వు ముఖంతో నావంక తిరిగి కండ్లెగరవేసి ఆయన కతిప్రియమైన చెర్రీ, పీచ్ ఫలాలు కోసుకురమ్మని పురమాయించి బెంచిపై ఒరిగి కునుకనారంభించింది. ఒక నిమ్మరెబ్బ విరిచి దానితో కాట్యాకు విసురుతూ, మధ్యమధ్య ఆయన వస్తున్నారేమోనని బాటవంక చూస్తూ పుస్తకం చదువుకుంటున్నాను. ఒక పెద్ద నిమ్మచెట్టు మొదట సోన్యా బొమ్మరిళ్లను బహుశ్రద్ధగా కడుతోంది. ఆకు అల్లాడటం లేదు. బహుఉక్కగా వుంది. సూర్యుడు నిప్పులు చెరుగుతున్నాడు. ఆకాశంలో మేఘాలు గుబురుకొని నల్లపడ నారంభించాయి. ఉదయమంతా ఉరుములు ఫెళఫెళార్భటులు చేశాయి. మామూలుగానే ఉరుములకు ముందు నా హృదయావేదన తీవ్రతరం కానారంభించింది. కాని పొద్దు తిరిగేసరికి మేఘాలన్నీ మాయమయ్యాయి. మేఘ వివిర్ముక్తుడైన సూర్యుడు మరింత కాంతివంతంగా ప్రకాశించ నారంభించాడు. ఒక ప్రక్కమాత్రమే కొలదిగా మేఘగర్జన వినవస్తూంది. పొలాలలో రేగిన దుమ్ము క్రిందుగా పయనిస్తూన్న ఒక దట్టమైన మేఘంలో కలిసి పోయింది. మెరుపులు ఆ దట్టమైన మేఘాన్ని కూడ చీల్చుకుని ప్రకాశించి, భూగర్భంలో అదృశ్యమవ నారంభించాయి. ఈ రోజుకు వర్షం

దాటిపోయినట్లే! కనీసం యీ ప్రాంతంలో కురవదు. తోటకావలివంక నున్న బాటవెంబడి ధాన్యపుమోపుల బరువుతో కిరకిరలాడుతూ వరుసగా పోతున్న బండ్లు చెట్లసందులనుండి కానవస్తున్నాయి. ఖాళీబండ్లు టకటక శబ్దంచేస్తూ పరుగులు తీస్తున్నాయి. బండ్ల నడకతో లేచి యేర్పడిన దట్టమైన ధూళిమేఘాలు పైకిపోక, క్రిందికిరాక చెట్లఆకుల సందునుండి మాకు తోటలోనికి కానవస్తున్నాయి. కొంత దూరంలోనున్న కుప్పల దొడ్డిలో ఆ స్వరాలే, ఆ బండ్ల కిరకిరశబ్దాలే వినవస్తున్నాయి. ముండ్ల కంచెవెంట నెమ్మదిగా సాగివెళ్లిన ఆ బంగరు వర్ణపుపనలే యిప్పుడు పైకి యెగురుతున్నాయి. గుండ్రని కుప్పలు పైపైకి పెరుగనారంభించాయి. కూలీలు కుప్పల శిఖరాలను కోసుగా సర్దటం స్పష్టంగా కనిపిస్తోంది. ముందున్న పొలాలనుండి పనలు కడుతూన్న కూలీల పాటలు అవ్యక్తమధురంగా వినవస్తున్నాయి. పనలబండ్లు నిరంతరాయంగా కిరకిర శబ్దాలతో వస్తూనేవున్నాయి. ఒక వంకనుండి ధాన్యపుదంట్లతోను, మధ్యమధ్య కలుపు మొక్కలతోను నిండిన ఖాళీప్రదేశం పెరుగ నారంభించింది. కుడిప్రక్క పొలాలలో వంగి పనలుకడుతూన్న కూలిపడుచుల రంగురంగుల దుస్తులు నేత్రోత్సవం చేస్తున్నాయి. ధాన్యపుదంట్లక్కడ ముందసహ్యంగా కనిపించినా, అందమైన బంగరు రంగుపనలు వరుసలలో సమదూరంలో వుండటంచేత చాల అందంగా కనిపించనారంభించాయి. చూస్తూచూస్తూండగానే వేసవి గడిచిపోయి ఆకురాలు కాలం ప్రారంభమైనట్లు తోచింది. తోటలో మేము కూర్చున్న చల్లని పదేశంలో తప్ప చుట్టూ ఎండ మండిపోతూంది. సుడిగాలులతో బాటు ధూళిమేఘాలు ప్రసరిస్తున్నాయి. అల్లాంటి మండుటెండలో, ధూళిదుమారంలో కూడ కూలీలు నడుములు యెత్తకుండా కబుర్లు చెప్పుకుంటూ పని చేస్తూనేవున్నారు!

ఈలోగా కాట్యా తెల్లసిల్కు జేబురుమాలు ముఖంపై కప్పుకుని చల్లని నీడలో బెంచిపై గాఢంగా నిద్రపోతూంది. పళ్లెరంలో రసవంత

మైన చెర్రీపండ్లు నల్లగా నిగనిగ మెరుస్తూ నోరూరిస్తున్నాయి. మా దుస్తులు అతిపరిశుభ్రంగా వున్నాయి. పరిశుభ్రమైన గాజుపాత్రలోని నీటిలో సూర్యకిరణాలు ప్రతిబింబించి ఇంద్రధనస్సులోని సప్తవర్ణాలను గోచరింపచేస్తున్నాయి. మరి నా ఆనందానికి అవధిలేకపోయింది: "సంతోషంగా వుండకుండా యెల్లాఉండకలను? సంతోషంగా వుండటంలో పోనీ పొరపాటేమివుంది? నా సంతోష పారవశ్యంలో యెవరికి పాలు పంచిపెట్టను? నా తను మనోప్రాణాలను, నా అవధిలేని ఆనంద సర్వస్వాన్నీ యెవరికి, యెట్లాగు సమర్పించుకోను?" అనే ప్రశ్నలు నా మనస్సులో చెలరేగాయి.

అప్పటికి సూర్యుడు బిర్చి వృక్షాగ్రాలక్రిందకు వ్రాలాడు. రేగిన ధూళిమేఘాలు క్రమంగా అణిగిపోయాయి. ఏటవాలుగా ప్రసరిస్తూన్న సూర్యకిరణకాంతిలో దూరానవున్న వస్తువులుకూడ సుస్పష్టము, కాంతివంతము అయ్యాయి. మేఘాలు పూర్తిగా చెదరిపోయాయి. కొత్తగా లేచిన మూడు ధాన్యపుకుప్పల కొనలూ చెట్లసందునుండి కానవస్తున్నాయి. కూలీలు కుప్పలదొడ్డి నుండి తిరిగి వస్తున్నారు. ఖాళీబండ్లు దడదడమను శబ్దంతో ఆనాటికి ఆఖరుసారు వేగంగా మమ్మల్ని దాటిపోయాయి. కూలిపడుచులు చేటలు, మోపులుకట్టే త్రాళ్లు తీసుకొని బిగ్గరగా పాడుకుంటూ యిండ్లకు తిరిగి వెడుతున్నారు. అప్పటికీ సెర్జీమిఖాలిచ్ వచ్చే జాడలేమీ కనిపించలేదు. పొలానికి చాలాసేపై వచ్చేరే యింకా రాలేదేమబ్బా అని ఆలోచిస్తున్నాను. అంతలోనే అకస్మాత్తుగా లోయమట్టి నేనూహించని ఒక ప్రక్కనుండి టోపీ చేతపట్టుకుని, వేగంగా సంతోషపూరితవదనంతో వచ్చారు. నిద్రపోతూన్న కాట్యాను చూచి శబ్దం చేసినందుకు నాలుక కరుచుకొని, కన్నులరమోడ్చి మునివ్రేళ్లపై అతినిశ్శబ్దంగా ముందుకు వచ్చారు. ఆయన అదొకవిధమైన అకారణానందావస్థలో వున్నారని నేను వెంటనే గ్రహించేశాను. 'ఉన్మత్తానందం' అని మేము పిలుస్తూండే అట్టి ఆనందావస్థలో, ఆయనను

చూడటమంటే నాకు మహాసరదా. అప్పుడాయన సరిగా స్కూలుకు వెళ్లటం యెగకొట్టి తిరిగే పెంకిపిల్లవాడిలాగున్నారు. ఆయనమూర్తి ఆపాద శిరఃపర్యంతమూ తృప్తితోను, బాల్యోచితమైన ఆనందోల్లాసాల తోను నిండిపోయి వున్నట్లుగా తోచింది నాకు.

"ఏం గులాబీ, కులాసాగా వున్నావా ? విశేషాలేమిటి ?" అతి నెమ్మదిగా అన్నారాయన నాకరసంచాలనంచేస్తూ. తర్వాత నా ప్రశ్నకు జబాబుగా "ఓహ్ ! పదమూడేండ్ల బాలునిలాగున్నా నీవేళ. చెట్లెక్కె య్యాలనీ, పుట్టలు దాటెయ్యాలన్నంత హుంషారుగా వుంది." అన్నా రాయన.

"అది ఉన్మత్తానందం కాదుగదా ?" నవ్వుతూ మెరుస్తూన్న ఆయన కండ్లలోనికి చూస్తూ నేనన్నాను. అప్పటికే కొంతవరకు ఉన్మత్తా నందం నన్ను కూడ ఆవేశించినట్లయింది.

నవ్వును బలవంతాన ఆపుకుంటూ, కండ్లెగురవేసి "అవునుగాని, నువ్వు కాట్యాముఖాన్ని అకారణంగా తాడించవలసిన అవసర మిప్పు డేమొచ్చిందో మాత్రం నా కర్థంకావటంలేదు" అన్నారాయన.

ఆయన ముఖంవంక చూస్తూ కాట్యాకు నిమ్మరెబ్బతో యింత సేపూ విసురుతూనే వున్నాను. అప్పటికి నాకు తెలియకుండానే జేబు రుమాలు తొలిగిపోగా, కాట్యాముఖంపై రాస్తూవుండటం చూసి నాకు కూడా నవ్వు వచ్చింది.

"అసలు తానింత సేపూ నిద్రపోనేలేదంటుంది కాట్యా" నే నతి నెమ్మదిగా అన్నాను కాట్యాకు నిద్రాభంగం చేయరాదన్నట్లుగా. కాని ఆయనతో అస్పష్టస్వరంతో సంభాషించాలనే నా ఆకాంక్షే నా మంద స్వరానికి నిజమైన కారణం !

నా స్వరం వినరాలేదన్నట్లుగా నటిస్తూ ఆయన కూడ నావలెనే పెదిమలు కదుప నారంభించాడు. చెర్రీపళ్ల పళ్లెరాన్ని చూచి, దాన్ని తస్కరిస్తూన్నట్లు నటిస్తూ, నిమ్మచెట్టుక్రింద కూర్చుని బొమ్మరిళ్లమధ్య

బొమ్మలతో ఆడుకుంటూన్న సోన్యావద్దకు వెళ్లి సోన్యా బొమ్మరిళ్లపై దళేలుమని కూర్చున్నారు. సోన్యాకు మొదట కోపం వచ్చినా చెర్రీపళ్లెవ రెక్కువ తింటారని పోటీ పెట్టుకుని దానితో ఆయన రాజీచేసుకున్నారు.

"కావాలంటే యింకా కొన్ని చెర్రీలు తెప్పిస్తాను. లేకపోతే మనమే వెడదామంటారా?" అని అడిగాను.

ఆయన చెర్రీపళ్ల పళ్లేన్ని పట్టుకుని, దాంట్లో సోన్యా బొమ్మలు పెట్టి తోటవైపుకు నడువ నారంభించారు. సోన్యా నవ్వుతూ తన బొమ్మల నిచ్చివెయ్యమని ఆయన కోటుపుచ్చుకు వేళ్లాడుతూ మా వెనుక పరుగెత్తు కుంటూ రానారంభించింది. బొమ్మలు దానికిచ్చివేసి నా వంక తిరిగి గంభీరంగా మాట్లాడ నారంభించారు.

"మాషా! నువ్వు నిజంగా ముద్దుగులాబివే సుమా. ఆ దుమ్ములో వేడిలో పొలాలన్నీ తిరిగి తిరిగి యిక్కడికి వచ్చేసరికి నా మనస్సుకెంత శాంతికలిగింది? కానైతే, నువ్వు మన ఆవరణల్లో పూసే మామూలు గులాబివి మాత్రం కాదు. అడవుల్లో పూసి ఉషఃకాంతిలో మంచుతో తడిసి సువాసనలు విరజిమ్మే ముద్దుగులాబివి" ఎవరినీ లేపే ప్రమాదం లేకపోయినా నెమ్మదిగానే అన్నారాయన.

"ఈ యేడు కోతలు బాగా సాగుతున్నాయా?" అంటూ నేను ప్రసంగం మార్చాను ఆయన పొగడ్త నాలో కలిగించిన సంతోష మిశిత మైన పంభ్రమాన్ని కప్పిపుచ్చటానికని.

"మాంచి జోరుగా సాగుతున్నాయి. మన ప్రజలున్నారే నిస్సందేహంగా అద్భుతమైన మనుష్యులు! వారి మంచిచెడ్డలను గురించీ, సుఖ దుఃఖాలను గురించీ మనకు అవగాహన అయినకొద్దీ వారి నంత కంత కధికంగా ప్రేమిస్తాం!" అన్నారాయన.

"అవునవును. ఇంతసేపూ వారివిక్కడనుండి చూస్తూ కూర్చున్నాను. నిజంగా వారావిశ్రంగా మండుటెండలో చెమట నోడుస్తూ బండ చాకిరీ చేస్తూంటే నా మటుకు నేనిక్కడ సుఖంగా కాలుమీద కాలువేసు

కూర్చుంటూన్నందుకు నా మనస్సు సిగ్గుతో ముకుళించుకు పోయిం దంటే నమ్మండి. అందుకని......" అంటూ యింకేమో చెప్పబోయేను.

దయాపూరితము, నిశితమైన చూపుతో ఆయన మధ్యలోనే అడ్డు వచ్చి "అంత పవిత్రమైన విషయాన్ని గురించి తేలిగ్గా మాట్లాడకూడదు మాషా! ఆడంబర పద జాలం వాడి, శుష్కసానుభూతి ప్రకటించేసి అంతతో సంతృప్తి పడవలసిన మామూలు విషయం కాదని గుర్తుం చుకో" అని హెచ్చరించారాయన.

"మీతోనేకదా అని యీ విషయం చెప్పామగాని లేకపోతే యీ విషయం యెత్తుతానంటారా?" అన్నాను.

"సరే, సరే! మరి చెర్రీపళ్ల సంగతేమిటి"? అన్నారాయన.

తోట తలుపు మూసివుంది. తాళంచెవి కోసకు వెళ్లిన తోటమాలి వద్ద నుంది. సోన్యా తాళంచెవికోసం పరుగెత్తుకు వెళ్ళింది. అది వచ్చే వరకూ ఆయన ఆగక ప్రహారీగోడ యెక్కి లోనికురికారు.

"నీ క్కాసిని చెర్రీలు కావాలంటే గిన్నె యిటియ్యి" అని గోడ ఆవలనుండి కేకవేశారాయన.

"అక్కర్లేదు. నేనే కోసుకోవాలని వుంది. సోన్యాకు తాళంచెవి దొరకదు, నేనే వెళ్లి తీసుకువస్తాను" అని జవాబిచ్చాను నేను.

కాని అకస్మాత్తుగా తా నేకాంతంగా ఉన్నాననీ, తన్నెవ్వరూ చూడటంలేదనీ ఆయన అనుకునే సమయంలో యేమిచేస్తున్నారో, యెల్లాగున్నారో చూడాలనే గాఢమైన వాంఛ కలిగింది. పైగా అప్పటి నా మానసికస్థితిలో ఆయన్ని చూడకుండా ఒక్కక్షణం కూడ వుండటం నా కభిమతం కాలేదు. దూలకొండి తుప్పలను తప్పించుకుంటూ ముని వ్రేళ్లపై నిశ్శబ్దంగా ప్రహారీగోడ యెత్తు తక్కువగా వున్నవైపుకు పరు గెత్తుకువెళ్లి అక్కడనున్న ఒక ఖాళీపీపాపై యెక్కి గోడపై వంగి లోనికి చూచాను. పెద్దపెద్ద నొక్కుల ఆకులతోను, నల్లని రసవంతమైన చెర్రీపండ్లతోను అలరారుతూన్న వృక్షాల మధ్యనుండి చెర్రీమిఖాలిచ్ కాన

వచ్చారు. నేను శాలంచెవి కోసం వెళ్లాననీ, తన్నెవ్వరూ చూడటంలేదనీ ఆయన అనుకుని వుంటారు! ఒక దుంగపై కూర్చుని టోపీ ప్రక్కను పెట్టి కండ్లరమోడ్చి యేదో దీర్ఘాలోచనలో మునిగిపోయి వున్నారు. అంతలోనే భుజాలెగురవేసి, కండ్లు తెరిచి యేదో గొణుగుతూ విలక్షణంగానవ్వారు. ఆయన కలవాటులేని ఆ విలక్షణమైన నవ్వు, మాటలు చూసి రహస్యంగా వింటూన్నందుకు సిగ్గుతో నాశిరం వంగిపోయింది. ఆయన 'మాషా!' అన్నట్లుగా అస్పష్టంగా వినవచ్చింది. కాని అది అసంభవం అనుకున్నాను. 'ప్రియమైన మాషా!' అన్న ఆయన ప్రేమార్ద్ర మార్దవస్వరం మరల మధురంగా, స్పష్టంగా వినిపించింది. దానితో నా హృదయం అమందానందతుందిల మైపోగా పడిపోతానేమో ననే భయంతో గోడను మరింత గట్టిగా పట్టుకునే ప్రయత్నం చేశాను. నా కదలికవలన కలిగిన శబ్దానికి ఆయన త్రుళ్లిపడి నా వంక తిరిగారు—అంతలోనే ఆయన ముఖం దించేశారు. ముఖమంతా చిన్న పిల్లవాని ముఖంవలె ఎఱ్ఱగామారి, నల్లపడిపోయింది. ఆయన మాట్లాడుటకు విశేష ప్రయత్నం చేసి కూడ ఒక్కమాటైనా మాట్లాడలేకపోయారు. అయినప్పటికీ మేమొకరివంక మరొకరం చూసుకునేసరికి మాకిద్దరికీ నవ్వు వచ్చింది! ఆ నవ్వుతో ఆయన వదనమంతటా సంతోషకాంతులు మెరిశాయి. నాలో తప్పులు సరిదిద్దుతూ మంచిచెడ్డలు విడమరచి బోధించే వయోధికుని స్వభావ మాయనలో లోపించిపోయినట్లుగా తోచింది. నేనే విధంగా ఆయనపట్ల ప్రేమగౌరవాలు, భయభక్తులూ కలిగివున్నానో అదే విధంగా ఆయన కూడ నా పట్ల ప్రేమగౌరవాలు, భయభక్తులు గల నాతో సముడైన వ్యక్తిగా కనిపించారు. ఇరువురమూ ఆ అవస్థలో కొంతసేపు నిశ్శబ్దంగా వుండిపోయాం. కాని అకస్మాత్తుగా ఆయన కనుబొమలు ముడిపడ్డాయి. పెదిమలపై అంతవరకూ చిందులాడే చిరునవ్వు మాయమైంది. కండ్లలో అంతవరకూ వెలిగిన జ్యోతి క్షీణించింది. అంతసేపూ మేమేదో తప్పుచేస్తూన్నట్లూ, తానన్దుకు పశ్చా

త్తాపం చెందినట్లు, నన్నుకూడ పశ్చాత్తాపం పొందమన్నట్లూ ఆయన తన పూర్వ వయోధిక స్వరంతో యిట్లా అన్నారు:

"దిగు, దిగు! క్రిందపడితే యేకాలో, చెయ్యో విరుగుతుంది కూడా. ఆ జుట్టూ అదీ సరిజేసుకో యెల్లా రేగిపోయిందో!"

'ఎందుకింత నటన? నన్నెందుకిల్లా బాధించాలను కుంటున్నారాయన?' అనుకున్నా నెంతోవిసుగ్గా నా మనస్సులో. ఆదేక్షణంలో ఆయన మనోశాంతిని భగ్నంచేసి, ఆయనపై నాకుగల ప్రభావ ప్రాబల్య మెంతో తేల్చుకోవాలనే తీవ్రవాంఛ కలిగింది.

"నేను దిగను. పళ్లు నేను కూడా యేరుతాను" అంటూ ఆయన నాకు సాయం చేయటానికి వచ్చేలోపుగానే గోడదాటి తోటలోవి కురికాను.

"ఏమిటి పిచ్చిపనులు? దెబ్బయేమీ తగల్లేదుకదా? అవునుగాని మళ్లీ అవతలకు వెళ్లటమెట్లాగో యేమైనా ఆలోచించావా?" సిగ్గుతో యెర్రబడిన ముఖంతో ఖంగారుపడుతూ అన్నారాయన మెల్లగా.

ఆయన నేను గోడపై యెక్కినప్పటికన్న యెక్కువ కంగారు పడ్డారు. కాని ఆయన ఖంగారు అప్పటివలె నాకు సంతోషాన్ని కలిగించ లేదు. సరికదా, నాలో భయాన్ని పురికొల్పింది. ఆయనవలె నాకు కూడ కంగారు కలిగి, దానితో నా శరీరమంతటా సిగ్గు దొంతరులు ప్రసరించాయి. ఆయన ముఖంవంక తలయెత్తి చూడలేక, ఆయనతో యేమి మాట్లాడటానికీ తోచక వేసుకోడానికేమీ నా దగ్గర లేకపోయినప్పటికీ చెర్రీపళ్లు ప్రోగుచేయ నారంభించాను. నేను చేసిన తొందరపనికై నన్ను నేను నిందించుకుని, పశ్చాత్తాపపడ్డాను. నా మూర్ఖత్వం వలన ఆయన సదభిప్రాయాన్ని శాశ్వతంగా కోల్పోయానేమోనని చాల భయపడ్డాను. మే మిద్దరము నిశ్శబ్దంగా, చాల గాబరాగా వున్నాము. అట్లాంటి క్లిష్ట పరిస్థితి నుండి తాళంచెవి పుచ్చుకు పరుగెత్తుకువచ్చిన సోన్యా మమ్మల్ని కాపాడింది. కొంతసేపటివరకు మా యిద్దరి సంభాషణా సోన్యాతోనే జరి

గింది. మాలోమేమేమీ మాట్లాడుకోలేకపోయాం. కాట్యావద్దకు మేము తిరిగి రాగానే ఆమె తానింతసేపూ మేల్కొనే వున్నానని మాకు నమ్మ చెప్పింది. ఆయన తన పూర్వపు వయోధిక ప్రవర్తన తిరిగి ప్రారంభించారు. కాని దానితో నేను మాత్రం మోసపోలేదు. కొద్దిరోజుల క్రితం మా మధ్య జరిగిన సంభాషణ ఒకటి తలపుకు వచ్చింది.

"తాను ప్రేమించిన వ్యక్తికి ప్రేమ నివేదన చేయటం స్త్రీకికన్న పురుషునకే సులభతరం. పురుషుడు తాను ప్రేమిస్తున్నానని చెప్పకలడు; మరి స్త్రీ ఆవిధంగా వెల్లడించలేదు." అన్నది కాట్యా.

"అది నే నొప్పుకోను. పురుషుడెప్పుడూ చెప్పకూడదు; తాను ప్రేమిస్తున్నానని చెప్పలేడు కూడా" అని జవాబిచ్చారాయన.

"ఏం? ఎందుచేత?" అని నేను ప్రశ్నించేను.

"ఎందుకంటే అదెప్పుడూ సత్యము, సాధ్యమూ కాదుకనుక. మగవాడు తాను 'నిన్ను ప్రేమిస్తున్నాను!' అన్నంతమాత్రాన, అన్నప్పుడల్లా అద్భుతాలు జరిగిపోతూ వుంటాయనుకుంటూ వుంటాడు. నిన్ను ప్రేమిస్తున్నాననేవాడల్లా తన్ను తాను మోసగించుకోవడం గాని, అంతకు మించిన దారుణం యితరులను మోసగించడం గాని చేస్తున్నాడని నా ఉద్దేశం" అన్నారాయన.

"మరి, స్త్రీకి తననొక పురుషుడు ప్రేమిస్తున్నాడని తెలుసుకోడానికి మార్గమేమిటి?" అని అడిగింది కాట్యా.

"ఆ సంగతి నాకు తెలియదు. ఒక్కొక్కవ్యక్తి తన భావాలను ఒక్కొక్క విధంగా వెల్లడిస్తూంటాడు. అసలా ప్రేమ భావమే వుంటే అది యేదో ఒక విధంగా వెల్లడికాకమానదు. అంతేగాని నవలల్లోలాగ 'ఓ ప్రేయసీ! నా హృదయరాజ్ఞీ!' అని చిన్నబోయిన ముఖంతో నాయకుడు అనేసరికల్లా ఒక్కమారుగా పరిస్థితులు సానుకూలం కావటం చదువుతూంటే నాకు కడుపుబ్బ నవ్వు వస్తుంది!" అన్నారాయన.

ఆయన పరిహాసం వెనుక నాకు అన్వయించే ముఖ్యవిషయమేదో వుందని అప్పుడే అనుకున్నాను.

"మీ కెప్పుడూ పరిహాసాలేనండీ! ఏ స్త్రీతోనూ మీ రెప్పుడూ ప్రేమిస్తున్నానని చెప్పలేదని గుండెపై చెయ్యివేసుకుని చెప్పగలరా?" అన్నది కాట్యా నవలల్లో కథానాయకుల గూర్చిన ఆయన అభిప్రాయాన్ని ఖండిస్తూ.

"ఇదివరకు అల్లా ప్రేమ నివేదన చెయ్యలేదు సరికదా యిక ముందు కూడ నాకు నేనై ఆ విధంగా చెప్పను" అన్నారాయన నవ్వుతూ.

ఆ సంభాషణ నాకు జ్ఞాపకంరాగానే తాను నన్ను ప్రేమిస్తున్నానని చెప్పవలసిన అవసరం లేదనిపించింది. "ఆయన నన్ను ప్రేమిస్తున్నారని నాకు తెలుసు. ఆయన చూపే అసహజమైన అలక్ష్యంకూడ నా అభిప్రాయాన్ని మార్చలేదు" నే ననుకున్నాను.

ఆ సాయంత్రమంతా నాతో ఆయన మాట్లాడినది తక్కువే అయి నప్పటికీ కాట్యా. సోన్యాలతో ఆయన అన్న ప్రతి మాటలోను, ఆయన ప్రతిచూపులోను, కదలికలోను ప్రేమను నేను స్పష్టంగా గుర్తించగలిగాను. పరిస్థితులన్నీ సానుకూలంగా వుండి అమందానందాన్నాస్వాదించటానికి సమస్తావకాశాలూ వున్న యిప్పుడు కూడ ఆయన తన మనోభావాలను దాచుకుని, అలక్ష్యం ప్రదర్శించాలనుకోవడం అనవసరంగాను, విసుగు పుట్టించేదిగాను తోచింది నాకు. కాని నేను తోటలోనికి ఉరికిన విషయంమటుకు యేదో తప్పిదంవలె నా మనస్సును పీడిస్తూనేవుంది. నా పట్ల ఆయనకు గల సద్భావం తొలగిపోయిందనీ, కోపం కలిగిందనీ ఆరాటపడుతూనే వున్నాను.

టీ త్రాగాక పియానో దగ్గరకు వెళ్తూంటే నా వెంటనే ఆయన కూడ వచ్చి "మాషా! యేదైనా పాట వాయించరాదూ—నీ పాటవిని చాలారోజులైంది" అన్నారాయన.

"వాయిద్దామనే వస్తున్నాను!" అని ఆయన ముఖంలోనికి

చూస్తూ తొందరగా "నా మీద మీకు కోపం రాలేదుకద ?" అని అడిగాను.

"కోపమెందుకు మాషా ?" అన్నారాయన.

"ఈ సాయంత్రం మీ మాట ధిక్కరించినందుకు" అన్నాను సిగ్గు పడుతూ.

ఆయన సంగతి వెంటనే అర్థం చేసుకుని నేను తప్పే చేశానని. కాని తానందుకై నన్ను నిందించే స్థితిలో లేనట్లుగా తలఊపి ఊరు కున్నారు.

పియానోముందు కూర్చుంటూ "అయితే మన తగవు పరిష్కారమై పోయినట్లేగా ?" అని అడిగాను.

"ఆఁ పూర్తిగా !" అన్నారాయన.

పియానో కిరువైపులా రెండు క్రొవ్వువత్తులు మాత్రం వెలుగు తూండటంచేత గది అంతటా అర్ధాంధకారం వ్యాపించివుంది. తెరచి యున్న కిటికీలనుండి ఆకాశం కాంతివంతంగా కానవస్తూంది. చీకటిగా వున్న వరండాలోనికి అప్పుడప్పుడు పనిపై వచ్చిన కాట్యా పదధ్వనీ, కిటికీ క్రింద కట్టబడియున్న ఆయన గుర్రపు సకిలింపుల, పదఘట్టనల ధ్వనీ తప్ప ప్రకృతి అంతా నిశ్శబ్దంగా వుంది. ఒకమూల చీకట్లో కూర్చున్న సెర్జీ నాకు కానవచ్చుటలేదు. కాని గదిలోని ఆ అర్ధాంధకారం లోను, ప్రతి శబ్దంలోను, నాలోను ప్రతిచోట కూడ ఆయన సాక్షాత్కారం నేను అనుభవిస్తున్నాను. నాకు కనిపించక పోయినప్పటికీ ఆయన ప్రతి చూపు. ప్రతి కదలిక నా హృదయాన్ని స్పందింప చేస్తోంది. ఆయన సాన్నిధ్యంలో, ఆయన కొరకై నేను నేర్చుకున్న పాటను వాయించాను. నేను బాగా వాయిస్తున్నాననీ, ఆయన మెచ్చుకొంటున్నారనే తప్ప బాహ్యస్మృతే నాకు లేదు. ఆయన సంతోషిస్తున్నారనీ, నా వంక తదే కంగా తన్మయత్వంతో చూస్తూంటారనీ నా నమ్మకం. ఆ నమ్మకంతోనే అనుకోకుండా పియానో వాయిస్తూనే ఆయనవంకకు తిరిగాను. చీకటిలో చేతులపై ఆన్చుకొనియున్న ఆయన తల అస్఩ుటంగా కానవచ్చింది.

నా వంకనే తదేకంగా చూస్తూన్న కండ్లు మిలమిల మెరిసిపోతున్నాయి. నేను పియానో ఆపి నవ్వాను. ఆయన కూడ నవ్వి వాయిద్యం ఆపినం దుకు నిందాపూర్వకంగా తల నాడిస్తూ వాయించమని హెచ్చరించారు. అప్పటికి ఆకాశంలో చందమామ పైకి ప్రాకి బహు కాంతివంతంగా ప్రకాశిస్తున్నాడు. క్రొవ్వువత్తుల గ్రుడ్డివెలుతురుతో నిండియున్న గదిలోని కిటికీలగుండా వెండితీగలవంటి వెన్నెలరేఖలు ప్రసరించి మరింత ప్రకాశ మానం చేశాయి. పాటలో అసలైన పట్టుకివచ్చి అకస్మాత్తుగా ఆపివె య్యటం యేమీ బాగాలేదనీ, అసలు శ్రద్ధగా వాయించటం లేదనీ కాట్యా కేకలువేయ నారంభించింది. కాని ఆయన మాత్రం నేనానాడు వాయించి నంత అద్భుతంగా మరెన్నడూ వాయించలేదని తీర్మానించి చీకటిగా నున్న వరండా లోనికి.వెనుకకూ పచార్లుచేయ నారంభించారు. గదిలోనికి వచ్చిన ప్రతిమారూ ఆయన నా వంక తిరిగి నవ్వేవారు. నేను కూడా తిరిగి నవ్వేదాన్ని. ఆ రోజునే జరిగిన యేదో ఒక అనిర్వచనీయ విశేషం తలుచుకుని ఆపుకోలేని నవ్వు కలిగింది. ఆయన వరండాలోనికి వెళ్లిన ప్పుడు పియానో ప్రక్క నాసమీపంలోనే నిలబడిన కాట్యా మెత్తనిగండస్థ లంపై ముద్దు పెట్టుకోకుండా ఉండలేకపోయేదాన్ని. ఆయన గదిలోనికి తిరిగి రాగానే ముఖం గంభీరంగా పెట్టి పట్టు బలవంతంమీద నవ్వు నాపుకునేదాన్ని.

"మాషా యిల్లా నవ్వుతోందీవేళ విశేషమేమిటండీ?" అని ఆయన నడిగింది కాట్యా.

ఆయన జవాబివ్వకుండా నా వంక తిరిగి నవ్వి ఊరుకున్నారు. ఆ రోజున విశేషమేమిటో ఆయనకు కాక మరెవ్వరికి తెలుసు?

కిటికీగుండా తోటలోకి చూస్తూ "ఎంత అందమైన రాత్రి!" అన్నారాయన బిగ్గరగా.

మేము కూడ అక్కడకు వెళ్లాం. నిజంగా అంత అందమైన రాత్రి నంతవరకు నే నెన్నడూ చూడలేదు. పున్నమిచంద్రుడు నడినెత్తి

దాటి వెనుకకు వ్రాలి యుండటంచేత మాయింటి నీడ యేటవాలుగా తోటలోనికి పడుతోంది. మాదృష్టి గోచరమైన ప్రతివస్తువూ మంచుతోను, వెన్నెలతోను ఆర్ద్రమై వెండివలె కాంతులీనుతోంది. లోయనుండి పొగ మంచుమబ్బులు పైకి వెడలుతున్నాయి. పొగమంచు వలన దూర వస్తువులు అలుక్కుపోయినట్లు కానవస్తున్నాయి. అప్పటికే ఆకులు సగం రాలిపోవటం వలన లీలక్ పొదలు కాండాలతోసహా స్పష్టంగా కనిపిస్తున్నాయి. మంచుతో తడసిన లీలక్ పుష్పాలు బహు సుందరంగా వున్నాయి. చెట్ల బారులలో వెలుగు నీడలు లీనమైపోయి యివి చెట్లనీ, యివి బాటలనీ విభజన తెలియక కదులుతూన్న కాంతి నిలయాలవలె కానవస్తున్నాయి. మా కుడిప్రక్క యింటినీడలో గల వస్తువులన్నీ నల్లగాను, అనిర్దిష్టంగాను వుండి దృష్టి గోచరం కావడంలేదు. కాని ఆ అంధకారంలో నుండి పైకి వచ్చిన ఒక ఉన్నత పోప్లార్ వృక్షాగ్రం మాత్రం వెన్నెలలో మరింత చక్కగా వెలుగొందుతూంది.

"ఇప్పుడు వెన్నెలషికారుకుపోతే యెంతబాగుంటుంది!"అన్నాను.

కాట్యా ఒప్పుకుంది గాని యెత్తుబూట్లువేసుకోవాలని పట్టుబట్టింది.

"అక్కర్లేదు కాట్యా, సెర్జీమిఖాలిచ్ చెయ్యిపట్టుకు నడుస్తాను" అన్నాను.

ఆయనచేయి ఆధారంగా నడుస్తే నా కాళ్ళు మంచులో తడవవు కాబోలు! కాని మా ముగ్గురికీమాత్రం ఆ సమయంలో నేనన్నమాటల్లో అసందర్భ మేమాత్రం కనిపించలేదు. ఆయనచేయి ఆసరాగా నే నంతకు ముందెన్నడూ నడచియుండకపోయినా ఆనాడు నాకు క్రొత్త అనిపించనూ లేదు; ఆయనకూడ అభ్యంతర పెట్టనూలేదు. మేమంతా బయల్దేరి వెళ్లాం. ఆనాడు ఆ విశాల వినిర్మలాకాశము, ఆ అందమైన తోట, సువాసన వెదజల్లే ఆ వాయువు, యావత్ప్రపంచమూ నాకు క్రొత్తగా కన్పించాయి!

మేమొక వృక్షవాటికవెంట నడచి పోతున్నాం. తలయెత్తి ముందుకుచూసిన ప్రతిమారూ ముందుకిక పోవటం సాధ్యంకాదనీ, అప్పట్లో మా చుట్టూనున్న సుందరదృశ్యం శాశ్వతంగా వుండిపోవాలనీ అనిపించేది. కాని మేము ముందుకు సాగిపోతూనేవున్నాం. మా ముందు గల మాయా యవనికలు ఒకటొకటే తొలగిపోయి దారి యిస్తూనే వున్నాయి. ఎండుటాకులను మట్టుతూ, కొమ్మలు ముఖాలను రాసుకుంటూండగా వెలుగునీడలు ప్రసరించియున్న బాటలు గడచిపోతూనే వున్నాం. నా కతిజాగ్రత్తగా తనచేతి నాసరాయిచ్చి నెమ్మదిగా దృఢంగా నడుస్తూన్న దాయనే! మా వెనుక కిర్రుబూట్లతో వస్తూన్నది మా కాట్యాయే! ఇక విశ్చలంగావున్న ఆకుల సందులనుండి మాపై ఆకాశంలో ప్రకాశిస్తూన్నది చందమామే అయ్యుండాలి! కలలోవలె నడచి పోతున్నాను.

ఇంతలో "కప్ప! కప్ప!!" అని అరచింది కాట్యా.

"ఏమిటా శబ్దం? ఎవరిదా స్వరం?" అనుకున్నాను ముందు. కాని వెంటనే అది కాట్యా స్వరమనీ, కాట్యాకు కప్పలంటే భయమనీ స్ఫురణకు వచ్చింది. ఒక చిరుకప్ప యెగిరి నాముందే వ్రాలింది. వెన్నెలలో దాని చిన్ననీడకూడ కానవచ్చింది.

"నీకు కప్పలంటే భయంలేదు కదూ?" అని అడిగారాయన.

నిమ్మచెట్ల బారులో సరిగా మే మాగినచోటనే ఖాళీయుండటంచేత ఆయనముఖం నా కతిస్పష్టంగా గోచరమైంది. ఆయన యెంతఅందంగా, ఆనందంగా వున్నారు!

కప్పలంటే నీకు భయంలేదుకదా అనే ఆయన అడిగినప్పటికీ "మాషా! ప్రియమాషా! నిన్ను నేను ప్రేమిస్తున్నాను"అని ఆయనమాటల ఉద్దేశ్యమని నే నెరుగుదును. ఆయన చూపులో, ఆయన హస్తస్పర్శలో, వెలుగులో, నీడలో, గాలిలో, సమస్త ప్రకృతిలోను 'నిన్ను ప్రేమిస్తున్నాను' అన్న ఆయన పలుకులే ప్రతిధ్వనిస్తున్నాయి.

అప్పటికి మేము తోటచుట్టూ తిరిగేశాం. కాట్యా అలసిపోయి. యింక వెనక్కు వెళ్దాం, చాల ఆలస్యమైపోయిందన్నది. "పాపం, వెర్రి కాట్యా! మావలెనే యెందుకు సంతోషంగా వుండలేకపోతూంది? ఈ అందమైన రాత్రివలె, ఆయనవలె, నావలె అంతా యౌవన, సుఖ, సంతోషాలు కలిగివుంటే యెంత బాగుండును?" అనుకున్నాను నేను.

మే మింటికి వెళ్లేసరికి కోడి మొదటికూత కూసింది. కిటికీకి కట్టబడియున్న ఆయన గుర్రం అదేపనిగా సకిలిస్తూ, కాళ్లను దట్టిస్తూంది. ఇంటిలో యితరులు యావన్మందీ నిద్రాముద్రితులై యున్నారు. కాని మే మిద్దరమూ మాత్రం తరగని విశేషాలేమేమిటో చెప్పుకుంటూ కాలజ్ఞానం లేకుండా గడిపేస్తున్నాం. అప్పటికే రెండు గంటలు దాటిపోయినా కాట్యా యేమీ అడ్డు చెప్పలేదు. కబుర్లు చెప్పిచెప్పి ఆయన బయల్దేరేసరికి కోడి మూడవమారు కూసింది. తూర్పున తెలిరేఖలు పొడసూపాయి. ఆయన రోజూవలె విశేషమేమీ లేకుండానే సెలవు తీసుకున్నప్పటికీ ఆ నాటినుండి ఆయన నా వారనీ, మరి ఆయనవిక కోల్పోరాదనీ నిర్ధారణ చేసుకున్నాను. ఆయన పట్ల నా ప్రేమ నెప్పుడైతే నిర్ధారణ చేసుకున్నానో ఆ వెంటనే కాట్యాకు నా రహస్యాన్ని వెల్లడించాను. సంగతివిని ఆమె చాల సంతోషించింది. పైగా ఆమెకు నేను రహస్యాన్ని వెలిబుచ్చినందుకై చాల సంతృప్తికూడ చెందింది. కాని వెంటనే పడుకుని నిద్రపోగలిగింది వెర్రికాట్యా! నేను మటుకు వరండాలో చాల సేపు పచారుచేసి చేసి, తిరిగి తోటలోనికి వెళ్లి ఆయన పలికిన ప్రతి పలుకును, చేసిన ప్రతి చేష్టను గుర్తుకు తెచ్చుకుంటూ మే మిద్దరమూ కలసి అంతకుముందు నడచిన చెట్లబారుల సందునగల బాటలలోనే నడయాడ నారంభించాను. ఆ రోజున నేనొక్క నిముషంకూడ నడుం వాల్చలేదు. ఆ రోజునే నేను నా జీవితంలో ప్రధమ పర్యాయంగా ఉదయ రాగ రంజిత శోభాయమాన ప్రకృతిప్రాభవాన్ని, అమృత సదృశమైన వెన్నెల సౌందర్యాన్నీ వీక్షించాను. "ఆయన మరి యెందుకు నన్ను ప్రేమిస్తున్నా

నని మనసు విప్పిచెప్పరు? పరిస్థితులన్నీ యింత సామకూలంగా, సుందరంగా వున్నా ఆయన తాను ముసలివాడినంటూ, మరేవేవో లేని పోని ఆటంకాల నెందుకు లేవదీయ ప్రయత్నిస్తున్నారు? గడిచిపోయిన మరి తిరిగిరాని యీ బంగరు కాలాన్నాయన యెందుకిలా వృధా చేస్తు న్నారు? మనసు విప్పి నిన్ను ప్రేమిస్తున్నానని యేల చెప్పరాదు? నా చేయిగ్రహించి పోనీ లజ్జావనత వదను దేల కారాదు? అప్పుడు నే నన్ని విషయాలూ ఆయనకు చెప్పేసేదాన్ని కదా? అబ్బే అలాకాదు! నా చేతులాయన మెడకు పెనవైచి ఆర్ద్రనయనాలతో ఆయనపై వ్రాలి పోదును కదా!" అనుకోనారంభించాను. కాని అంతలోనే "నేను పొర పడ్డానేమో? ఆయన నన్నసలు ప్రేమించడమే లేదేమో?" అన్న భయం కరమైన భావం తట్టింది.

ఆ భావం నా మనస్సును కలచివేసింది. అట్టి సంఘటనే కనుక సంభవిస్తే మరి నేనేమయ్యేదాన్నో ఆ భగవంతునికే తెలియాలి. పండ్ల తోటలోనికి నే నురికినప్పుడాయనకు, నాకూ కలిగిన బంగారు తలపుకు వచ్చి నా మనస్సు బరువెక్కింది. కండ్లవెంట అవిరామంగా కన్నీరుకార నారంభించింది. మనస్సులో దైవప్రార్థన చేసుకోనారంభించాను. అంత లోనే ఒక వింతభావం స్ఫురించి నా కలతవడిన మనస్సును శాంతపరచి ఆశను కలిగించింది. ఆ రోజునుండి ఉపవాసం ప్రారంభించి నా పుట్టిన రోజు పండుగనాడు దైవప్రసాదం స్వీకరించి ఆ నాడే ఆయనతో నా పెండ్లి సంబంధాన్ని స్థిరం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను.

అదెల్లా సంభవమౌతుందో నే నూహించుకో లేకపోయాను. కాని ఆ నిముషంనుండి అది అల్లా జరిగి తీరుతుందని మాత్రం నాకు పూర్తి నమ్మకం కలిగింది. నేను తిరిగి యింటికి వెళ్ళేసరికి బాగా తెల్లవారి కూలీలు, రైతులు తమతమ పనుల్లోకి పోతున్నారు.

# అధ్యాయం 4.

ఆరోహణ దినోత్సవం ఆగస్టులోనే రావడంచేత నా ఉపవాస సంకల్పం విని యెవ్వరూ వింతచెంత లేదు.

ఆ వారమంతలో ఒక్కమారు కూడ ఆయన నన్ను చూడటానికి రాలేదు. కాని పూర్వంవలె ఆయన రానందుకు నే నెతంమాత్రమూ వింత గాని, విసుగుగాని, కంగారుగాని చెందలేదు సరికదా చాల సంతోషించాను. నా పుట్టినరోజులోగా ఆయన రాకూడదని కూడా కోరుకున్నాను. ఆ వారంలో ప్రతిరోజూ చాల పెందరాళే లేచి యేకాంతంగా తోటలో బాటలవెంట నడుస్తూ గడచిన రోజున చేసిన పాపాలేమైనా వున్నవా అని పర్యాలోచించి, పాపపంకిలం కాకుండా ఆ రోజు గడపటమెట్లాగో నిర్ణయించుకునేదాన్ని. ఆ రోజుల్లో స్వల్పమాత్ర ప్రయత్నసాయంతో యే పాపమూ చేయకుండానే జీవితం గడిపివేయవచ్చునని తలపోసేదాన్ని ! కాట్యానో, యే దాసీనో వెంటతీసుకుని ప్రతిరోజూ బండిపై చర్చికి వెళ్లేదాన్ని. చర్చిలో భగవత్సాన్నిధ్యంలో నా గత జీవిత్నాన్ని తల్చుకుని పశ్చాత్తాప పడుతూండేదాన్ని. ప్రార్థనాంతాన 'క్రీస్తుదేవుడు మిమ్ము దీవించుగాక !' అని అర్చకుడు దీవించగానే నా శరీరం స్వాస్థ్యం చెంది, హృదయం తేజస్సంతోషాలతో నిండిపోయినట్లనిపించేది. పూజ చేయించడానికై యింటికి రమ్మన్నారా, యెప్పుడు రమ్మాన్నారని అర్చకుడు ప్రశ్నించగా అవసరం లేదనీ, నడిచో, బండిపైనో నేనే చర్చికి వస్తానని చెప్పాను.

'అంతశ్రమ మీరు తీసుకోగలరా ?' అని ఆయన అడిగిన ప్రశ్నకు గర్వమనే పాపం ప్రదర్శితమౌతుందేమోననే భయంచేత వెంటనే సమాధాన మివ్వలేకపోయాను.

కాట్యా నాతో లేని ప్రతిరోజునా పూజానంతరం బండి నింటికి పంపివేసి యేకాంతంగా నడచి యింటికి వేళ్లేదాన్ని. దోవలో కనిపించిన వారందరికీ నమ్రభావంతో నమస్కరించి, యెవరికైనా సలహా సహాయాలు అందచెయ్యటాని కవకాశం దొరుకుతుందేమోనని గమనిస్తూందేదాన్ని. ఆ రోజుల్లో యితరులకేదో విధంగా తోడ్పడాలనే భావమే నా మనస్సును పూర్తిగా ఆవరించుకుని యుండేది. ఒక రోజున మా జవాను కాట్యాతో సైమను అనే మా దాసుని కూతురు చనిపోయిందనీ, శవపేటిక తయారు చేయుటకై చెక్కలను, పురోహితునికి దక్షిణ యివ్వటానికొక రూపాయను తనను యాచించాడనీ, తా నిచ్చాననీ చెప్పటం నా చెవుల బడింది. "నిజంగా అంత బీదవాడా పాపం?" అని అడిగాను. "నిజంగా అమ్మగారూ, ఒక్కొక్కరోజున వాళ్లకి గంజినీళ్లలోకి ఉప్పుగల్లు కూడా వుండదు" అని జవాబిచ్చాడు జవాను. ఆ దారుణ సత్యం వినేసరికి నా హృదయం విషాదంతో నిండిపోయింది. కాని సహాయంచేసే అవ కాశం దొరికిందికదా అని మాత్రం సంతోషించాను. కాట్యా యెదుట షికారుకు వెడుతూన్నట్లు నటించి, మేడపైనున్న డబ్బును (కొద్దిగానే వున్నప్పటికీ అంతా) తీసుకుని యేకాంతంగా ఊరిచివరనున్న సైమన్ గుడిసెకు చేరుకున్నాను. ఎవ్వరూ నన్ను చూడని సమయంలో గుమ్మంలో డబ్బు సంచిపెట్టి తలుపు తట్టాను. శబ్దంవిని యెవరో లోపలినుండి క్రమ మని శబ్దం చేసే తలుపు తెరిచి నన్ను పలుకరించారు. కాని జవాబు చెప్పకనే యేదో తప్పుచేసిన దానివలె కంపిస్తూ త్వరత్వరగా యింటి దోవ పట్టాను. కాట్యా యెక్కడకు వెళ్లావనీ, విషయమేమిటనీ ప్రశ్నిం చినా జవాబు చెప్పక లోనికి పోయాను. ఆమె యేమి మాట్లాడు తోందో కూడ అర్థం కాలేదు. ప్రపంచమంతా అకస్మాత్తుగా నిరామ యంగా, నిస్సారంగా అయిపోయినట్లనిపించింది. నా గదిలోపలి గడియ వేసుకుని యేమి చేయటానికీ, యేమాలోచించటానికీ, కనీసం అప్పటి నా మానసికస్థితి యేమిటో అర్థం చేసుకోటానికీ కూడ శక్తిలేక పదార్లు

చేస్తూ చాలసేపు గడిపాను. సైమన్ కుటుంబమంతా యే విధంగా భ్రష్టే నంద భరితులవుతారో, దాతనేవిధంగా కొనియాడుకుంటారో తలుచుకుని వారికాసొమ్మును నేనే స్వయంగా యివ్వనందుకు విచారించాను. ఈ విషయం సెర్జీమిఖాలిచ్‌కి తెలిస్తే ఆయన యేమనుకుంటారో ననుకుని అంతలోనే అసలీ విషయం యెప్పుడూ, యెవ్వరికీ తెలియదు కదా అని సంతోషించాను. అంతులేని ఆనందం; నాలోని, యితర్లలోని లోటు పాట్ల పట్ల తిరస్కారం; ప్రపంచంపట్ల, నా పట్ల జాలి అనే భావాలతో నా మనస్సు కొట్టుమిట్టాడ నారంభించింది. ఆ సమయంలో మృత్యుభావం కూడ ఆనంద స్వప్నంగా నాకు గోచరించింది. ప్రపంచపట్ల, నా పట్ల అనంతమైన ప్రేమ నాలో జనించింది. బైబిల్ గ్రంథం కూడ నాకు సులభగ్రాహ్యంగా కనిపించేది. బైబిల్ పఠనానంతరం జీవిత సత్యము, సృష్టి రహస్యము సుస్పష్టము, సువేద్యంగా తోచేది; అసలు పాపపూరిత జీవితం గడపటమే సంభవంకానట్లు, తానితరులందరినీ ప్రేమిస్తూ, ఇత రులచే ప్రేమింపబడటం సులభసాధ్యమన్నట్లు తోచేదినాకు. అంతా నా పట్ల సుముఖంగాను, సహృదయతతోను ప్రవర్తిస్తున్నారు. నన్ను విసిగించి వేసారిస్తూండే సోన్యా అప్పుడు శ్రద్ధగా చదువుతూ నా మెప్పు దల పొందటానికి ప్రయత్నించేది. నే నితరులపట్ల యే విధంగా ప్రవ ర్తించేదాన్నో వారు కూడ నా పట్ల అదేవిధంగా ప్రవర్తించేవారు. అంతకు ఒక యేడాదిక్రితం పొరుగున వుండే ఒక స్నేహితురాలిని పదిమంది లోనూ హేళన చేసి ఆమె మనస్సును గాయపరచిన ఘటన జ్ఞప్తికి రాగా ఆమె క్షమార్పణ వేడుకోవాలని నిశ్చయించుకున్నాను. ఆ విధంగానే నా తప్పును మన్నించమంటూ ఆమెకు జాబు వ్రాశాను. ఆమె వెంటనే నా తప్పును తాను మన్నించినట్లూ, తానేమైనా తప్పుచేసి యున్నట్లయితే తనను కూడ క్షమించవలసిందని కోరుతూన్నట్లు వ్రాసింది. ఆమె సరళ హృదయంలోనుండి వెల్వడిన ఆమె జాబులోని అమాయక పదాలను చూడగానే నాకు విశేషమైన సంతోషం కలిగింది. మా ముసలిదాదిని

మన్నించమని కోరినప్పుడామె కూడ అర్ద్రనయనాలతో వెంటనే క్షమా దానం చేసింది. నన్నెందుకీ విధంగా వారంతా ప్రేమిస్తున్నారు? వారి ప్రేమను చూరగొనటానికై నేనేమి చేశాను?" అని నన్ను నేనే ప్రశ్నించుకునేదాన్ని. ఆ సమయంలో సెర్జీమిఖాలిచ్ చిత్రం నా మనోవీధుల్లో తరుచు నడయాడుతూండేది. ఆయనను గురించి నే నాలోచించకుండా వుండలేకపోయేదాన్ని. పైగా అలా భావించటం తప్పని కూడ నే తలచ లేదు. కాని ఆనాటి నా భావాలకూ, ఆయన పట్ల నాకు ప్రేమ జనించి నట్లుగా నేను గుర్తించిన మొదటినాటి భావాలకూ మాత్రం హస్తిమశ కాంత భేదముంది. అప్పుడాయన నాతోడు నీడగాను, నా భావి జీవితంలో అవిభాజ్య సహచరుడుగాను కనిపించారు. ఆయన నా కన్న అధికుడనే నా తక్కువభావం తొలగిపోయి అప్పటి నా ఉన్నతనైతిక మనోస్థితిలో ఆయనను పూర్తిగా అర్థం చేసుకోగలనీ, నే నాయనతో సమానురాలిననీ భావించాను. పరోపకారరార్ధమై త్యాగపునీత జీవితం గడపటమే శాశ్వ తానందదాయకమని ఆయన తరుచు చెప్తూండే సూక్తిని నే నప్పుడే పూర్తిగా అర్థంచేసుకుని అంగీకరించగలిగాను. మా సంయుక్త జీవితం సుఖవంతంగాను, అనంతానంద దాయకంగాను వుంటుందని నేను విశ్వ సించాను. నే నెదురు చూచినది విదేశ ప్రయాణాలు, రంగురంగుల దుస్తులు ధరించి డాబుదర్పాల ప్రదర్శనతో నిండియుండే నవీన సమాజం వంక కాదు. అవిరామ ఆత్మపరిత్యాగము, పరస్పరప్రేమ, సర్వవస్తు జాలంలోను దయామయుడైన భగవంతుని సాక్షాత్కారం గుర్తిస్తూ ప్రశాంతమైన పల్లెపట్టుల్లో ఒడుదుడుకులు లేని సుఖమయమైన సంసార యాత్రకొరకే నే నర్రులు చాచాను.

నా పుట్టిన రోజునాడు నే ననుకున్నట్లుగానే చర్చిలో దైవప్రసాదం స్వీకరించి యింటికి తిరిగి వచ్చాను. ఆనందావేగంతో నా మనస్సు వివశమైపోయింది. సరిగా అదే సమయంలో సెర్జీమిఖాలిచ్ కూడ వచ్చి నా పుట్టినరోజునాడు దైవప్రసాదం స్వీకరించిన సందర్భంలో తన అభి నందనలు తెలిపారు. ఆయనతో పరిచయంకలిగిన నాటినుండి ఆ నాటివర

కెవ్వరూ ఆయనతో అంత చనువుగాను, ధైర్యంగాను ప్రవర్తించి యెరుగను. నాలో కొంగ్రొత్త ఆవరణలు, ఆయన ఊహా కందరాని విషయాలు ఉద్భవించినట్లుతోచింది. అనా దాయనతో నేను జరిపిన సంభాషణలో కంగారేమాత్రమూ లేదు. నా భావాల నా నవనీత హృదయు దర్ధం చేసుకుని నా తో యెంతో మార్దవంగాను, గౌరవంగాను ప్రవర్తించారు. నేను పియా నో వాయిద్దామని బయల్దేరేసరికాయన ముందుగావెళ్లి పియానోపెట్టికి తాళంవేసి యీవిధంగా చెప్పారు:

"నీ ప్రస్తుతమానసికావస్థను పాడుచెయ్యకు. ఈ నిముషాన నీ ఆత్మలో జనించుతూన్న గానమే అతిమధురమైనదని నా అభిప్రాయం."

ఆయన పలుకులు నాలో ఒకవంక కృతజ్ఞతను రేకెత్తించినా వేరొకవంక నా నిగూఢ మనోభావాల నాయన అంత సులభంగా, సుస్పష్టంగా గ్రాహ్యం చేసుకోడం నా కిష్టం లేకపోయింది. భోజన సమయంలో నాకు తన అభినందనలు తెలపటానికీ, తాను మాస్కో వెళ్తూన్న సందర్భంలో మా వద్ద సెలవు గైకోటానికీ వచ్చానని కాట్యా వంక చూస్తూ చెప్పారు. ఆ వెంటనే నా ముఖ భంగిమలవల్ల నాలో ఉద్రేక భావాలేమైనా వెల్లడి యౌతాయేమోనన్నట్లు క్రీగంట చూశారు. కాని నాలో ఖంగారు గాని, ఆశ్చర్యంగాని యే మాత్రం కలుగలేదు సరిగదా తిరిగిరాక యెప్పుడని కూడ అడగలేదు. ఆయన వెడతానంటారనీ, కాని వెళ్లరనీ మాత్రం నా మనస్సు గ్రహించింది. నా కేవిధంగా తెలిసింది? ఆ విషయం మాత్రం నాకీ నాటికీ బోధపడలేదు. కాని ఆ శుభదినాన మాత్రం భూతభవిష్యద్విషయాలన్నీ నాకు కరతలామలకంగా గోచరించాయి. ఆ నాటి నా మానసికస్థితిలో భవిష్యద్విషయాలన్నీ దివ్య స్వప్నం లోవలె దర్శించగలిగాను.

భోజనానంతరం వెంటనే ఆయన వెళ్లిపోదామనుకున్నారు గాని చర్చికి వెళ్లివచ్చిన బడలికచే కాట్యా కునుకు తీస్తూండటంవల్ల ఆమెవద్ద సెలవు పుచ్చుకోటాని కాగిపోయారు. మేము వరండాలోకి వెళ్లి ఒకరి

కొకరం అభిముఖంగా కూర్చున్నాం. కూర్చునీ కూర్చోగానే మా సంభాషణ యితర విషయాలపైకి ప్రసరించకముందే నా మనోవాంఛల ఫలితాన్ని తేల్చివేసే సంభాషణను నెమ్మదిగా ప్రారంభించాను. ఆ నాటి నా విశ్చయపూర్వక ప్రశాంతత, స్ఫుటమైన భావ ప్రకటనాశక్తీ యెక్కడిమంది నాలో ప్రవేశించాయో నాకే తెలియదు. శక్తి యేదైనా నాలో ప్రవేశించి నాచే ఆ విధంగా పలికించిందేమో ననిపించింది. నా కభిముఖంగా కూర్చున్న ఆయన ముఖవైఖరిని బట్టి అమితోద్రేకమో మరి అతిప్రశాంతతో నా కర్థంకాలేదు.

ఆయనవంక తదేకంగా చూస్తూ ఉద్దేశపూర్వకంగా అడగాలనే "మాస్కో యెందుకు వెళ్తున్నారిప్పుడు?" అని అడిగాను.

ఆయన తొట్రుపడి వెంటనే జవాబివ్వలేకపోయారు.

అఖరికి 'వ్యాపారం!' అని గొణిగి నేలవంక చూడ నారంభించారు.

"వినండి. అనేక కారణాలవల్ల యీ రోజు నా కెంత ముఖ్యమైనదో మీకు తెలుసు. మిమ్మల్నీ ప్రశ్న అడుగుతున్నానంటే కారణం మీ స్వవిషయాలలో జోక్యం కలిగించుకోవాలని కాదు. మీతో నాకు గాఢ పరిచయ స్నేహాలేర్పడ్డాయని మీకు తెలుసు—యీ ప్రశ్నకు తప్పక జవాబు తెలుసుకుతీరాలి కనుకనే అడుగుతున్నాను. చెప్పండి, మాస్కో వెళ్ల వలసినంత అవసరమేమొచ్చిందిప్పుడు?"అని అడిగాను.

"అసలు కారణమేమిటో చెప్పటం నాకు సాధ్యం కావటంలేదు. వారమంతా నిన్ను గురించీ నన్ను గురించీ తీవ్రంగా దీర్ఘంగా ఆలోచించి చివరకు వెళ్లిపోవాలనే నిశ్చయించుకున్నాను. ఎందుకు వెళ్లిపోవాలనుకున్నానో నువ్వర్థం చేసుకోగలవనుకుంటాను. నా మీద కనక గౌరవముంటే ప్రశ్నలడిగి బాధించవద్దని కోరుతున్నాను" అన్నారాయన. నుదురు తడుముకుని, కండ్లరమోడ్చి "చాల కష్టంగా కనిపిస్తోంది.... నీ కర్థమైందనుకుంటున్నాను."

నా గుండె వేగంగా కొట్టుకో నారంభించింది.

"నా కేమాత్రం అర్ధంకాలేదు. నేననలర్ధం చేసుకోలేను! మీరే చెప్పాలి. దేవుని సాక్షిగా మీరీరోజున యేమి చెప్పినా సరే నేమ ప్రశాంతంగా వింటాను" అన్నాను.

కుర్చీలో సర్దుకు కూర్చుని నాపై దృష్టి ప్రసారం చేశారు.

కొంతసేపు నిశ్శబ్దంగా వుండి దృఢస్వరంతో మాట్లాడాలని ప్రయత్నించి కూడ సాధ్యంకాక హీనస్వరంతో "సరే! జరిగిపోయిందొక పొరపాటు. అది మాటల్లో పెట్టటం సాధ్యంకాదు. అయినా చెప్పటానికి ప్రయత్నిస్తాను" అన్నారెంతో బాధపడుతూన్న వానివలె.

"సరే, చెప్పండి" అన్నాను.

"ఒకానొక ఊళ్లో యౌవనదశ గడిచిపోయిన ఒక పురుషుడూ, జీవితమంటే యేమిటో, ప్రపంచరీతు లెటువంటివో యేమీ తెలియనటువంటి, అనవరతోత్సాహ పూరితయైనటువంటి ఒక యువతీ ఉన్నారట. అనేక విధాలైన సంసార పరిస్థితుల కారణంగా వారిర్వురూ కలసి జీవించటం సంభవించింది. దానితో ఆ యువతి పట్ల ఆ పురుషునకు బాలికా వాత్సల్యం జనించింది. తర్వాత తర్వాత తన ప్రేమ వేరొక రూపం ధరిస్తుందని అతడు కలలోనైనా తలచియుండలేదు" అని చెప్పి ఒక కొంతసేపాయన ఊరుకున్నారు. నేనుకూడ నిశ్శబ్దంగానే వుండిపోయాను.

నా వంక చూడకనే ఆయన విశ్చలంగా, తొందర తొందరగా చెప్ప నారంభించారీవిధంగా : "ఆ యువతి యింకా చాల చిన్నదనీ, ఆమె జీవితమింకా మూడు పువ్వులూ ఆరు కాయలుగా హుషారుగా సాగిపోవలసి వుందనీ, ఆమెపై తనకు గల ప్రేమభావం వేరు రూపం దాల్చగల అవకాశం కలదనీ, అది ఆమె కానందదాయకంగానే ఉండవచ్చుననే విషయాలాతను పూర్తిగా విస్మరించాడు. అదే అతను చేసిన గొప్ప పొరపాటు. తనుచేసిన పొరపాటు గుర్తుకు రాగానే తమ పూర్వ స్నేహబంధాలెక్కడ విచ్ఛిన్నమైపోతాయోననే విపరీతమైన భయభారంతో

కృంగిపో నారంభించాడాతను. అటువంటి విపరీతపరిణామం సంభవిం చక ముందే అక్కడినుండి వెళ్లిపోవాలని నిశ్చయించుకున్నాడు" అని చెప్తూ తన ఉద్రేకాన్ని కప్పిపుచ్చుకునేందుకు గాను కళ్లు మలుముకుంటూ మూసుకో నారంభించారు.

"వేరు విధంగా ప్రేమించటాని కాయన యెందుకని భయపడ్డారు?" అని మెల్లిగా, ఉద్రేకాన్నణచుకుంటూ అడిగాను. నా స్ఫుటమైన స్వరం విని నా కేమీ పట్టనట్లుగా నేను మాట్లాడానని అనుకుని వుంటారాయన. అందుచేతనే ఆయన బాధపడుతూన్నట్లుగా మాట్లాడారు.

"నువ్వు చిన్నదానివి. నేను పెద్దవాడిని. నీకు కావలసింది సరదా. నాకు కావలసింది వేరొకటి. నీకు సరదాగా ఉండాలని వుంటే తప్ప కుండా వుండు. కాని నాతోమాత్రం కాదు. కాని నువ్వు నాతోనే ఆ విధంగా ఉండదల్చుకుంటే నా కాషామాషీ పద్ధతి తెలియదు. నేను త్రిక రణశుద్ధిగా యీ విషయం చెబుతున్నాను. తర్వాత నాకు విచారం కల్గటం, నువ్వు పశ్చాత్తాప పడటం జరుగుతుంది. అన్నాడాపురుషుడు" అనిచెప్పి ఆయన మళ్లీ ప్రారంభించారు: "ఈ ముసుగులో గుద్దులాట దేనికి? నా ప్రయాణ కారణం నీకు బోధపడిందనుకుంటాను. ఇంతే సంగతులు. దయవుంచి నన్నింకేమీ మాట్లాడించకు!"

"అల్లా కుదరదు! ఎన్నటికీ కుదరదు!! అసలాయన ఆమెను ప్రేమించాడాలేదా? చెప్పండి" అన్నాన్నేను విడువకుండా. అల్లా అంటూనే నా స్వరం రుద్ధమైపోయింది.

ఆయనేమీ మారు పలుకలేదు.

"ఆయన ఆమెనసలు ప్రేమించకపోయినట్లయితే యెందుకా విధంగా నటించాడు?" అని తిరిగి అడిగాను. -

"నిజమే. అతను చాల చెడ్డగానే ప్రవర్తించాడు. కాని అయిపో యిందేదో అయిపోయిందిగా? చివరికి వాళ్లిద్దరూ స్నేహితులుగానే విడి పోయారు." అన్నారాయన మధ్యలో అడ్డువచ్చి తొందరగా.

"ఈ కథాంతం చాల దారుణంగా వుంది. వేరు విధమైన ముగింపే లేదా ?" అతిప్రయత్న పూర్వకంగా నేనన్నాను. కాని అంతలోనే నా మాటకు నాకే భయం కలిగింది.

"లేకనేం, వుంది" అత్యుద్రేకపూరితమైన ముఖం నా వంక త్రిప్పి నా కండ్లలోనికి తీక్షణంగా చూస్తూ అన్నారాయన. "ఆ కథకు రెండు రకాల ముగింపులున్నాయి. నీకు పుణ్యముంటుంది గాని మధ్యలో అడ్డు రాక నేను చెప్పేది విను. కొందరు అంటారుకదా"—అంటూ భారమైన మనస్సునుండి వెల్వడిన బాధాజనితమైన నవ్వును నవ్వుతూ లేచి నిల బడి— "అతనామెను తలమునక్కలుగా ప్రేమించి, తన ప్రేమ నామెకు వ్యక్తం చేశాడట. ఆమె నవ్వేసి ఊరుకున్నదట. పిల్లికి చెలగాటంవలె ఆమెకిదంతా సరదా, కాని అతనికిమాత్రం ఎలకకు ప్రాణపోకట వలె జీవన్మరణ సమస్య."

ఆ మాటలు వినేసరికి నా మనస్సంతా భయంతో నిండిపోయింది. అడ్డు చెబుదామనుకున్నాను. కాని ఆయన నా చేతిపై తన చేయివేసి అడ్డు తగిలి కంపితస్వరంతో మళ్లీ యిలా అన్నారు.

"ఆగు ! మరికొందరు చెప్పేదేమంటే ఆ యువతి అతనిపై జాలి పొంది పాపం తన అమాయకత్వంలో తానాతనిని నిజంగానే ప్రేమించ గలనని నమ్మి అతనిని పెండ్లాడటాని కంగీకరించిందట. ప్రేమాంధుడైన అతను కూడ నమ్మాడట. తన జీవితాన్ని తిరిగి ప్రారంభించవచ్చునని ఆశించాడట ; కాని కొంత కాలానికామె తన్నాతనూ, అతనిని తానూ మోసగించు కున్నట్లుగా గుర్తించింది.........సరే, సరే. ఇంతటితో ఈ విషయం ముగించేద్దాం"అని పూర్తిచేసి నా ముందు నిశ్శబ్దంగా యిటూ అటూ పచారుచేయ నారంభించారు.

ఇంతటితో యీ విషయం కట్టిపెట్టేద్దామని మాటవరుసకాయన అన్నా ఆయన మనస్సంతా నేను చెప్పబోయే జవాబుపైననే లగ్నమై

యుందని నాకు పూర్తిగా తెలుసు. నేను మాట్లాడాలని యెంతగానో ప్రయత్నించాను. కాని నా మానసికవ్యధ నన్ను మూగదానిని చేసేసింది. ఆయన వంక చూశాను—ముఖమంతా పాలిపోయింది. క్రింది పెదిమ కంపిస్తోంది. ఆయనపట్ల విపరీతమైన జాలి కలిగింది. ఒక్కమారు తీవ్ర ప్రయత్నం చేసి విశ్శబ్దతా పాశాలను ఛేదించుకుని మందస్వరంతో మాట్లాడ నారంభించాను. మాట్లాడుతూన్నంత సేపూ నా స్వరమెప్పుడు తీక్షత వహిస్తుందోనని భయపడుతూనే వున్నాను.

"ఆ కథకు యింకొక ముగింపు కూడా ఉంది" అని నేనొక మారాగాను. కాని ఆయనేమీ అనలేదు. "ఆయన అసలా యువతిని మన సారా ప్రేమించనేలేదు. ఆమె మనస్సును మాత్రం తీవ్రంగా గాయపరి చాడు. తాను చేసిన పని సరైనదేనని ఊహించుకుని ఆమెను వదిలి వెళ్లి పోయి, తాను చేసిన పనికి గొప్పగా గర్వించుతూ రొమ్ము విరుచుకు తిరుగ నారంభించాడు. నటిస్తూన్నది మీరే; నే నెన్నడూ కాదు. కలుసు కున్న మరుక్షణంనుండీ నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మనసారా ప్రేమిస్తున్నాను" అన్నాను. ప్రేమిస్తున్నాననే మాట నాకు తెలియకుం డానే యెంత గట్టిగా వెలువడిందంటే అది విన్న నాకే భయం వేసింది.

ఆయన విశ్చేష్టులైపోయారు. క్రింది పెదిమ మరింత తీవ్రంగా కంపించ నారంభించింది. రెండు కండ్లవెంటా రెండు కన్నీటి బిందువులు వెలువడి బుగ్గలపై ముత్యాలవలె మెరువ నారంభించాయి.

"తప్పు. తప్పు! యెందుకలా కంట తడిపెడ్తారు?" లోపల కూడుకున్న విచారాశ్రువులతో ఉక్కిరి బిక్కిరవుతూ అరిచి లేచిపో బోయాను.

కాని ఆయన నన్ను పోనీయక వంగి కంపిస్తూన్న నా చేతులను ముద్దు పెట్టుకుంటూ కారుతూన్న కన్నీటితో తడిపివేశారు. "ఈ విషయ మిదివరకే తెలిస్తే యెంత బాగుండేది ప్రభూ!" గొణిగారాయన.

"ఎందుకు ? తెలిస్తే ?" నేనన్నాను. నా హృదయం మాత్రం సంతోషంతో శాశ్వతంగా భంగమైపోయే పరిస్థితిలో తిరిగి వచ్చిన సంతోషంతో నిండిపోయింది.

ఐదు నిముషాల తర్వాత మేడపై నున్న కాట్యావద్దకు పరుగెత్తి వెళ్ళి సెర్జీమిఖాలిచ్ని మాషా పెళ్ళి చేసికో నిశ్చయించిందని యిల్లంతా మార్మోగేటంత గట్టిగా సోన్యా చెప్పటం వినిపించింది.

# అధ్యాయం 5.

మా వివాహం విషయంలో ఆలస్యం చెయ్యవలసిన అవసరమేమీ కనిపించలేదు. పట్నంపోయి కొత్త దుస్తులు కుట్టించుకోవాలనీ, యిల్లంతా అలంకరించాలనీ, కొత్త సామానులు కొనాలనీ కాట్యా పట్టు పట్టింది గాని ఆలస్యం చెయ్యటం ఆయనకు గాని, నాకుగాని యేమాత్రం యిష్టం లేకపోయింది. ఒకవేళ అల్లాంటివన్నీ జరిగే తీరాలంటే వివాహానంతర మైనా అవి చేసుకోవచ్చుననీ, నా పుట్టినరోజు పండుగ దాటిన పక్షం రోజుల్లోగా సాంప్రదాయసిద్ధమైన విందు విలాసాలు గాని, పావీయ ప్రద ర్శనాలు గాని, పెండ్లిపిలుపులు గాని లేకుండా నిరాడంబరంగా వివాహ తతంగం పూర్తియైపోవాలనీ మే మిద్దరమూ పట్టుపట్టి మా మాట నెగ్గించుకున్నాం. గృహాలంకరణంగాని, బ్యాండుమేళం గాని కొత్త దుస్తులుగాని యేమీ లేకుండానే పెండ్లి జరిగిపోవా లన్నందుకు తన తల్లి తన పెండ్లికి ముప్పదివేల రూపాయలు ఖర్చు అయిన సంగతి చెప్పి యెట్లా అసంతృప్తి వెల్లడించినదీ, అప్పటికీ మా సంసారసుఖానికా మె అత్యవసరమని యెంచిన తివాసీలు, తెరలు మొదలైన వస్తువుల విష యమై ఆదరాబాదరా యెల్లా ప్రయత్నాలు చేస్తూన్నదీ ఆయన చెప్పారు. ఇంక మా యింటివద్ద చూద్దామాఅంటే కాట్యా కూడ అటువంటి పను ల్లోనే మునిగిపోయి వుంది. ఆయనా, నేనూ కలిసి మా భావి జీవితాన్ని గురించి మాట్లాడుకునేదంతా ఆమె దృష్టిలో మా వయస్సులో వున్న వారికి సహజమైన అర్థంలేని వ్యర్థ ఊహాగానం మాత్రమే. తెరలు, మేజా గుడ్డలే ఆమె దృష్టిలో మా భావిసుఖాని కతిముఖ్యాలు. పెండ్లి ప్రయత్నా లకు సంబంధించిన రహస్య వార్తలు ఒక యింటినుండి మరొక యింటికి తరుచుగా జేరుతూనే వున్నాయి. కాట్యాకు, ఆయన తల్లికీమధ్య పైపై సంబంధాలతి సన్నిహితంగాను, స్నేహపూర్వకంగానే కనిపించినా కార్యకలాపాల్లో వారిద్దరిమధ్యా స్వల్ప మాత్రపు వ్యతిరేకత, మన్నిత

మైన చదరంగపుఎత్తులవంటి చతురపు ఎత్తు పైయెత్తులు గోచరించ నారంభించాయి. అప్పటికి సెర్జీమిఖాలిచ్ తల్లితో నాకు సన్నిహితమైన పరిచయమేర్పడింది. ఆమె పూర్వకాలపు మనిషి. గృహయాజమాన్య విషయాలలో ఆమె నిర్భాగమాటమైన వ్యక్తి. సెర్జీకి ఆమె పట్ల మహా ప్రేమ. ఆమె తనతల్లి అని మాత్రమే కాదు; ప్రపంచమంతలోనూ ఆమె అత్యుత్తమురాలు, వివేకవంతురాలు, దయామయురాలు, ప్రేమమయురాలూ అని ఆయన నమ్మకం. మేమంటే, అందులోనూ ముఖ్యంగా నేనంటే ఆమె చాల ఆప్యాయంగా ఉండేది. తన కొడుకు కిన్నాళ్లకొక యింటివాడవుతున్నాడు కదా యని ఆమె చాల సంతోషించింది. కాని ముహూర్తం నిశ్చయమైన తర్వాత నేనామెను కలుసుకున్నప్పుడల్లా తన దృష్టిలో తన కొడుకు చాల గొప్పవాడైనట్లు, అదినేను గుర్తించి మసులుకుంటే చాల మంచిదన్నట్లూ ఆమె ప్రవర్తిస్తూన్నట్లుగా తోచేది నాకు. ఆమె భావంలో నాకేమాత్రం పొరపాటు గోచరించలేదు.

ఆ పక్షం రోజుల్లోనూ మేమిద్దరమూ కలుసుకోని రోజొక్కటీ లేదు. ఆయన ప్రతిరోజూ మా యింటికి రాత్రి భోజనానికి వచ్చి అర్ధరాత్రి వరకూ కబుర్లు చెబుతూ ఉండిపోయేవారు. నేనులేకుండా తనకు జీవితమే లేదని ఆయన చెప్పినా—ఆయన చెప్పినది నిస్సందేహంగా నిజమేనని నాకు పూర్తిగా తెలిసినా—తన మామూలు పనులన్నీ యథాప్రకారంగా చేసుకుంటూ ఉండేవారేగాని రోజల్లా నాతో ఆయన యెన్నడూ గడప లేదు. మా పైపై సంబంధాల్లో వివాహమయ్యేటంత వరకూ యేమాత్రం మార్పు రాలేదు. ఆయన నా చేతినైనా ముద్దు పెట్టుకోలేదు. ఏకాంతంలో నన్ను కలుసుకోడానికేమాత్రం ప్రయత్నించక పోవడమేకాక ఆయన అట్టి అవకాశం సంభవించకుండా ప్రయత్నించేవారు కూడా. అదంతా చూస్తే తన ప్రేమాతిశయాన్నెక్కడ ప్రదర్శించిపోతానో అనే ఆయన భయమే కారణంగా తోచేది నాకు. ఆయనతో పూర్తిగా నేను సమానురాలనని తోచేది నాకా రోజుల్లో. ఆయన పట్ల వయోధిక్యత కారణంగా

నా కంతకు పూర్వముండే భయభక్తులు పోయి వాటి స్థానాన్ని ప్రేమాను రాగాలు ఆక్రమించుకున్నాయి. "ఆయన విషయంలో నే నెంత పొర పడ్డాను! ఆయన కూడ నా వలె మానవమాత్రుడే!" అనుకునేదాన్ని తరుచు నాలో నేనే. ఆయనను పూర్తిగా నే నర్థం చేసుకున్నట్లు భావించాను. ఆయన భావాలెంత ఆకర్షణీయంగా వున్నాయి! నా భావాలతో యెంతగా యేకీభవిస్తున్నాయ్! మా భావి జీవితపుటూహలు కూడ సరిగా ఒక్కలాగే ఉన్నాయే! ఆయన ఊహలు నా వాటికన్న స్పష్టంగాను, ఆయన మాటలు నా వాటికన్న విశదంగాను ఉండటం తప్ప తేడా యేమీ లేదే!!

ఒకరాత్రి బయట వాతావరణమేమీ బాగుండక పోవడంవల్ల చాల సేపు యింట్లోనే గడిపాము. పియానోకీ గది కిటికీకీ మధ్యగల మూలలో కూర్చుని మా రహస్య సంభాషణలు సాగించేవాళ్లం. కొవ్వువత్తి దీపపు కాంతి తారుపూసిన కిటికీ తలుపుపై పడి ప్రతిఫలిస్తూంది. మెరుస్తున్న కిటికీ అద్దంపై అప్పుడప్పుడొక వానచినుకు పడి క్రిందకు జారుతోంది. ఇంటి కప్పుపై హోరుమని జడిగా వాన కురుస్తూంది. కిటికీవద్ద తేమగా ఉన్నా అక్కడే మాకు హాయిగా వుంది.

ఆ రాత్రి చాలా సేపటివరకు కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం. "చాల రోజులబట్టి ఒక విషయం నీతో చెప్పాలనుకుంటున్నాను మాషా. నువ్వు పియానో వాయిస్తోన్నంత సేపూ ఆ విషయమే ఆలోచిస్తున్నాను" అని ప్రారంభించారాయన.

"మీరు చెప్పదలచుకున్నది నాకూ తెలుసులెండి" అన్నాను.

"చెప్పక్కర్లేదంటావా?"

"అయితే యేమిటో చెప్పండి" అని అడిగాను.

"ఒక అమ్మాయిని గురించి, ఒక అబ్బాయిని గురించి నేను చెప్పిన కథ నీకు జ్ఞాపకముందా?"

"ఆఁ! జ్ఞాపకంలేకేం? ఎంత దారుణమైన కథ అది? ఈ

విధంగా అంతమై యుండకపోతే యెంత భయంకర పరిణామాలకు కారణమౌను ?"

"ఔనౌను. ఆ రోజున నా జీవిత సుఖాన్ని నేనే స్వయంగా నాశనం చేసుకునేందుకు సిద్ధమయ్యాను. కాని నీవు సకాలంలో అడ్డుపడి నన్ను రక్షించావు. అసలింతకీ చెప్పవచ్చేదేమంటే నే నా రోజున చెప్పిన వన్నీ అబద్ధాలు. చేసిన పాపం చెబితే పోతుందంటారు. ఆ విషయాలన్నీ నీతో చెప్పాలని నా ఉద్దేశం."

"ఒద్దు, ఒద్దు! చెప్పనవసరం లేదు."

"ఖంగారు పడకు" అన్నారాయన నవ్వుతూ. నే నప్పుడు చేసిన పనిని బలపరచుకోవడమే నా ఉద్దేశం. అప్పట్లో నా ఉద్దేశమల్లా నీతో వాదించడమే."

"వాదించడం యెప్పుడూ సరైన పద్ధతికాదు" అన్నానేను.

"ఔనౌను. నా వాదన తప్పే. జీవితంలో నేను పొందిన అనేక పరాజయాల తర్వాత, చేసిన పొరపాట్ల తర్వాత యిక్కడికి వచ్చేముందే ప్రేమకూ నాకూ సగమెరుక అనీ, నేను చెయ్యవలసినదల్లా సాఫీగా వడిదుడుకులేవీ లేకుండా బ్రహ్మచారిగా గడిపెయ్యటమేననీ నిశ్చయించు కున్నాను. ఆ నిశ్చయానుగుణ్యంగా నీ పట్ల నా భావాలను అదుపులోనికి తెచ్చుకోలేక, యెటువంటి పరిణామాలకు దారి తీస్తుందోననే భయంతో చాలకాలం పాటు మనస్సంతా వికలం చేసుకున్నాను. ఒకవంక ఆశ, వేరొకవంక నిరాశ నా మనస్సులో కొట్టుమిట్టాడేవి. ఒక్కొక్కమారు నువ్వు తమాషా చేస్తున్నావేమో అనుకునేవాణ్ణి. వేరొకమారు నువ్వు నిజంగానే నన్ను ప్రేమిస్తున్నావని నమ్మకం కలిగేది. కాని యేమి చెయ్యటానికీ తోచేదికాదు. మనం తోటలోనికి షికారుకు పోయి వచ్చిన రాత్రి నీకు జ్ఞాపకముందా ? ఆ రోజున మళ్లీ నా మనస్సు వికలమై పోయింది. ఆ రోజున నాకు కలిగిన ఆనందాతిశయంలో అదంతా నిజ మేనా అనే భ్రాంతి నన్ను పీడించింది. ఆశించి, విఫలమనోరథులైతేనేమి

అని మవ్వడగవచ్చు. కాని, అప్పటికి అతిస్వార్థపరుడనైన నేను నా విషయంతప్ప యితరమేమీ ఆలోచించడమే లేదు."

ఆయన ఆగి నా వంక ఒక మారు చూశారు.

"కాని నేనప్పుడు చెప్పినదంతా అసంబద్ధమని త్రోసివెయ్యటాని కూడా వీల్లేదు. ఆ విధంగా నేను భయపడటమూ సహజమే; నా భయం కొంత వరకు సహేతుకమే కూడా. నీ వల్ల నేను పొందేది అత్యధికమూ, మరి నీకు నేను సమర్పించగలిగేది అతిస్వల్పమే. నువ్వింకా చాల చిన్నదానివి. వికసించని గులాబిమొగ్గవంటి దానివి. నువ్విదివర కెన్నడూ ప్రేమ మొగమెరుగని దానివి; మరి నేనో........"

"చెప్పండి, అంతా దాచకుండా చెప్పెయ్యండి...." అని అడగబోయి, ఆయన జవాబును తలుచుకుని భయపడి "ఒద్దు, ఫర్వాలేదులెండి" అన్నాను.

"నే నిదివర కెవరినైనా ప్రేమించానా అనేకదా నీ సందేహం?" అన్నారాయన నా భావాన్ని గ్రహించి. "ఆ విషయం కూడా చెప్తానాగు. ఇప్పుడు ప్రేమిస్తున్నట్లుగా యిదివరకెన్నడూ ప్రేమించలేదు." కాని, అంతలోనే బాధాకరమైన ఆలోచన ఒకటి ఆయన మనస్సుకు తోచినట్లుంది. "లేదు" ఆయన చాల విచారంగా చెప్పారు; "ఈ విషయంలో కూడ నాపై నువ్వు సానుభూతి చూపవలసి ఉంటుంది. నిన్ను ప్రేమించే అర్హత నేను పొందేందుకుగాను నీ సానుభూతి అత్యవసరం. నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పేందుకెంత మనోనిబ్బరం కావాలి? నీకు సమర్పించ గలిగినదేముంది నా వద్ద? ప్రేమ అంటావా; అది నిజమేననుకో."

"ప్రేమ చాలదంటారా? అది స్వల్పమైనదా?" ఆయన కండ్లలోనికి చూస్తూ నే నడిగాను.

"ఔను మాషా! 'నీ' కివ్వటానికైతే అది స్వల్పమైనదే" అన్నారాయన. "యౌవనవతివి. అందమైనదానివి. మన యిర్వురి భావి సంయుక్త జీవితాన్ని గురించి దివ్యస్వప్నాలుకంటూ రాత్రిపూటలు జాగ

రము చేస్తున్నాను. నే ననేక సౌకర్యాలనుభవించాను. కాని యిప్పుడు మాత్రమే అసలైన సుఖానికి కావలసిన వస్తువులేమిటో కనుగొనగలిగాను. పల్లెపట్టుల్లో ప్రశాంత జీవితం; తర్వాత సానుభూతి సహాయాలెన్నడూ యెవరివలనా పొందనటువంటి, అల్పసంతోషులై నటువంటి పల్లీయులకు సహాయపడేందు కవకాశము; ఆ తర్వాత ఉపయోగకరమని తాను తలచే పని చేయటానికి సావకాశము; అటు తర్వాత విశ్రాంతి, శోభాయమానమైన ప్రకృతి పరిశీలన, గ్రంథపఠన, సంగీత సాధన, యిరుగు పొరుగువారి పట్ల అనురాగం-యివీ నాకు సంతోషంకలిగించేది. వీటన్నింటికంటె ముఖ్యంగా నీతో సాంగత్యం, అయితేగియితే పిల్లలు-యింతకంటె యీ జీవితంలో మానవమాత్రులు పొందగోరే సుఖాలేముంటాయి?"

"అవి చాలకేమి?" అన్నాను.

"యౌవనదశ దాటిపోయిన నా కేమో యింత మాత్రం చాలు" ఆయన చెప్పనారంభించారు. "నీకు చాలకపోవచ్చు. నువ్వు వేరువిధంగా సంతోషం పొందగోరవచ్చు. పొందవచ్చు కూడా. ఇప్పుడు మాత్రం నా యందుండే ప్రేమచేత యిదే సంతోషమనుకుంటున్నావు."

"మీరు పొరపడుతున్నారు" నే నన్నాను; "అటువంటి ప్రశాంత కుటుంబ జీవితాన్నే నేను కూడ ఆశించాను. అటువంటిదంటేనే నాకు కూడ యిష్టం. సరిగా నే నేదైతే భావించానో అదే మీరు చెప్పారు."

ఆయన నవ్వారు.

"నువ్వా విధంగా భ్రమిస్తున్నావు మాషా! కాని నీ కంతమాత్రమే చాలదు. నువ్వు నవయౌవనవతివి; అందమైనదానివి" ఆయన ఆలోచనాపూర్వకంగా అన్నారు తిరిగి.

నన్నాయన అనుమానించినందుకూ, నా యౌవనాన్ని గురించీ, అందాన్ని గురించీ దెప్పినట్లుగా మాట్లాడినందుకూ నా ఒళ్లు మండింది.

"అయితే నన్నెందుకు ప్రేమిస్తున్నారు మీరు? నా కోసమా

నా యౌవనం కోసమా ?" కోపంగా అడిగాను.

"ఎందుకో ఆదంతా నాకు తెలియదు. నిన్నుమాత్రం మనసారా ప్రేమిస్తున్నాను" అన్నారాయన. శ్రద్ధాభరితమూ, ఆకర్షణీయమైన తన చూపును నాపై బరపుతూ.

జవాబివ్వకుండా అప్రయత్నపూర్వకంగా ఆయన కండ్లలోనికి చూశాను. అంతలోనే నాలో ఒక గొప్ప మార్పు కలిగింది. మొదట్లో నా చుట్టూ ఉన్నదంతా అదృశ్యమవ నారంభించింది ; తర్వాత మిలమిల మెరిసే కండ్లు మినహాగా ఆయన ముఖం కూడ అదృశ్యమైపోయింది : ఆ తర్వాత ఆ కండ్లు రెండూ నా తలలో ప్రవేశించినట్లనిపించింది ; దానితో అంతా అయోమయమై పోయింది—ఏమీ కనిపించటంలేదు ; ఆయన తీక్షణదృక్కులు నాలో కలిగిస్తున్న భయానందాలనుండి బయట పడుటకు గాను బలవంతంగా కండ్లరమోడ్చవలసి వచ్చింది........

మా పెండ్లినాటికొక రోజు ముందుగా వాతావరణం శాంతపడింది. వేసవిలో ప్రారంభమైన వానలు వెనుకపట్టి ఆకాశం సూర్యకాంతితో శోభాయమానంగా నిర్మలంగా కనుపట్ట నారంభించింది. చల్లగా హాయిగా గాలి వీస్తోంది. రేపు—నా పెండ్లిరోజున—వాతావరణం బాగా వుంటుందనే సంతృప్తితో పక్క జేరుకున్నాను. సూర్యోదయ సమయానికే నాకు మెలకువ వచ్చింది. ఈ రోజే....అనే భావం నాలో విభ్రమాశ్చర్యాలను కలిగించింది. తోటలోనికి వాహ్యాళికై బయల్దేరాను. పచ్చని నిమ్మ ఆకుల సందునుండి సూర్యుడు తీక్షణంగా ప్రకాశిస్తున్నాడు. నిర్మలమైన నీలాకాశంలో యెక్కడా ఒక్క మేఘశకలం కూడ కానరావటంలేదు.

"ఈ రోజు నేనా !!" నా ఆనందాన్ని నేనే నమ్మలేక ప్రశ్నించు కున్నాను. "రేపీపాటికి నేనిక్కడకాక ఆ పెద్ద భవంతిలో ఉండటం నిజమేనా ? ఆయనకొరకై నేనుకండ్లు కాయలుకాచేటట్లుగా యికముందునిరీక్షించనుకదా ? రాత్రి పొద్దుపోయేవరకూ కూర్చుని కాట్యాతో ఆయనను గురించి మాట్లాడుకోలేనుకదా ? పియానో గదిలో ఆయనతో సంభాషిస్తూ

అర్ధరాత్రి వరకూ గడపనుగదా? ఆయన సెలవు గైకొని వెళ్లిపోతే చీకటి రాత్రులందు ఆయనను తలుచుకుని ఆవేదన చెందను కదా?" అనుకుంటూండగానే ఆయన గతదినం ఆఖరిపర్యాయంగా వచ్చి నన్ను చూస్తానని చేసిన వాగ్దానం, నేను పెండ్లిదుస్తులు ధరించుతే చూడాలని కాట్యా పట్టు పట్టడం జ్ఞాపకం వచ్చాయి. ఒక్కక్షణం మాత్రం అదంతా నిజమే ననిపించింది గాని, అంతలోనే తిరిగి అనుమానం నన్నావరించు కుంది. "రేపటినుండి గ్రిగరీని, కాట్యాను, పుట్టిపెరిగిన యింటినీ వదలి అత్తవారి యింట అడుగు పెట్టబోతున్నానన్నమాట! సోన్యాకు చదువు చెప్పి, జోకొట్టి పరుండబెట్టి, ఉదయమే లేచి తలుపుతట్టి జవాబుగా మన సారా ఆమె నవ్వే నవ్వును యికముందు నేను వినలేనన్నమాట! రేపటి నుండి నా మటుకు నేనే యెరుగని ఒక కొత్త వ్యక్తిగా మారిపోతాను? నా ఆశలు, కోర్కెలు సఫలమయ్యే ఒక నూతన ప్రపంచం నా ముందు రూపొందుతోందా? ఆ కొత్తప్రపంచం నిత్యంగా అల్లాగే ఉండిపో తుందా?" ఇటువంటి భావాలతో యేకాంతంగా వేగిపోతూ ఆయన రాకకై యెదురు తెన్నులు చూడ నారంభించాను. ఆయన కూడ పెంద లకడనే వచ్చారు. ఆ రోజునే నే నాయన జీవిత సహచరిని కాబోతున్నా ననే విషయాన్ని నాకు నమ్మకం కలిగేందుకు గాను ఆయన రాక అత్యం తావసరమైంది! అప్పటికి గాని నా లోని దిగులు శాంతించలేదు.

రాత్రి భోజనానికి ముందు మా తండ్రి ఆబ్దికానికి హాజరవడానికి చర్చికి నడచివెళ్లా.

"మా నాన్న కనుక బ్రతికివుంటే!" తిరిగి వస్తూ మా నాన్నకు ప్రాణస్నేహితుడైన ఆయన చేతిపై వ్రాలి నడుస్తూ అనుకున్నాను. ప్రార్ధన సమయంలో సాష్టాంగ దండప్రమాణం చేసినప్పుడు మా నాన్న రూపమెంత స్పష్టంగా నా మనోనేత్రాలకు గోచరించిందంటే ఆయన నన్ను పూర్తిగా అర్ధం చేసుకున్నాడనీ, నా పెండ్లి నంగీకరించాడనీ, ఆయన ఆత్మయింకా మా చుట్టూ పరిభ్రమిస్తోందనీ, నన్నాయన దీవిస్తూ

న్నాడనీ నాకు నమ్మకం కలిగింది. నా పూర్వ స్మృతులు, ప్రస్తుతపు టాశలు, సంతోష విచారాలు అన్నీ యేకమై బంగరు వర్ణపుటెండ, చల్లవిహాయి గొలిపే గాలి, వినీలనిర్మలాకాశాలతో కూడిన శోభాయమానమైన ప్రకృతివలెనే ఒకేఒక భావనగా రూపొందాయి. నా ప్రియుడు కూడ నా మానసికస్థితిని పూర్తిగా గ్రహించినట్లు, అవే భావాలాయనలో కూడ ప్రసరిస్తూన్నట్లు నాకు తోచింది. ఆయన నిశ్శబ్దంగా, నెమ్మదిగా అడుగు వేస్తున్నారు. ఆయన ముఖంపంక అప్పుడప్పుడు చూద్దునుకదా ఆయన మనస్సుకూడ, సంతోష విచార సమ్మిశ్రిత భావాలతో తుందిలమౌతున్నట్లుగా కాన వచ్చింది.

అంతలోనే ఆయన నా వంక తిరిగారు. ఏదో మాట్లాడదలుచుకున్నారని వెంటనే గ్రహించాను. "నే నాలోచించేది కాక వేరేదైనా విషయాన్ని గురించి ప్రారంభిస్తారేమో" అనుకున్నాను. కాని పేరు తలపెట్టకుండానే ఆయన కూడ మా నాన్నను గురించే ప్రారంభించారు.

"మా మాషాను నువ్వు పెళ్లాడాలోయ్ అన్నాడు మీ నాన్న ఒకమారు వేళాకోళంగా" ఆయన ప్రారంభించారు.

"ఇప్పుడాయన వుంటే బ్రహ్మానంద పడేవాడు" ఆయన చేతిని గట్టిగా ఒత్తుతూ నే నన్నాను.

"అప్పటికి నువ్వు చాలా చిన్నదానివి" నా కండ్లలోనికి చూస్తూ చెప్పారాయన;" ఈ కండ్లను ఆ రోజుల్లో ఆయన కండ్లను పోలి ఉంటాయనే కారణంచేత మాత్రమే ముద్దు పెట్టుకునేవాడిని. ఈ నాడివి యింత ప్రీతిదాయకంగా మారతాయని ఆ రోజుల్లో కలలోనైనా తలచలేదు. మాషా అని ఆరోజుల్లో నిన్ను పిలిచేవాణ్ణి."

" 'ప్రియతమా' అని పిలవండి నన్ను" అన్నాను.

"అల్లాగే" అన్నారాయన. "ఇకనుండి నువ్వు పూర్తిగా నా దానివై పోయావు ప్రియతమా" నన్నత్యధికంగా ఆకర్షించిన ఆయన చూపులు నాపై నిలిచిపోయాయి.

మోడులైన వరిదంట్ల మీదుగా యేర్పడిన కాలిబాటలో మే మిర్వు రమూ నడిచిపోనారంభించాము. చుట్టు ప్రకృతి అంతా అతిప్రశాంతంగా వుంది. మా పాదాల తాకిడికి వరిదంట్లు చేసే చప్పుడూ, మా మాటలు తప్ప వేరే శబ్దమూ వినరావటంలేదు. అల్లంత దూరంలో రైతొకడు నల్లని భూఖండాన్ని నిశ్శబ్దంగా దున్నుకుంటున్నాడు. కొండక్రింద గుర్రాల గుంపొకటి చెల్లాచెదరై బీటిలో మేతమేస్తోంది. మా యింటికీ మాకూ మధ్య శీతాకాలపు పంటభూమిలో బాగా పండి ఒరిగిన వరిపైరు గాలికి ఊగుతూ పకపక నవ్వుతూన్నట్లు కానవస్తూంది. శీతాకాలపు సూర్యుని బంగారు కిరణాలు జగమంతా వ్యాపించాయి. మా మాటలధ్వని మా తలలపై పరిభ్రమిస్తూ శీతకాలపు సూర్యుని బంగారు కిరణాలు దోబూచులాడుతున్న విశాలవినీలాకాశం క్రింద మే మిర్వురమూ ఏకాంతంగా వున్నట్లు తలపిస్తోంది.

నేను కూడ ఆయనను 'ప్రియతమా' అని సంబోధించాలని మనసు పడ్డానుగాని అంతలోనే సిగ్గు నన్నావరించుకుంది.

"అంత తొందరగా నడుస్తారేం 'ప్రియతమా'?" తొందర తొందరగా నాలో నేనే అనుకున్నట్లుగా అన్నాను; అన్నానేగాని సిగ్గుతో కుంచించుకు పోయాను.

ఆయన తన నడక వడిని వెంటనే తగ్గించారు. అప్పుడాయన నా వంక బరపిన దృష్టిలో మరింత ప్రేమ, ఆదరణ, ఆనందం వెల్లివిరిశాయి.

ఇంటివద్ద అప్పటికప్పుడే బంధువర్గమూ, పెండ్లి పెద్దలు సమావేశమయారు. అప్పటినుండి చెర్చిలో తతంగమంతా పూర్తియై, మేమిర్వురమూ నికోల్స్కో పోవటానికి బండి యెక్కేటంత వరకూ మళ్ళీ నే నాయనతో ఒక్క క్షణంకూడా యేకాంతంగా లేను.

ఆఖరికి చెర్చి అంతా నిర్జనమైంది. ఆయన తల్లి దేవు డరుగు ప్రక్కనే నిలబడి వుంది; కొడుకు వియోగం తలుచుకుని కంట నీరు

కారుస్తూంది. మా సేవకుల్లో ఒకరిద్దరు నా వంక ఆశ్చర్యంగా చూస్తు న్నారు. ఆయనవంక నేను చూడకనే నా ప్రక్క ఆయన సాక్షాత్కారాను భూతి పొందుతున్నాను. వివాహ మంత్రాలను వింటున్నాను. ఉచ్చరిస్తు న్నానే గాని, అవి నా మనస్సులో ప్రతిధ్వనించటం లేదు. ప్రార్థించే శక్తి లేక వెలుగుతూన్న క్రొవ్వువత్తుల వంక, దీపపు సెమ్మెలవంక, తెర వంక, కిటికీ వంక చూస్తున్నానే గాని నా మనస్సు దేనినీ గ్రహించడం లేదు. నాలో యేదో వింతమార్పు జరుగుతూందనిమాత్రం అస్పష్టంగా గ్రహించుకో గలిగాను. ఆఖరికి పూజారి చేతిలో శిలువతో మా వంక తిరిగి మమ్మల్నభినందించి "మీ నామకరణోత్సవం నేనే చేశాను. దేవుని దయవల్ల మీ వివాహంకూడా నేనే చెయ్య గలిగాను" అన్నాడు. ఆయన తల్లీ, కాట్యా, మమ్మల్ని ముద్దు పెట్టుకున్నారు. గ్రిగరీ బండిని సిద్ధం చేశాడు. అంతలోనే నామనస్సులో భయం, అసంతృప్తి పెనగొన్నాయి. అంతా పూర్తియైపోయింది. అందులో అసాధారణమైనదేదీ లేదు; కాని వివాహ మంత్రాల కనుగుణ్యంగా నాలో కలిగిన మార్పేమీ కనిపించ లేదు. ఆయనా, నేనూ ముద్దిడుకున్నాం; కాని అది మా భావాల కను గుణ్యంగా కాక వింతగా కొత్తగా ఉంది, "పెళ్ళంటే యింతేనా ?!" అని ఆశ్చర్యపోయాను. చెర్చినుండి బయటకు వెళ్ళాం. బండి కిర కిర ధ్వనిచేస్తూ దగ్గరకు వచ్చింది. చల్లనిగాలి ముఖానికి తాకింది. ఆయన టోపీ పెట్టుకుని తన చేతిని నా కాసరా యిచ్చి బండిలో యెక్కించారు. గుడి కట్టిన చంద్రుడు కిటికీగుండా కానవస్తున్నాడు. బయట అంతా పొగ మంచు కమ్ముకుని వుంది. ఆయనకూడ యెక్కి నా ప్రక్కనే కూర్చుని బండి తలుపు బిడాయించారు. ఒక్కమారుగా నాలో యేదో అనిర్వచ నీయమైన బాధ కలిగింది. తత్తరపాటు లేకుండా ఆయన చేసినపని నాకు అవమానంగా కనిపించింది. తలకేదైనా కప్పుకోమని కాట్యా కేక వేసి చెప్పింది. బండి కటకట శబ్దం చేస్తూ చెర్చి ఆవరణ దాటి సాఫీయైన రోడ్డును జేరి శబ్దంలేకుండా పరుగిడ నారంభించింది. ముడుచుకుపోయి

ఒకమూల కూర్చుని చల్లని వెన్నెలలో దూరాన వున్న పొలాలను, వెను కకు పరుగిడుతున్న బాటను చూస్తూన్నాను. ఆయనవంక చూడకనే నా ప్రక్కన ఆయన సాక్షాత్కారాన్ని అనుభవిస్తున్నాను. 'ఏదో బ్రహ్మాండం తల్లక్రిందులై పోతుందనుకున్నాను. ఇంతేనా?' అనుకున్నాను; కాని యేకాంతంగా, అందులోనూ ఆయనకంత సన్నిహితంగా కూర్చోవడం మాత్రం చాల అవమానకరంగాను, తలవంపులుగాను తోచింది. మాట్లా డాలని ఆయనవంక తిరిగాను; కాని నాలో ఆయనపై గల ప్రేమ విలుప్త మైపోయి, దాని స్థానాన్ని అవమానభారం. ఆందోళన ఆక్రమించుకున్నా యేమో నన్నట్లుగా మాటలు పెకలి రాలేదు.

"ఇదంతా యీ విధంగా జరుగుతుందని ఒక క్షణం క్రితం వరకు నాకు నమ్మకమే లేదు" అన్నారాయన నా చూపుకు జవాబుగా.

"ఎందుకోగాని నాకు భయమేస్తోంది" అన్నాను.

"నేనంటేనా భయం ప్రియతమా?" అన్నారాయన నా చేతిని తన చేతిలోనికి గైకొని దానిపైకి ఒంగుతూ.

నా చెయ్యి చైతన్య విహీనమైపోయింది; నా గుండెకూడ పిడచ కట్టుకుపోయినట్లయి బాధ కలిగించింది.

"అవును" అని గొణిగాను అస్పష్టంగా.

కాని అంతలోనే నా గుండె తీవ్రంగా కొట్టుకో నారంభించింది. నా చేయి కంపించి ఆయన చేతిని గట్టిగా అదిమింది. నాలో వేడి జనిం చింది. బండిలో వ్యాపించియున్న అర్ధాంధకారంలో నా కండ్లాయన ముఖాన్ని వెతుక నారంభించాయి. అకస్మాత్తుగా ఆయనపట్ల నాకు కలి గిన భావం భయం కాదనీ, అదే ప్రేమ అనీ- పూర్వపు ప్రేమకన్న శత సహస్రాధికంగా యిది బలవత్తరము, మార్దవమైనదనీ తోచింది. ఆయ నకు సంపూర్ణంగా కైవసమై పోయాననీ, అట్లా కావటంలోనే నా జీవిత సౌఖ్య మిమిడి యుందనీ తలపోశాను.

# అధ్యాయం 6.

తెలియకుండానే రోజులు, వారాలు, అంతేకాదు రెండు నిండు మాసాలు ఈ గ్రామంలో గమ్మత్తుగా గమనిక లేకుండా గడచిపోయా యని మేము విచారించాం. అయితేనేం ఈ రెండు నెలల్లో ఎన్నో అను భవాలు — అనుభూతులు ఎంతో ఉత్సాహం — ఉద్రేకం జీవితాని కంత టికీ సరిపడ ఆనందాన్ని పొందాం. మేము నిశ్చయించుకొన్న రీతిగా పల్లెటి ప్రాంతాల్లో నివసించినంతకాలం జీవితాన్ని క్రమమైన కట్టుబాట్లతో ఆదర్శప్రాయంగా నడపాలనే నిర్ణయాలను వేటినీ ఆచరణలో పెట్టలేక పోయాం. కాని ఆ మా నిశ్చయం ఆదర్శాలకేమీ తీసిపోదు.

నా వివాహానికి పూర్వం నాభర్తవలె కష్టించి పనిచేసేవారు, పరుల సుఖంకోసం స్వసుఖాలను కూడ త్యాగం చేసి చక్కని కార్య నిర్వ హణా నైపుణ్యాన్ని ప్రదర్శించేవారు, ప్రదర్శింపగలవారు ఎవరూ లేరని ఉండబోరనీ నా మనోఫలకంలో ఏమేమో చిత్రించుకొన్నాను. కాని తర్వాత, జీవిత యాత్రలో తద్వ్యతిరేకంగా నేను చూచిందేమంటే ఒకరి నొకరు గాఢంగా ప్రేమించాలని తాపత్రయ పడడం, ఎవరికి వారు స్వార్థపూరితములైన తమ తమ ప్రేమలను ప్రకటించడం, ఆ ప్రేమ ప్రవాహాలలో ఈదులాడుతూ బాహ్య ప్రపంచ ఉనికినే పూర్తిగా మరిచిపోవడం - అంతే కాదు, ఎల్లప్పుడు ఉండే ఏదో కారణ రహిత మైన, అవ్యక్తమైన ఆనందం - ఇవీ నేను చూచినవి, అనుభూతి చెంది నవీను. అప్పుడప్పుడు నా భర్త నన్ను విడచి తమ పనులలో నిమగ్ను లవడమో, లేదా యితర పనులపై పట్టణానికి వెళ్ళడమో, కాదంటే జమీను వ్యవహారాలు చూచుకోవడమో చేసేవారు. ఆయన నాకు దూరం వెళ్ళడమంటేనే బాధగా నుండేది. "ఈయనకు నన్ను విడచి దూరంగా త్రెంచుకొని పోవలసిన అత్యవసరమైన అపాయకరమైన పనులేమి వచ్చి పడ్డాయి ?", అని విసుక్కునేదాన్ని. తర్వాత నాభర్త తమ వెంట నేను

లేకపోతే తమ సేవని చేద్దామన్నా ఉత్సాహంగాని ఆసక్తిగాని అసలే లేకపోవడం వల్ల ప్రతీదీ అర్థశూన్యంగాను, అసహ్యాకరంగాను, కను పడుచున్నదని వారి అనుభూతులను విశదీకరించారు. నా అవస్థకూడ అచ్ఛంగా అలాగే ఉన్నట్లు తోచింది. పోనీ ఏదయినా చదివినా, కాసేపు పియానోపై పాడినా, లేదంటే బడికి పోయి పిల్లలకేదైనా బోధించినా, ఏదీ కాదంటే అత్తగారితో కాసేపు కబుర్లతో కాలక్షేపం చేసినా కాలం గడిచేది కాదు. అసలా పనులన్నీ నే నెందుకు చేసేదాన్నంటే అవన్నీ ఆయనతో కొంచెం కాకపోయినా కొంచెం సంబంధం కలిగియున్నవీ, ఆయన అంగీకారాన్ని పొందినవీ కాబట్టే; ఆయన తలపుకు భిన్నమైన ఏ పని చేయడానికీ, నా చేతులు వెనుకాడడమే కాకుండా, ఆయన సంబంధం, ప్రమేయం లేనిదే దేనినిగూర్చయినా కాస్త ఆలోచించుటే నాకు అవివేకంగా కనబడేది. బహుశా అది తప్పు అభిప్రాయం కావచ్చు. స్వార్థంగా కనబడవచ్చు కాని నాకది అమితోత్సాహాన్నివ్వడమే కాకుండా, నాకీ ప్రపంచంలో అత్యున్నత స్థానాన్నొసగినట్లుండేది. ఆయనొక్కరే నా కొరకీ భూమిపై అవతరించారని, ఆయనే ప్రపంచంలో అందరికంటె తగినటువంటి, శ్రేష్ఠుడయినట్టి పురుషునిగా నే నెంచేదాన్ని. కనుక ఆయనకొరకు కాకపోతే, జీవించడమే నిరర్థకమనీ, ఆయన అభీష్టాన్ని పొందడమే నాకీ ప్రపంచంలో మిగిలియున్న ఏకైక ఆదర్శమనీ నా దృఢాభిప్రాయం. ఇక ఆయన దృష్టికి నేను ప్రపంచంలో అతి రమణీయమైన, సౌందర్యమైన యువతుల్లో ప్రప్రథమ స్థాన మలంకరించగల యువతిగాను, ఈ విశాల విశ్వంలో సకల సద్గుణ సంపదను సాకల్యంగా పొందుపర్చుకొన్న సుందరాతి సుందరిగాను, ఉత్తమోత్తమ పురుషులు తమ ఆదర్శములకు సరిగా తూగు స్త్రీని గురించి ఏయే మధుర స్వప్నాలను కంటూంటారో అవన్నీ వాస్తవంగా విభిడీకృతమై నిలచినటువంటి విందు యవ్వనాంగిగా కనబడ్డాను.

ఒకరోజు సాయంత్రం నేను ప్రార్థన చేసికొంటూండగా ఆయన నా గదిలోనికి వచ్చారు. పై నుంచి క్రిందవరకు ఆయనొకసారి పార చూచి, నా పనిలో నేను నిమగ్నురాల నయ్యాను. నన్ను ఆటంక పరచడ మెందుకని బల్లపై వంగి ఏదో పుస్తకం తిరుగవేస్తున్నారు. నా వంకే తదేక దృష్టితో చూస్తున్నారనుకొని, నన్ను నేనొక సారి పరకాయించి చూచుకొన్నాను. ఇది చూచి ఆయన చిన్న చిరునవ్వు నవ్వారు. దానితో నాకూ నవ్వు ఆగ లేదు. ప్రార్థనమధ్యలో ఆగిపోయింది.

"మీ ప్రార్థన అప్పుడే అయిపోయిందా ?" అని ప్రశ్నించాను.

"ఆఁ, దానికేంలే గాని, నీ పనిని నీవు కానీ, నేను వెళ్ళిపోతా" అన్నారాయన.

"అసలు మీరు ప్రార్థన చేస్తారనుకొంటాను ?" అన్నాను మళ్ళీ అందుకొని. దాని కేమీ సమాధాన మివ్వకుండా గదిని విడచి వెళ్ళిపో తుంటే నే నాయన్ని ఆపి "ఏమండీ ఈ రోజున నా కొఱకయినా దయ యుంచి నాతో కలసి ప్రార్థన చేయండి" అని అర్థించగానే ఆయన నా ప్రక్క నిలబడి వంకర టింకరగా చేతులు త్రిప్పుతూ, గంభీర వదనంతో తడబడుతూ ప్రారంభించి తరచు నా వైపు తిరిగి నా అంగీకారయుత సౌజ్ఞల కొరకై నా ముఖంలోకి చూచేవారు. చివరి ఘట్టంలోనికి రాగానే అపుకొన్న నవ్వు నంతా ఒక్కసారి బహిర్గతం చేసి గాఢంగా ఆయన్ని కౌగలించుకొన్నాను. ఆయన నా చేతులను ముద్దాడుతూ "రాత్రి పది గంట లయినట్లుంది నాకు. నీ వింకా ఈ కర్మకాండనంతా నెరవేరుస్తూ కూర్చున్నా వేమిటి ?" అన్నారు.

మా యిల్లు తర తరాలనుండి వంశ పారంపర్యంగా వస్తూన్నది కాబట్టి పురాతన పల్లె పద్ధతుల్లోనే కట్టబడింది, మా పూర్వీకులంతా ఈ చూరు క్రింద ఒండొరులను గౌరవించుకొంటూ పరస్పర ప్రేమాదరణ లతో జీవిత యాత్రలను సాగించారు. ఇవన్నీ సాత్వికమైన సద్గుణ సంప దతో సాగించిన సంసారుల పద్ధతుల్ని సంగ్రహంగా స్పష్టపరుస్తాయి.

నే నీ యింటిలో కాలు పెట్టగనే అవన్నీ నా సొత్తు అయినట్లే అనిపించింది. ఇంటి పెత్తనమంతా నా అత్తగారయిన "తాత్యానా సెమినోవ్నా" గారే నిర్వహించేవారు. ఆమె పూర్వాచార పరాయణి. కాబట్టి ఆచార వ్యవహారాలన్నీ ఆ ఫక్కీలోనే ఉండేవి. అందం, ఆకర్షణ, నూతనాలంకరణలు గృహంలో ఎక్కడా కనబడకపోయినా కావలసిన పరిచారికలు సదా కనిపెట్టుకొని ఉండేవారు. అవసరమైన భోజన పదార్థాలు, కత్ర సామాగ్రి, ఒకటేమిటి ! వలయు ప్రతి వస్తువుు ఎక్కువగానే నిలువ చేసేవారు. క్రమశిక్షణ, శుభ్రత, ఏకాగ్రతలను చూచిన ప్రతి వ్యక్తికీ ఈ యింటిపై అత్యంత గౌరవ మర్యాదలు పుట్టకమానవు. అతిథుల కొరకై ఏర్పాటు చేయబడిన గదిలో కుర్చీలు, బల్లలు, క్రమము తప్పని వరుసలలో అందంగా అమర్చ బడినాయి. నేలపై యింట్లో తయారు చేయబడిన తివాసీలు, చాపలు పరువబడ్డాయి. గోడలకు చక్క చక్కని ఫొటోలు తగిలించ బడ్డాయి. మేమంతా ఉదయాన్న ఆనందంగా గడిపే గదిలో ఒక పాత పియానో, చక్కని బల్లలు, సోఫాలు అమర్చారు. అంతే కాదు, యింటినిండా యిత్తడి అలంకార సామాగ్రి సమృద్ధిగా ఉంది. నా పడక గదిని మా అత్తగారు స్వయంగా ప్రత్యేక శ్రద్ధ తీసుకొని యింట్లో నున్న సుందరమైన కత్రసామగ్రిని రకరకాలుగా అమర్చి అత్యంత శోభాయమానంగా తయారు చేశారు. పురాతనమైన విలువుటద్దం కూడ నా గదిలోనే పెట్టారు. మొదట్లో ఆ అద్దంకేసి చూడడమే భయంగా ఉండేది. దాని విలువ తెలిసికొన్న తర్వాత అది నాకు ఆప్తబంధువైపోయింది. మా అత్తగారి గొంతుక పైకేమీ వినబడక పోయినప్పటికీ గృహ కృత్యాలన్నీ చడీ చప్పుడు లేకుండా, గడియారంలాగ సక్రమంగా నెరవేర్చ బడేవి. ఇంట్లో సేవకుల సంఖ్య ఎక్కువగానే ఉండేదని మీకిదివరలో చెప్పాను. వారంతా మడమలు నాడాలు లేని మెత్తని రబ్బరు బూట్లను ధరించేవారు.* ఎందుచేతనంటే శబ్దంచేసే చెప్పులంటే మా అత్తగారికి అమితమైన కోపం. మా అత్తగారి ముందు ఈ సేవకులంతా

ఒణుకుతూ జాగ్రత్తగా ఎవరి పని వారు నిర్వహించుకొని పోయేవారు. ఎవరి కే పని యిచ్చినప్పటికి గర్వంతోను, సంతృప్తితోను స్వీకరించే వారు. నే నన్నా నా భర్తగారన్నా వారందరికి ఎంతో ఆప్యాయం. మా పనులను ప్రత్యేక శ్రద్ధాభక్తులతో కడు నేర్పుగా అత్యంత సంతృప్తి కరంగా నెరవేర్చేవారు.

ప్రతి శనివారం తప్పకుండా యింటి నంతటినీ కడగడం, తివాసీల దుమ్ము దులపడం విధిగా చేసేవారు. ప్రతి నెల మొదటిరోజున పరిశుద్ధ జలంతో యింటినంతటినీ పవిత్రం చేసేవారు. నా అత్తగారి, నా భర్తగారి పుట్టిన రోజులు వచ్చినపుడు (నా పుట్టిన రోజుకూడ ఈ వసంత కాలంనుండి జరుపడం ప్రారంభించారు) పెద్ద అట్టహాసంగా పండుగ చేసి అనేక ప్రత్యేక ప్రదర్శనాలతో చుట్టుప్రక్కల వారినందరినీ కూడ ఆనందాబ్ధిలో ముంచి తేల్చేవారు. ఇది మా అత్తగారి చిన్నతనం నుండీ అనుమాయితిగా వస్తోందట.

నా భర్త గృహ నిర్వహణాది విషయాల్లో ఏమీ జోక్యం కలుగ చేసుకొనేవారు కాదు, భూముల, కూలీల సమస్యలే వారి కాలా న్నెక్కువగా హరించేవి. శీతాకాలంలోకూడ ఆయన బహు పెందలకడనే లేచి పొలం పను లేలా సాగుతున్నాయో సరిచూడడానికి వెళ్ళేవారు. నేను లేచి చూచే సరికి కనపడేవారు కారు. ఆ పనులన్నీ పర్యవేక్షించిన తర్వాత సరిగా టీ త్రాగే వేళకు వచ్చేవారు. ఉదయాన టీ మే మిద్దరమే త్రాగేవారం. ఆ సమయాన, అలసటను, కించిల్లి మరచిపోయి ఆయన చాల ఉల్లాసంగా ఉండేవారు. ఈ ఉల్లాసాన్నే మే మంతా "పిచ్చి ఉల్లాసం" అని పిలచే వాళ్ళం. నేను తరచుగా లేచిన దగ్గరనుండి అప్పటి వరకు ఆయన చేసిన కార్యకలాపాలను యేకరవు పెట్టించేదాన్ని. ఆయన కల్ల బొల్లి కథ లేవో అల్లి అసాధ్యమైన పనులన్నీ చేసినట్లు ఏకరువు పెడుతూంటే నాకు కడుపుబ్బేటంత నవ్వు వచ్చేది. ఆఖరి కది శృతి మించి రాగాన పడి పెద్ద పెద్ద అరుపులు దాక దేకేది. ఒకొ్కక్క

ప్పుడు వాస్తవిక విషయాలను మాత్రమే చెప్పవలసినదిగా నేను ఒత్తిడి చేసినప్పుడు మాత్రం, వచ్చే చిరు నవ్వు నాపుకొంటూ నిజం చెప్పే వారు. ఆ సమయంలో ఆయన నేత్రాలను, మాటిమాటికి కంపించే అధరాలను అవలోకించడానికి ఆనందదాయకంగా ఉండేవి. మధ్య మధ్య "ఆఁ ఏమిటి చెప్తున్నాను ?" అని ఆయన తరుచు ప్రశ్నించేవారు. పదే పదే వచ్చే ఆప్రశ్నకి ప్రత్యుత్తర మివ్వడ మనవసర మని మెదలకుండా ఊరుకొనేదాన్ని. ప్రపంచంలో పరిస్థితులెంత ప్రచండంగా పరివర్తన చెందినా, పరిణామం చెందినా నాకేమీ పట్టింపు లేనట్లు మా విషయాలు తప్పవిడచి, మరే విషయాలను గూర్చి చర్చించినా, ప్రస్తావించినా నా కర్థశూన్యంగాను, అగమ్య గోచరంగాను వుండేది. తర్వాత చాల కాలానికి నెమ్మది నెమ్మదిగా ఆయన నిర్వహించే కార్య కలాపాలను గురించి కొద్దికొద్దిగా తెలుసుకోవాలనే ఆసక్తి కలుగ చేసికొనడానికి ప్రయత్నించి, అటుపైన అర్థం చేసికొనడానికి సాహసించే దాన్ని. మధ్యాహ్న భోజనానికి ముందు మాత్రమే అత్తగారు కనిపించే వారు. సుప్రభాత సందేశాభివందనాలను కూడ ఏ పరిచారిక ద్వారానో, మా కందచేసే వారు. ప్రాతఃకాల ఫలహారాన్ని ఆమె ఒంటరిగానే తీసుకొనేవారు. మా చిన్న ప్రపంచంలో మేము పొందే ప్రత్యేకానంద ఘడియల్లో యింట్లోని ప్రశాంత వాతావరణంనుండి గృహ పరిస్థితులను వివర్ణించడాని కొకామె వచ్చి మా ముందు నిలబడేది; ఆమెను చూచినప్పుడు మాత్రం నన్ను నేను అదుపాజ్ఞలలో పెట్టుకో లేనంత నవ్వు వచ్చేది. ఆమె మా ముందు చేతులు కట్టుకొని వినయంగా నిలబడి సావధానంగా "గృహ యజమానురాలు గారు నిన్న సాయంకాలం వాహ్యాళికి వెళ్ళి వచ్చిన తర్వాత రాత్రి సుఖనిద్ర కల్గినదీ లేనిదీ తెలసికొని రమ్మన్నారని. ఆవిడ గారికి రాత్రంతా ప్రక్క నొప్పిచేత, దిక్కుమాలిన కుక్క మొరగడంవల్ల నిద్రాభంగం కల్గిందట. తర్వాత ఉదయం తయారుచేయబడిన రొట్టె ఏలాగున్నదో కనుక్కోమన్నారు. ఈ రోజు రొట్టె కాల్చినది

"తార" కాదని యిప్పుడిప్పుడే నేర్చుకొంటూన్న "నికోలస్కా" యని. అంత బాగుండక పోయినా రొట్టె చెడిపోలేదని. టీ బిస్కట్లు ఎక్కువగా కాల్చారని ఆమె తమ అభిప్రాయాలను తెలియచేసి రమ్మన్నార"ని గుక్క తిరక్కుండా ఆమె గబగబ వర్ణించేసేది. మధ్యాహ్నం మా యిద్దరికీ కొద్దిసేపు మాత్రమే మాట్లాడుకొనడానికి వీలుండేది. తర్వాత ఆయన యేదైనా వ్రాసుకోవడమో లేదా యితర పనులపై బయటకు పోవడమో చేసేవారు. నేను పియానోపై పాడుటగాని, లేదంటే ఏ పుస్తక పఠనమో సాగించేదాన్ని. సాయంకాల మయ్యేసరికి అందరం వీధిగదిలో గుమి గూడేవాళ్ళం. మా అత్తగారు తమ గది విడచి మా యింట్లో నివసించే యిద్దరు ముగ్గురు పెండ్లిగాని పేద పడుచులను వెంట పెట్టుకొని హాజరయ్యేవారు. పూర్వపు అలవాటు ప్రకారం తన తల్లి గది ద్వారం దగ్గరకు రాగానే నా భర్త లేచి ఆమెగారి చేయి పట్టుకొని ఎంతో ఆప్యాయంగా అల్పాహారానికి ఆహ్వానించేవారు. కాని నేను కాపురానికి వచ్చినప్పటినుండి రోజూ నేనే ఆమెను చేయి పట్టుకొని తీసుకొని రావాలని ఆమె పట్టుబడుతూ వచ్చారు. నేనే విడవకుండా ఆమె కోరిన ప్రకారం చేసేదాన్ని. సరిగా ఆమె గుమ్మం దగ్గరకు వచ్చేసరికి పూర్వపు అలవాటు చొప్పున చటుక్కున లేచి నా భర్త తన చేతిని వారి తల్లికి అందించేవారు. నా కర్తవ్యం నెరవేర్చడానికని నేను కూడ లేచి గదిద్వారం దగ్గరకు వెళ్ళేదాన్ని. అక్కడ మా యిద్దరి చేతులు తగులుటే కాకుండా ఒకరి నొకరు ఢీకొనేవాళ్ళం. అల్పాహార విందు కార్యక్రమానికి మా అత్తగారే అధ్యక్షత వహించేవారు. అప్పుడు జరిగే సంభాషణలు సరళంగా సౌమ్యంగా, సగౌరవ సమన్వితమై సాగేవి. కాని ఈ సాధారణ సంభాషణల కప్పుడప్పుడు నేను నాభర్త మాలో మేము సాగించే మధుర భాష లడ్డు తగిలేవి. తరుచు తల్లితనయుల మధ్య తగాదాలు చెలరేగి వారిద్దరికి మాట పట్టింపులు వచ్చేవి. ఈలాంటి దృశ్యాల్ చూడడానికి నాకు చాల ముచ్చటగా నుండేది. ఎందుచేతనంటే ఆ చిన్న చిన్న కల

తలు కలహాలు వారిద్దరిమధ్య బలోపేతమైన, అఖండమైన గౌరవ ప్రేమాదరణాభిమానాలను పెంపొందింప చేసేవి కాబట్టే ! విందు ముగిసిన తర్వాత అత్తగారు హాలులోనికి పోయి పడక కుర్చీలో పొడుం డబ్బీ ప్రక్కన పెట్టుకొని పరుండి, క్రొత్త పుస్తకాలలో మధ్య మధ్య అంటుకొన్న కాగితాలను విడదీస్తూండేవారు. మేము ఏదయినా పుస్తకం చదవడం గాని, ఏదీ తోచకపోతే పియానో గదిలోనికి పోయి పాటలు పాడుకొనుటలో గాని కాలాన్ని గడిపేవాళ్ళం. సర్వసాధారణంగా సాయంసమయాల్లో సంయుక్త పఠన సాగించేవాళ్ళం. క్రొత్త క్రొత్త గేయాలు పాడడమంటే నాకు బహుపరమానందంగా నుండేది. ఆయనకింపైన పాటలు నేను పాడేటప్పుడు ఆయన దూరంగా పోయి సోఫాలో నాకు కనబడకుండా కూర్చొని ఆనందించేవారు. సంగీతకళా ప్రభ ఆయనపై తన ప్రచండ శక్తిని ప్రదర్శించడంవల్ల పాపమాయన దాని తీవ్ర ధాటికి తట్టుకో లేక దూరంగా కూర్చొనేవారు. సంగీతంపై ఆయనకున్న తీరని మమకారానికి, ఆసక్తికి, అభిమానానికీ ఆయనే సిగ్గుపడేవారు. వాటిని పైకి బహిర్గతం చేయకూడదని ఆయన చాల ప్రయత్నించి ప్రయాసపడేవారు. తరుచు నేను పాడుతూ పాడుతూన్న పియానో దగ్గర నుంచి లేచి ఆనందోద్రేకాలతోను, ఉత్సాహ ఉల్లాసాలతోను ఉప్పొంగే ఆయన ముఖ కవళికలేలా ఉన్నాయోనని చూచివచ్చేదాన్ని. ఆయనెంత ఆపుదా మనుకొన్నా ఆగకుండా ముఖంలో ఆ అసాధారణ చిద్విలాసం ఆనందబాష్ప పరివేష్టిత నయనాలలో ద్యోతకమవుతూనే ఉండేది. ఈ సంతోష ఘడియల్లో మే మెలాగున్నామో మాకు తెలియకుండా చూచి పోదామని మా అత్తగారు ఏమీ పని లేకపోయినా, మా గదిగుండా నడిచి వెళ్ళుతూ, ఏదో పెద్ద పనిలో మునిగి తీరుబడి లేకుండా అల్లాడుతూన్నట్లు అభినయిస్తూ గబగబ నడిచి మరల యిట్టే తిరిగి వచ్చేవారు. ఆమె అంత తొందరగా తన గదిలోనికి పోయి వెనువెంటనే వడివడిగా తిరిగి రావలసిన అత్యవసర కార్యాలేవీ లేవనీ, కేవలం మమ్మల్ని చూడ

డానికే అటు నిటు తిరుగుతున్నారని నాకు రూఢిగా తెలుసు. మరల సాయంత్రం టీ త్రాగడానికి మేమంతా వీధి గదిలో సమావేశ మయ్యే వాళ్ళం. నేనే టీ కలిపి ఆనందంతో అందరికీ కప్పులను అందించేదాన్ని. ఆ ఉత్సాహంలో చాలసేపటివరకు నా నరాలు పటుత్వంలో నుండేవి కావు. ఈ చిన్నవయస్సులో ఈలాంటి ముఖ్య కార్యక్రమాన్ని నిర్వర్తించ డానికి నేను తగనని లోలోన చాల భయపడేదాన్ని. అందరికి కప్పులలో టీ పోసి పేరు పేరున పిలచి అందిస్తూ "పంచదార సరిపోయిందా ?" అని వినయంగా ప్రశ్నిస్తూ, చాలని వారికి పంచదార అందిస్తూంటే "అబ్బో యికనేం ! పెద్ద అనుభవమున్న స్త్రీలాగ వ్యవహరిస్తున్నావే!" అని నా భర్త విమర్శిస్తూంటే నాకు మరీ ఖంగారుగా నుండేది.

టీ త్రాగడ మయిపోయిన తర్వాత మా అత్తగారు స్థిమితంగా కూర్చుని "మేరియామినిఛ్చా" పేక ముక్కలతో అందరికి అదృష్ట ఫలాలను, గ్రహబలాలను చెప్పుతూంటే ఆలకించేవారు. నిద్రపోయే ముందు మా అత్తగారు మమ్మిద్దర్నీ ముద్దాడి, పవిత్రమైన శిలువను మాకు ముట్టించేవారు. తర్వాత మాగదిలోనికి మేము వెళ్ళిపోయేవాళ్ళం. సాధారణంగా అర్ధరాత్రిదాక కబుర్లు చెప్పుకుంటూ కులాసాగా గడిపే వాళ్ళం. అవే మా దిన చర్యలో అత్యంతానందంగా గడిచే మధుర ఘడి యలు. భావినిగూర్చి ఎమేమో ప్లానులు వేసేవాళ్ళం. అప్పుడప్పుడు వేదాంత చర్చలుకూడ సాగించడం కద్దు. ఏ మాటలు మాట్లాడినా, ఏ యే వాదోప వాదాలు సాగించినా, ఏ మాత్రం ధ్వని మా అత్తగారికి విన పడకుండా బహు నెమ్మదిగా మాట్లాడుకొనేవారం. ఎందుచేతనంటే రాత్రిళ్ళు ఎక్కువసేపు మేల్కొనకుండ పెందలకడనే నిద్రించవలసిన దని మా అత్తగారి కఠోరాజ్ఞ. ఒక్కొక్కప్పుడు అర్ధరాత్రివేళ విపరీ తంగా ఆకలి వేసేది. చప్పుడేమాత్రం చేయకుండా వంటింట్లోకి ప్రవే శించి మరుసటి రోజు ఉదయానికని ఫలహారంగా పొందు పరచిన రొట్టె లను, బిస్కట్లను తస్కరించ నా గదిలో చిన్న క్రొవ్వువత్తి వెలుతు

రులో ఆ ఫలహారములను సేవించేవాళ్ళం.

మా అత్తగారి ప్రజ్ఞ. ప్రతిభ. ధైర్యోత్సాహాలు సర్వోత్కృష్టంగా ప్రకాశించే ఆ పెద్ద భవంతిలో మే మిద్దరం పరాయివాళ్ళలాగ సంచరించే వాళ్ళం. ఆ భవనంలోనున్న చిత్తరువులను. అమూల్యమైన వస్తు సామ గ్రిని. అందులో నివసించే స్త్రీల నెవరిని చూచినా నాకు ఉత్సాహం కొల్ల లుగా ఉదయించడమే గాక, వాటిపైన, వారలపైన గౌరవాభిమానాలు వాటికవే పుట్టుకొనివచ్చేవి. ఆ విలువ గ్రహించి ఆ యింట్లో నివసించ డానికి మేము తగమని సదా మా కార్యకలాపాల్లో బహు జాగరూకులమై సంచరించేవాళ్ళం.

ఆదే పదే పదే అనుకోవడంవల్ల నిత్య దినచర్యలు సక్రమంగా పనిచేయక అశ్రద్ధచేస్తూ సోమరులుగా సంచరించే సేవకులనుగాని, యిత రులనుగాని, అనవసరంగా విమర్శించే పరిచారికులనుగాని వారెంత అసంతృప్తికరంగా ప్రవర్తించినప్పటికీ వారిని కేకలేయుట గాని. లేదా వారిపై ఒత్తిడి, యితర నిర్బంధాలు. ఏమీ తెచ్చేవారం కాదు. ఈ మా ప్రవర్తనే మమ్మిద్దరినీ మరింత దగ్గరకు తీసికొనివచ్చింది. నేనే కాదు, నా భర్తకూడ సేవకులెవరయినా తప్పు చేస్తూంటే బహిరంగంగా సణుక్కోవడం గాని లేదా వారిని తిట్టడంగాని, అంతదాక ఎందుకు అసలేవిధమైన అసంతృప్తిని పైకి వ్యక్త పరచేవారు కాదు, పైగా అలాంటి సంఘటనలు చూస్తోన్నపుడు కళ్ళు మూసుకొనేవారు. చెప్పులు కుట్టే "డిమిత్రీ సిడొరోవ్" విపరీతంగా పొగ త్రాగేవాడు. మధ్యాహ్నం భోజనా లవగానే మే మిద్దరం నా గదిలోనికి పోయి కాసేపు సరదాగా కబుర్లతో కాలక్షేపంచేసేవారం. సరిగా యీసమయం కనిపెట్టి ప్రతిరోజు అతడు విడువకుండా నా భర్త పఠనమందిరంలో ప్రవేశించి పొగాకు తస్కరించేవాడు. ఆ సమయంలో నా భర్తను చూచితీరాలి! కాలి బొటన వేళ్ళమిద ఆనుకొని తొంగి తొంగి ఆ గదిలోకి భయో ద్వే గోత్సాహాలను వ్యక్తపరచే చూడ్కులతో చూస్తూ తన చూపుడు వేలుతో నాకు ఆ

జరిగే కర్మకాండ నంతటిని చూపేవారు. మే మదంతా కనిపెట్టుతున్నా మనే సంగతి తెలియక తన పనిలో తాను మునిగిపోయేవాడు డిమిత్రి సిదోరోవ్. తన పని విజయవంతంగా ముగియగనే ఎవరూ చూడ లేదనే సంతోషంతో బయటకు వచ్చి "నువ్వంటే నాకెంతో ముద్దు" అంటూ నన్నొకసారి ప్రశంసించి పోయేవాడు. కాని అప్పుడప్పు డతడు తన పని తాను నెమ్మదిగా చేసేసి మిగతా విషయాలు తనకేమీ తెలియ నట్లు, యితర పనులలో ఏమీ జోక్యం కలుగచేసుకోని పవిత్రునివలె నటిస్తూంటేమాత్రం నాకు వళ్ళుమండేది. కాని ఆ దుర్వ్యసనం అతనిలో జీర్ణించుకుపోయిన జాడ్యమని చూచీ చూడనట్లు ఊరుకొని, చేసినతప్పు పైకి చెప్పడానికి ధైర్యంలేని చంటిపిల్లవాని మనస్తత్వ మతని దని యెంచి జాలిపడేదాన్ని.

మరి రెండు మాసా లీ మాదిరిగా గడచిపోయాయి. విపరీతమైన మంచుతో, చలితో, శీతకాలం ప్రవేశించింది. ఆయన నా చెంత నున్న ప్పటికీ నా కేమిటో ఒంటరి తనాన్ని అనుభవిస్తూన్నట్లు, జీవితమంతా పునరావృత్తి చెందుతూన్నట్లు, ఆయనలోగాని నాలోగాని నూతనత్వ మనేది మచ్చుకయినా లేకుండా పాత ప్రపంచంలోనికి మేము జరిగి పోతున్నట్లు కనపడసాగింది. వ్యాపారాది విషయాల్లో ఎక్కువకాలాన్ని వినియోగిస్తూ నాకు దూరంగా ఉండేవారాయన. మళ్ళీ పూర్వాభిప్రాయాలు — అంటే నేను కలుగచేసుకోకోడని, తెలుసుకో కూడని, ప్రత్యేక పను లాయన చేయ పూనుకొంటున్నారనే దురభిప్రాయాలు క్రమ క్రమంగా నా బుర్రలో ప్రవేశించసాగాయి. ఇదివరలో ఆయన్ని నే నెంత గాఢంగా ప్రేమించానో, ఆ అగాధ ప్రేమలో ఎంత ఆనందామృతాన్ని గ్రోలానో, అంతగా ప్రేమిస్తూ, అంత ఆనందాన్ని పొందుతూనే ఉన్నాను. కాని నా ప్రేమ అంతకంత కధికమై అభివృద్ధి చెందడానికి బదులు ఎదుగుబొదుగు లేకుండా గొర్రెతోకలాగ అలాగే నిలచి పోయింది. అంతే కాకుండా నాలో మరొక నూతన అసంతృప్తి నా

హృదయంలో తీవ్రతరం కాజొచ్చింది. ఆయన్ని ప్రేమించి ఆ ప్రేమ సాగరంలో యీదులాడి, ఆ స్వర్గానుభూతులను పొందిన తరువాత ప్రేమించి ఊరుకోవడంతో నాకు సంతృప్తి కలుగలేదు. కదలిక లేకుండా స్థాణువులాగ నిస్తబ్ధతతో నిలచిపోయే ప్రేమ కాదు నేకోరేది.

ఉత్సాహోద్రేకాలు, అపాయాలు, ఆ అపాయాల్లో నా ప్రియుని కోసం, నా పవిత్ర ప్రేమను సార్థకం చేసికొనడంకోసం యెంతయినా స్వార్థత్యాగం చేయడాని కనువైన సంఘటనలు నేను కాంక్షించాను. మామూలు శాంతియుత జీవనంలో పొర్లడానికి మనస్కరించ లేదు. అపుకోలేనంత అనంతమయిన శక్తి నా శరీరమందంతటా పొంగి పొర్లి ప్రవహిస్తోన్నట్లు నేను కనుగొన్నాను. ఆ నా ఆవేశమంతా అప్పుడప్పుడు ఒక్కసారి హఠాత్తుగా దిగజారిపోయేది. దానికి నాలో నేనెంతో సిగ్గు పడేదాన్ని. అదేమాత్రం ఆయనకు కనపర్చకూడదని ప్రయత్నించేదాన్ని. కాని నా ఆర్ద్ర హృదయతను, ఉత్సాహోద్రేకాలును ఆయన్ని కలవర పర్చాయి. నా మనో కవళికల నన్నింటినీ ఆయన సాకల్యంగా, నాకంటె ముందే తెలసుకొని, సరదాగా కొంతకాలంపాటు పీటర్సుబర్గుకి పోయి ఉండివద్దామాయని తన నిర్ణయాన్ని ఉద్దేశపూర్వకంగా వెల్లడించారు. మన అనందానికి ఆటంకం కలుగ చేయవద్దని, మన జీవిత సరళి మార్చవద్దని, ఆయన్ని నే నెంతో వేడాను. నిజంగా నేనెంతో సుఖంగా సంతోషంగా కాలం గడుపుతున్నాను. కాని ఈ సంతోషం, నాకు ఎన్ని దుర్భర కష్టాలనయినా యెదుర్కొనేందుకూ, నా సర్వస్వం ధారపోసి స్వార్థత్యాగం చేయడానికీ తగిన సంపూర్ణ శక్తిని ప్రసాదించి నప్పటికీ, ఆ శక్తిని బహిర్గతం చేయడానికి తగిన సమయాన్నీ, సావకాశాన్ని కలుగచేయ లేదని బాధ కల్గుతోంది. ఆయన్ని నేనెంత గాఢంగా ప్రేమించాను ? అంతే కాదు. ఆయనతో ప్రతి వస్తువలోను విలీనమై పోయాను ! మా పవిత్ర ప్రేమను ప్రతివారు గుర్తించి గౌరవించాలని

నా కోరిక. ఎన్ని అడ్డంకులు వచ్చినప్పటికీ ఆయనన్నే అంటిపెట్టుకొని ఉండేదాన్ని. నా మనస్సు, నా సర్వేంద్రియాలు, ఆ ఆలోచనలతోనే నిండిపోయాయి. నాలో దండిగానున్న యవ్వనోద్రేకానికి నిస్తబ్ధతతో కూడిన ప్రశాంత జీవితం సరిపడనూ లేదు, సంతృప్తిని చేకూర్చనూ లేదు. ఆయన నా మనశ్శాంతికి నా యిష్టం వచ్చినపుడు పట్టణానికి పోయి కొంతకాలం గడిపి వద్దామని ఎందుకనాలి? నాలో నిండియున్న నిరాశా నిస్పృహలు తగనివని, అవి నేను తెచ్చిపెట్టుకొన్నవి మాత్రమే నని, నేను చేసే ఆలోచనలు వట్టి పనికిమాలినవని, ప్రమాదకర మైన వని, నేను చేయాలని ఆరాటపడుతూన్న స్వార్థత్యాగనికి తగిన సమ యాన్ని ఏవో క్రొత్త సంఘటనలు వచ్చి సృష్టించవనీ, చేయవలసిన త్యాగం నా ముందే యున్నదనీ నేను పొందే విపరీతానుభూతులను అణచుకోవటమే నేను చేయవలసిన త్యాగమని ఆయన నాతో ఎందుకు చెప్పలేకపోయారు? ఈ అశాంతినుండి విముక్తి పొందాలంటే ఎక్కడి కయినాపోయి కొంతకాలం గడపి రావాలనే ఆలోచన నన్ను వేటాడ సాగింది. మళ్ళీ నేను ఆయన్ని గురించి అనవసరంగా దురభిప్రాయ పడుతున్నానని, నా ఆలోచన లన్నీ కేవలం స్వార్థపూరితములని సిగ్గు పడి అటువంటి ఆలోచనలపై బుద్ధి కేంద్రీకరించ బడుతోందనీ, చాల విచారించాను. కొంతకాల మీలాగే గడచిపోయింది. అంతకంతకు మంచు అధిక మవ సాగింది. మే మిద్దరం అలాగే ఉండిపోయాం. గాని బయటి మనుష్యులలో ఉత్సాహోద్రేకాలతో కూడిన కలవరం బయలుదేరుట నేను గ్రహించాను. వారు వారి సుఖ దుఃఖాలతో కాలం వెళ్ళబుచ్చుతున్నారే గాని మమ్మల్ని గురించి ఆలోచిస్తూన్నట్లు గాని, అసలు మా ఉనికినే గుర్తిస్తూన్నట్లుగాని తోచదు. ఈ భావం నన్ను మరింత బాధించింది. మా పూర్వ అలవాట్లు, కట్టుబాట్లు మమ్మం దరినీ యేకం చేశాయేగాని తాము మాత్రం మార్పు లేక శిలాప్రాయంగా మండిపోయాయి. కాలక్రమేణా మా మనస్సులు విరిగి, విచ్చలవిడిగా

విహరిస్తూన్నందువల్ల ఒకరియందు మరొకరికి యుండవలసిన గౌరవ ప్రేమాభిమానాలు సన్నగిలి నశించిపోతూన్నట్లు నాకు కనబడింది. ఉదయం మేమంతా ఉత్సాహంగానే ఉండేవాళ్ళం. మధ్యాహ్నం గౌర వాలతో జరిగిపోయేది. సాయంకాలం ప్రేమానురాగాలతో ముగిసేది. ఇదంతా సవ్యంగానే ఉందని నేను అనుకొన్నాను. "ఒకరికి మేలు చేస్తూ సక్రమమైన జీవితాన్ని సాగించాలి. కాని దానికి తగిన కాలం ముందుంది. దానికంటె ముఖ్యమైన విషయాలు మన ముందున్నాయి. వీటికోసం కాలం ఆగదు. ఇవి యిప్పుడు పరిష్కరింప బడడమో లేదా శాశ్వతంగా మన చేతినుండి చల్లగా జారిపోవడమో జరిగి తీరాలి" అని ఆయన అంటూండేవారు.

ప్రస్తుతం నాకున్నది కాదు నాకు కావలసినది. నిత్య సమరంతో కూడిన జీవితమునే కోరుతున్నాను. భావాలే భవిష్యత్తును నడపాలి గాని భవిష్యత్తు భావాలను నడిపేదిగా ఉండకూడదని నా వాంఛ. నేను ఆయన ఆదర్శ ప్రాంగణాన్ని చేరగల్గితే "ఒక్క అడుగులో నేను క్రింద పడి పోతాను — కొంచెం కదిలానా నేను మీ కిక దక్కను" అని అంటాను. అప్పుడాయన తెల్లబోయి భయభ్రాంతులతో నన్ను తన బలిష్ఠ దండ ద్వయంతో పడిపోకుండా, నా రక్తం గడ్డకట్టేదాక కౌగలించుకొని తన యిష్టమొచ్చిన మార్గానికి నడిపిస్తారు.

ఈ రకరకాల ఆలోచనలే నా ఆరోగ్యాన్ని పాడు చేశాయి. నరాల బలహీనతచే బాధపడవలసి వచ్చింది. రోజూకంటె ఆ రోజుదయం మరీ బలహీనంగా నున్నాను. ఎప్పటిలు ఆఫీసునుండి ఆయనప్పుడే తిరిగి వచ్చారు. ఆయన ముఖ కవళికలు వింతగా నున్నాయి. అది గ్రహించి ఏమి జరిగిందని అడిగాను. నా కసలు సంగతేమీ చెప్పకుండా "ఆఁ అదే మంత ముఖ్య విషయం కాదులే" అని ఊరుకొన్నారు. తర్వాత పోలీసు సబ్ యిన్‌స్పెక్టరు నా భర్త అన్యాయంగా రైతులదగ్గరనుండి శిస్తులు వసూలు చేస్తున్నారని, రైతుల ననేక విధాల భయపెట్టి పీడిస్తున్నారని

నేరం మోపి కేసు పెట్టినట్లు తెలుసుకొన్నాను. నా భర్త ఈ అన్యాయ నేరారోపణను సహించలేక పోయారు. పోలీసు ఉద్యోగులు దీనిని కేవలం వారి వ్యసనంగా పెట్టిన కేసుగా ఆయన తీసికో లేదు. మరింత కోపోద్రేకులై దానిని గురించి నాతో ప్రస్తావించడానికికూడ యిచ్చగించ లేదు. నేనింకా పసిపిల్లనని, అటువంటి పెద్దవిషయాలు గ్రహించలేనను కొని ఆయన నాతో యీ సంగతి చెప్పడాని కంగీకరించుటలేదని నేను సులభంగా గ్రహించాను. ఏమీ మారు మాట్లాడకుండా ముఖం ఆయన మంది త్రిప్పేశాను. మేరియా మినిభ్నాను ఫలహారానికి పిలవవలసినదని సేవకునికి చెప్పాను. త్వరత్వరగా ఫలహారం తినడం ముగించి. ఆమెను మేము ఉదయం కూర్చుండే గదిలోనికి తీసుకొనిపోయి, నాకేమీ ఆసక్తి లేని ఒక చిక్కు విషయాన్ని గురించిపెద్దగా ప్రస్తావన ప్రారంభించాను. మాటిమాటికి మా వంక చూస్తూ ఆయన గదిలో పచార్లు చేయసాగారు. ఇది నన్ను మరింత గట్టిగా మాట్లాడేటట్లు మరింత నవ్వేటట్లు చేసింది. మా మాటలకు నాకే అమితంగా నవ్వు వచ్చేది. ఇది చూచి ఆయన గబ గబ తన శయన మందిరంలోనికి పోయి వెను వెంటనే తలుపు బిడాయిం చారు. ఆయన అడుగుల చప్పుడెప్పుడయితే వినిపించడం ఆగిపోయిందో నా ఉత్సాహమంతా మొదలుకంటా కూలిపోయింది. మేరియా మినిభ్నా ఆశ్చర్యపోయి సంగతేమిటని ప్రశ్నించింది. సమాధాన మేమీ చెప్పకుం డానే సోఫాలో అట్టే కూలబడిపోయాను. ఏడుపు వచ్చే పర్యంతం అయింది. ఆయన మనస్సులో ఏముందో ? ఏదో ముఖ్యమైన విషయాన్ని గురించి ఆలోచిస్తూండాలి. ఒకవేళ ఆ విషయాన్ని నాకు చెప్పడానికి ప్రయత్నిస్తే, అది వట్టి పనికిమాలిన విషయమని హేళన చేసి త్రోసి పుచ్చుతానని అనుకొన్నారేమో ? లేదా నేనా విషయాన్ని అర్థం చేసికో లేననుకొని, దానిని నిగూఢంగా దాచి నన్ను ఉడికించాలని అభిప్రాయ పడుతున్నారేమో ? అలపు కలుగచేసే అల్పవిషయాలు చేస్తూన్నప్పుడు నేనలా అభిప్రాయపడుట సబబేనని తలపోయసాగాను. ఒక్క చోట

పేరుకొని గడ్డ కట్టుకొనిపోయే జీవితంకంటె నిత్యం సంతోష నిర్ఝరి లాగ ప్రవహించే జీవితాన్నే సాగించాలని నా ఊహ. కాని నా ప్రస్తుత జీవితమంతా నా వెనుకనే నిలచిపోయి నెమ్మదిగా కదలుతున్నట్లు తోచింది నాకు. నేను రోజురోజుకు, గంటగంటకు క్రొంగ్రొత్త అనుభవాలతో జీవితాన్ని ముందుకు నెట్టాలని చూస్తూంటే, ఆయన ఉన్నదాన్ని అలాగే సుస్థిరంగా స్థాణువులాగ పాతి యుంచాలని చూస్తున్నారు. అంతే కాదు నన్ను ఆయనకు దూరంగా నెట్టివేయాలని చూస్తున్నారు కూడ. నన్నెంత సులభంగా సంతృప్తిపర్చ చూస్తున్నారు! పీటర్ను బర్గుకి పోనక్కర్లేదు. నిరాడంబరంగా జీవితయాత్ర సాగిస్తూ యితరులపై ఒత్తిడి తేకుండా ఆయన భావాలను ఆయన కుదుట పరచుకొని నాలాగే యెందు కుండకూడదు? ఆయన మహా సరళంగా ఉన్నట్లు అందరిని 'సరళంగా' ఉండమని ఉపదేశిస్తారు — అంతే మరి.

నే నాయనవల్ల ఉద్రిక్తురాల నయ్యానని నా కన్నీరే స్పష్టపరుస్తోంది. ఆ నా ఉద్రేకాన్ని చూస్తే నాకే భయం వేసింది. తిన్నగా తలుపు త్రోసుకుని ఆయన పఠన మందిరంలో ప్రవేశించాను. ఆయనేదో వ్రాసుకొంటున్నారు. నా పాద ధ్వని వినగానే తలపైకెత్తి ఒకసారి నా వంక చూచి మరల తమ పనిలో నిమగ్నులయ్యారు. ఆయన వైఖరినంతా పరీక్షించి చూస్తే తనకేమీ సంబంధం లేనట్లు తమ పని తాము యధాతధంగా చేసుకొని పోవడానికి నిశ్చయించుకొన్నట్లు తోస్తుంది. ఆయన చూపు నాకు గంగవెర్రి పుట్టించింది. తిన్నగా ఆయనదగ్గరకు వెళ్ళడానికి బదులు ఆయన బల్ల వెనకాలకు పోయి ఏదో పుస్తకంతీసి చదువుతూన్నట్లు నటించాను. ఆయన వ్రాసుకోడం ఆపి నా వంక చూస్తూ "మాషా! ఏమిటీ ఈవాళ చాల కోపంగా ఉన్నట్లున్నావేం?" అని ప్రశ్నించారు. "తమరు మహా శాంతంగా ఉన్నట్లు నన్ను ప్రశ్నించడంకూడా యెందుకు?" అన్నాను క్రీగంటి చూపుతో తల పంకిస్తూ చిరునవ్వు నవ్వి ఊరుకొన్నారాయన. ఆ చిరునవ్వు గాలిలో తేలిపోయిందే గాని

నా నుంచి మరొక చిరునవ్వును సమాధానంగా పుచ్చుకోలేక పోయింది.

"ఈ రోజు ఏమి జరిగినదీ నాతో ఎందుకు చెప్పలేదండీ ?" అని అడిగాను.

"ఆఁ ఏమీ లేదు — ఎదో వెధవ గొడవలు" అని ఆరంభించి "పోనీ లే యిప్పుడు చెబుతాను విను. మనవాళ్ళిద్దరు పట్టణానికి వెళ్ళి నారట........."

కాని నేను అయన్ని సాగనివ్వక "నేను ప్రొద్దున్నే అడిగి నప్పుడు మీ రెందుకు చెప్ప లేదు ?" అని అడ్డు ప్రశ్న వేశాను.

"నేను కోపంగా ఉన్నాను. కోపంలో ఏమి వాగేస్తానోనని చెప్పలేదు."

"కానయితే నే నప్పుడే తెలసికోవా లనుకున్నాను."

"ఎందుకని ?"

"నాకు తెలుసు లెండి ! మీకే విషయంలోను సలహాలిచ్చి సహాయ పడలేని అసమర్ధురాలుగా మీరు నన్ను జమ కట్టారు కదూ ?"

"సహాయపడ లేని అసమర్ధురాలు !" అని నేనన్న ముక్కలనే ఆశ్చర్యంగా వల్లిస్తూ, కలం క్రింద పెట్టి నే నా మాదిరిగా ఎప్పుడూ అన లేదే ! కనీసం ఆలా అనుకోలేదు కూడ ! అందాక యెందుకు ? నీవు లేకుండా నేను జీవించ జాలనని నే నీ క్షణం వరకూ నమ్ముతూవచ్చాను. నేను చేసే ప్రతి చిన్న విషయంలో కూడ నీ వింతవరకు సహాయకారిగా నుండడమే కాకుండా, నాకన్నీ నీవే అత్యంత సంతృప్తికరంగా చేస్తూ వస్తున్నావు. నీలాంటి విశాల దృక్పధం కలవాళ్ళు చాల అరుదుగా ఉంటారు" అని నవ్వుతూ మరల అందుకొని "నా జీవితమంతా నీపై ఆధారపడి ఉంది. నీవు ఉండబట్టే నా కన్ని విషయాలలోను సంతృప్తి అనేది కనిపిస్తోంది. అందుకనే సర్వదా నీవు నా సమక్షమలదే ఉండాలని వాంఛిస్తున్నా..................."

"ఆపండి! ఆపండి!! నే నేమీ చంటిపిల్లను కాదు, మీ పొగడ్త లకు ఉబ్బి తబ్బిబ్బు కావడానికి!" అని అంటూండగనే నా కంఠం రుద్ధ మయింది. ఆ వికార స్వరం విని ఆయన ఆశ్చర్యపోయి నా వంక తేరి పారి చూచారు. మరల నే నందుకొని "మన్ను తిన్న పాములాగ మంద కొడిగా పడి ఉండడం నాకు చాత కాదు. అదంతా మీ దృక్పథం. మీలో అదే ఎక్కువగా కనిపిస్తోంది" అని పూర్తి చేశాను.

"బాగుంది వరుస" అని మొదలు పెట్టి నే నెక్కడ కోపంలో ఏమేమి వాగుతానో నని నా వాగ్ధోరణి కడ్డు తగిలి "ఇకనుంచి నేను నిజం చెప్పేటప్పుడుకూడ నీ అభిప్రాయం తెలుసుకొని మాట్లాడుట మంచిది" అని ఒక నిట్టూర్పు విడచారు.

"అవన్నీ వినడానికి నా కిప్పుడు ఓపిక లేదు" అన్నాను ముక్త సరిగా. నిజానికి ఆయన చెప్పే విషయాలు వినాలనే ఉంది. కాని ఆయన్ని రెచ్చగొట్టడం నాకు సరదాగా తోచింది. "జీవితంతో చెలగాట మాడుట నాకు సుతరాం యిష్టం లేదు. జీవించాలని మీ రెలా కోరుతు న్నారో నేనూ అంతే!" అన్నాను విసుగ్గా.

నే నన్న ప్రతి మాటతోను ఆయన ముఖ వర్చస్సు పూర్తిగా మారి, ఒ విధమైన బాధని, నే ననే ప్రతి ముక్కను యింకా వినాలనే కుతూహలతను, ఏకాగ్రతను ప్రతిబింబింప చేస్తోంది. "నేనుకూడ మీ జీవితంలోని సుఖ దుఃఖాలలో భాగస్వామినిగా ఉండాలనే నే వింత కాలంనుండి కోరుతూ వచ్చాను........" అని తిరిగి నా ఉపన్యాసం ప్రారంభించి ఆయనవంక ఒకసారి చూశాను. ఆయన నా మాటలకు కృంగిపోయి ఏమీ మాట్లాడలేక నిశ్శబ్దంగా ఉండిపోయారు. ఆయన ముఖ వైఖరి చూచిన పిదప నేనిక మారు మాట్లాడలేక ఆగిపోయాను.

"అయితే నేను ఏ విషయంలో నీకు సమానావకాశ మివ్వలేదు?" అని ప్రశ్నిస్తూ "ఆ వెధవ పోలీసు సబ్ యిన్‌స్పెక్టరుతోను, చెడత్రాగి, వళ్ళు మత్తెక్కిన మైకంతో పరవళ్ళు త్రొక్కుతూ పిచ్చి ప్రేలాపనలు

పేలే కూలివాళ్ళ విషయాలలోను నేను కలుగ చేసికొంటున్నానని. ఈ విషయాలలో పాల్గొనడానికి నీకు తగిన స్థాన మివ్వడం లేదనేనా నీ బెంగ?" అని అడిగారు.

"అదొక్కటే కాదు" అని తిరిగి సమాధాన మిచ్చాను.

"అయితే యేమిటో నాకు విపులంగా చెప్పు మాషా! నీ కొక నమస్కారం పెడతాను. నీకు వచ్చే ఉద్రేకమంతా ఉపద్రవమైనదని నీతో ఉన్న దీర్ఘ సాంగత్యంలో నేను తెలుసుకొన్నాను. నిన్ను గాఢంగా ప్రేమించడం తప్పితే నాకీ జీవితంలో మరొక ఆశయం లేదు. కాబట్టి నా జీవితాన్ని దుర్భరం చేయవద్దని అనేక విధాల నిన్ను వేడుకొంటున్నాను" అన్నారాయన దీనంగా. ఆయనవంకయినా చూడకుండా "మీ రెప్పుడూ సరియైన దారిలోనే ఉంటారని నాకు తెలుసు లెండి" అన్నాను.

నాలో బయలుదేరిన ఉపద్రవానికి నాలో నేను పశ్చాత్తాప పడుతూంటే. ఆయన ప్రశాంతంగా కూర్చుని ఉండడం నేను సహించ లేక పోయాను.

"మాషా! అసలు సంగతేమిటి? ఇప్పుడు మనలో ఎవరు సరియైన మార్గంలో నడుస్తున్నారు. ఎవరు లేదు. అని కాదు ప్రశ్న. నేను నీకేవిధమైన కష్టం కలుగ చేశాను? కాసేపు ఆలోచించి మరీ సమాధానం చెప్పు. ఏమీ దాపరికం లేకుండా నీ మనస్సులో నున్నదంతా నా ముందు పెట్టు. నీవు సరియైన దృక్పథంలోనే నడుస్తున్నావని నాకు పూర్తిగా తెలుసు. మరి నే నెక్కడ తప్పటడుగులు వేశానో తెలుసుకోనీయి" అని సావధాన చిత్తంతో ప్రశ్నించారు.

అయితే నేను లోలోపల పొందే అనుభూతి నంతా మాటల్లో యేలాగ వ్యక్తపరచాలి? నా భావాలన్నింటిని ఆయన యిట్టే గ్రహించే వారు. తప్పుచేసిన చిన్న పిల్లలాగ ఆయనముందు నిలబడిపోయాను. నా పరిస్థితంతా నాకే చాల ఆందోళనగా ఉంది. "మీమీద నేరాలేమీ లేవు. పాత జీవితంతో నాకు విసుగెత్తిపోయింది, ఇక ముందయినా నన్ను

విసిగించవద్దని మిమ్మల్ని కోరాను. మీ రెప్పుడు సరియైన త్రోవలోనే ఉంటారు. కాబట్టి నాకీ విషయంలో సహాయపడలేనని అన్నారు. అంతే! సరిపోయింది" అని ఆయన వంక చూస్తూనే మాట్లాడాను. దీనితో ఆయన ప్రశాంతతంతా గాలికి దూది పింజలన్నీ ఎగిరిపోయినట్లు యెగిరి పోయింది. తీవ్రమైన బాధ, భయం, ఆయన ముఖంలో ద్యోతక మవు తున్నాయి. ఆయన ప్రశాంతతను భగ్నంచేయడమే నేను కోరింది కాబట్టి నా వాంఛ సఫలమయింది.

గద్గద స్వరంతో "మాషా!" అని మొదలు పెట్టి "ఇదేమంత అల్పవిషయం కాదు. మన జీవితంలో సుఖమంతా కొయ్యబారి పోయింది. మధ్యమధ్య అడ్డు తగలకుండా నేను చెప్పేదంతా శాంతంగా సావధానంగా ఓపిగ్గా విను. నన్ను దుఃఖపెట్టాలని నీవెందుకు వాంఛిస్తు న్నావు?"

కాని నే నడ్డు తగలడం మాన లేదు.

"ఆఁ నా కిదంతా తెలుసును లెండి! చివరికి మీదే సబబుగా మున్నదని తెల్పడానికేగా యీ అవస్థంతా? ఎందుకొచ్చిన పనికిమాలిన మాటలివి? నా కిదివర కెప్పుడో తెలుసును లెండి మీ రెప్పుడూ సరి యైన మార్గంలోనే నడుస్తారని!" అని ఎత్తిపొడుపుగా సన్నగా అంటించాను.

"నీ వేమి చేస్తున్నావో నువ్వొకసారి తెలుసుకొంటే యెంత బాగుండును!" అన్నారాయన అశ్రురుద్ధమైన కంఠంతో.

అపుకోలేనంత దుఃఖమొక్కసారి పొర్లుకొచ్చింది. పైకి ఏడ్చాను. నా బాధంతా నివారణయి పోయింది. నేను తేలికపడ్డాను. ఆయన నా ప్రక్కనే విశ్శబ్దంగా కూర్చున్నారు. ఆయన్నంతగా అనవసరంగా క్షోభ పెట్టినందులకు చాల విచారించాను. నేను తెచ్చిన ఉపద్రవానికి సిగ్గుతో క్రుంగిపోయాను. ఆయనవంక చూడలేకపోయాను. ఆయన చూపులు క్రోధాన్ని, క్రూరతను, కలవరాన్ని తప్పితే మరొకదానిని ప్రస్ఫుటపరచ

వని ఆయనవంక చూడడమే మానివేశాను. ఆఖరకు సాహసించి తల పైకెత్తి ఆయన నేత్రాలవంక చూచాను. ఆయన నా వంకే దృష్టి నిలిపి దీనంగా మన్నించమని వేడుకొనే చూపులతో చూస్తూన్నట్లు కన బడింది. ఆయన్ని దగ్గరగా తీసుకొని, ఆయన చేతులను నా చేతుల లోనికి తీసుకొని "నన్ను క్షమించరూ? ఇందాకటినుంచి నేనేమి మాట్లా డుతున్నానో నాకు తెలియదు" అని ప్రార్థించాను. "నా కది తెలుసు. అయినా నీ తప్పేముంది? నీవు నిజమే చెప్పావు" అన్నా రాయన.

"అంటే మీ అభిప్రాయం?" అని ప్రశ్నించాను.

"మనం పీటర్సుబర్గు పోదాం. ఇక్క డేమంత ముఖ్యమైన పనులు లేవులే" అన్నారు. "మీ యిష్ట మొచ్చినట్లే చేయండి" అన్నాను నేను. నన్నాయన వళ్ళోకి తీసుకొని ముద్దాడుతూ "నేను నిందింప బడ డానికి అన్నివిధాలా అర్హుణ్ణి. నన్ను క్షమించవూ?" అన్నారు దీనంగా.

ఆ సాయంకాలం చాల సేపు ఆడుకొన్నాం. ఆయన తన గదిలో పచార్లు ప్రారంభించారు. ఆయనకు తనలో తాను మాట్లాడుకోవడం అల వాటు. అలాంటప్పుడు ఏమిటండీ మీలో మీరే ఏమిటో మాట్లాడుకొంటు న్నారు? నాకు చెప్పరా? అని అడిగితే కాసేపు ఆలోచించి ఆయ నేద యితే ఆలోచిస్తున్నారో దాపరికం లేకుండా సరిగ్గా చెప్పేవారు. చివరన సామాన్యంగా ఏదో గీతమో నీతిసూక్తో, అర్థశూన్యమైన పట్టి చెత్తనో దేనినోదానిని చెప్పేవారు. దానిని బట్టి ఆయన మనస్తత్వాన్ని గ్రహించే దాన్ని. ఈమాటు మళ్ళీ నా మామూలు ప్రశ్న వేయగనే కాసేపాగి "లెర్ మాంటొవ్" రచించిన పద్యంలోని రెండు వాక్యాలు పల్లించి వినిపించారు.

"మనో వైకల్యంలోనున్న మానవుడు తుపానుకోసమై ప్రార్థిస్తూం టాడు. తుపానులే తన కనంతమైన శాంతిని చేకూరుస్తాయనే అనంత మైన ఆశతో కలలుగంటూ"

"ఈయన నిజంగా మానవాతీతుడు సుమా! ఆయనకు తెలియని

దేదీ లేదు. అందుకనే ఆయన్ని అందరూ ప్రేమించి గౌరవిస్తారు" అను కొన్నాను నాలో నేను.

నేను లేచి ఆయన చేయి పట్టుకొని ఆయనతోపాటు ఆ గదిలో యిటునటు పచార్లు చేయసాగాను. "బాగుంది!" అని చిరునవ్వుతో నా వంక చూశారు. "మంచిదేగా!" అన్నాను నేను. ఇంతలో ఒక ఆక స్మిక ఆనందోద్రేకం మమ్మల్నిద్దర్నీ ఆవహించింది. మాయిద్దరి చూపులు కలసి నవ్వుకొన్నాయి. పెద్దపెద్ద అంగలువేస్తూ నడక సాంగిచాం. ఈలా తొందరగా నడచి పోతుంటే వంటమనిషి, మా అత్తగారు తెల్లబోయి మా వంక తదేకదృష్టితో చూడసాగారు. ఏమి ఉపద్రవం విరుచుకొని పడిందోనని, మా వెనకాలే మా అత్తగారు పరుగెత్తుకొని వచ్చారు. మేము తిన్నగా భోజనశాల దగ్గరకు వచ్చి ఆగి ఒకరి నొకరం చూచు కొని కడుపుబ్బేటట్లు నవ్వాం.

మరి పదిహేను రోజుల తర్వాత క్రిష్టమస్ పండుగకు ముందే పీటర్సుబర్గు చేరాం.

# అధ్యాయం 7.

మా పీటర్సుబర్గు ప్రయాణం. మాస్కోలో గడిపిన వారంరోజులు నా తరపు బంధువులను, నా భర్తవైపు బంధువులను చూచిరావడం క్రొత్తబసలో ప్రవేశించడం, నూతన పట్టణాలను, నూతన వ్యక్తులను దర్శించడం — యివన్నీ నా కళ్ళ ముందొక కలలాగ గడచిపోయాయి. ప్రేమమూర్తి అయిన ఆయన ఉనికిలో ఆ క్రొత్త ప్రదేశాలు, వింతలు చూస్తోంటే, ఎంతో ఉత్సాహంగాను, ఉల్లాసంగాను ఉండేది. అంతే కాదు ప్రతి వస్తువు జీవంతో ఉట్టిపడుతూ, తేజోవంతంగా ప్రకాశిస్తోన్నట్లు కనబడేది. ఇవన్నీ చూస్తోంటే యింతవరకు మేం పల్లెటి ప్రాంతాల్లో గడపిన జీవితం వ్యర్థంగా నిస్సారంగా గడచిపోయినట్లు తోచింది.

నగర వాసులంతా నిండు గర్వంతో వింత ప్రవర్తనులై ఉంటారని నేను అనుకొనేదాన్ని. కాని నేనెక్కడికి వెళ్ళినా నా బంధువుల చేతనేగాక, నూతన వ్యక్తులచేత కూడ ఎంతో ఉత్సాహంగా, ఆదరాభిమానాలతో ఆహ్వానింప బడుట చూచి, నా కమితాశ్చర్యం కలిగింది. వారి ఊహలలో నేనొక విలువైన వ్యక్తిగాను, వారి సంతోషం సంపూర్తిగావడానికి వారు మనసారా, నా రాకను ఆహ్వానిస్తూన్నట్లు నాకు కనబడింది. ఉత్తమ సమాజంలోని అనేక ప్రముఖ వ్యక్తులతో నా భర్తకు గల పరిచయం, స్నేహం చూచి తెల్లబోయాను. ఇదివరలో యెన్నడూ ఈ స్నేహితులను గూర్చి చెప్పకపోయినప్పటికీ నాకు సుస్వభావులుగా కనబడు కొందరిప్రవర్తనలు తనకు నచ్చవని చెప్పుతూన్నప్పుడు మాత్రం నాకు వినడానికి కష్టంగాను, అనంగీకార యుతంగాను ఉండేది. వారిపై ఆయన కెందు కంత శీతకన్నుగా నుండేదో. పరిచిత వ్యక్తుల నెందరినో మాట్లాడకుండా తప్పించుకొని పోవడాని కాయ నెందుకు ప్రయత్నిస్తున్నారో చూస్తే నా భర్తలో కొంచెం గర్వం పొడచూపు

తూన్నట్లు కనబడింది. ఎందరు సజ్జనులతో సాంగత్యముంచే అంత మంచిదనుట నిజమే. గాని, యిక్కడి వారందరూ సరళ స్వభావులుగనే నాకు కనబడ్డారు.

పైగా తమ ప్రవర్తనను తామే సమర్ధించుకొంటూ "చూశావూ? ఈ లాగే త్రోసుక పోతుండాలి! లేకపోతే వీళ్ళందరితో వేగడం చాల కష్టం" అన్నారాయన. మేము మా గ్రామాన్ని వదలేముందు పట్టణంలో జాగ్రత్తగా ఖర్చు చేయాలని హెచ్చరిస్తూ ఆయన "మనం యిక్కడ జమీందారులుగా చలామణీ అవుతున్నాం గాని పట్టణాలలోని ధనవంతుల ముందు మన ఆదాయం, సంపద లెక్కల్లోకి రావు. మనం జాగ్రత్తగా వెనకా ముందు ఆలోచించుకొని ఖర్చులు చేస్తూండాలి. ఈస్టరు పండుగల ముందే మనం యిల్లు చేరుకోవాలి. క్లబ్బులకు, సమాజాలకు ఎక్కువగా వెళ్ళవద్దు. లేనిచో చాల చిక్కులకు లోనుగావలసి వస్తుంది. అటువంటి కష్టాలేమీ మన సామీప్యంలోనికి రాకూడదని నీ తరపునకూడ నేనే భగవంతుని ప్రార్ధిస్తున్నాను" అన్నారు.

"మనకి సమాజంలోనికి పోవలసిన పనేమిటి?" అని ప్రశ్నించాను నేను.

"రకరకాల థియేటర్లను, అక్కడక్కడున్న మన బంధువులను చూద్దాం, సంగీత మందిరాలకు పోయి శ్రవణానందమగు మృదు మధురమైన గానకళా విరతిని వినిపించి వీనులకు విందుచేద్దాం. ఈస్టరు పండుగకు కొంచెం ముందుగానే యిల్లుచేరేందుకు సంసిద్ధపడాలి" అని ఆయన కార్యక్రమాన్ని చెప్పేరు.

పీటర్సుబర్గురాగానే ఈ ప్లానులన్నీ తల్లక్రిందు లయాయి. అనేక వింత, వింత సరదాలతో కూడిన, అమితోత్సాహ పూరితమైన, నవ ప్రపంచంలో నేను తిరుగుతున్నాను. ఎన్నో మహోన్నతమైన భావపరంపరలు, గొప్ప గొప్ప విజ్ఞాన విషయాలను తెలిసికోవాలనే ఆసక్తి,

ఉత్సాహం నాలో జనిస్తున్నాయి. నా పాత జీవితం, ఆదివరలో నేను చేసిన ఆలోచనలు, ఒక్కసారి తెలియకుండగనే ఆకస్మాత్తుగా స్ఫురణ కొచ్చి మెరపులాగ మెరసి మాయమయ్యాయి. నేను తిరిగి ఒక్కసారిగా పర్యావలోకనం చేయసాగాను. 'అదంతా భావికి నాంది. జీవితంతో చెలగాటం. ఇదిగో యిక్కడ లభిస్తోంది వాస్తవికమైన వస్తువు! భావికూడ కండ్లకు కట్టినట్లు విస్పష్టంగా గోచరిస్తోంది!' అవి నా ఊహలు. ఇదివరలో నిండియుండిన నిస్తబ్ధత, నిరుత్సాహపు నీడలు, అసంతృప్తి లక్షణాలు, మన స్థిమితం లేక కల్గిన తీరని ఆరాటం, అన్నీ సంపూర్తిగా మాయమై పోయాయి, యేదో మహాద్భుత శక్తి వాటిని పెకలించి వేసినట్లు! నాకు భర్తపై ఉండే ప్రేమ నెమ్మదిగా వృద్ధిపొంద సాగింది. నాపై ఆయనకు గల మక్కువ తగ్గుతోందా లేదా అనే ఆలోచన ఆగిపోయింది. ఆయన ప్రేమను సంశయించడానికి వీలులేదనుకోండి! ఈ నా ప్రతి ఆలోచనా, ప్రతిఅనుభూతినీ ఆయన సునాయాసంగా గ్రహించి నాతో ప్రతి విషయంలోనూ, ఏకీభవిస్తూ, నా ప్రతి వాంఛ పట్ల సానుకూలత చూపసాగారు. ఆ శాంత స్వభావమే కొంతకాలం నిలకడగా ఉండి యున్నట్లయితే నన్నెప్పుడూ అటువంటి ఆలోచనలు వేటాడి బాధించి యుండేవి కావు. ఆయన నన్నెంతో ప్రేమించడమే గాక నన్ను భార్యగా పొందినందుల కెంతో గర్విస్తూన్నట్లు నేను గుర్తించాను.

మే మెక్కడికన్నా వెళ్ళినప్పుడు, లేక క్రొత్త పరిచయాలు చేసుకొనేటప్పుడు, లేదా ఎవరినన్నా విందుకు పిలచి అతిథి సత్కారాలు చేసినప్పుడు నాకు లోపల చాల భయంగా వుండేది. నన్ను నేనే చాల తక్కువ అంచనా వేసుకొని అట్టి విషయాల్లో నేనే యింటి పెద్దగా వ్యవహరించడానికి తగనని భావించుకొని చాల చిన్నబుచ్చుకొనే దాన్ని. కాని తర్వాత నా భర్త "భేష్! చాల విజయవంతంగా 'నెరవేర్చావు. నీ వేమీ భయపడ నక్కరలేదు. అబ్బో, నీలో యిన్ని శక్తిసామర్థ్యాలు

కుప్పలు కుప్పలుగా నున్నాయని నాకు తెలియదే!" అని పొగడేవారు. ఆ పొగడ్తలు నా కనంతమైన ఆనందాన్ని చేకూర్చేవి. మే మిక్కడకు రాగానే తల్లికి తామొక లేఖ వ్రాస్తూ నన్నుగూడ కొంచెం వ్రాయమన్నారేగాని తాము వ్రాసినదిమాత్రం నన్ను చూడనివ్వలేదు. నేను బలవంతాన దానినితీసుకొని చదవడం మొదలుపెట్టాను. "అమ్మా! మాషాని గురించి నీకుగాని నాకుగాని సరిగా తెలియదు. ఆమెకింత స్వాభావికమైన స్నిగ్ధమైన సౌందర్య సౌకుమార్యాలు, స్నేహశీలత, మనోధైర్యం ఎక్కడినుంచి వచ్చాయో తెలియదు. దయా పూరితమైన ప్రసన్నతను ప్రసరింపచేస్తూ, అతిధుల నందర్నీ ఎంతో గౌరవ మర్యాదలతో సత్కరిస్తూంది. ప్రతి ఒక్కరూ ఆమె ఆదరణకు సంతుష్టి పడడమే కాకుండా అమితంగా సంతోష పడుతున్నారంటే నమ్ము! ఆమెను నే నెక్కువగా మెచ్చుకొని పొగడలేనేమో గాని యిదివరలోదానికంటె వీలయితే అనేక రెట్లధికంగా ప్రేమించ గలను. అంతే!" అని వ్రాశారు. దానిని పూర్తిగా చదివి 'ఆ యిప్పుడు తెలుసుకొన్నా నేనంటే ఏమిటో!" అనుకొన్నాను నాలో నేను. నేను పొందిన ఆనందానుభూతిలో చెందిన గర్వాతిశయంలో నేనాయన్ని యిదివర కెన్నడూ ప్రేమించనంత గాఢంగా ప్రేమిస్తున్నాననే భావం నాలో ఉదయించింది. మా క్రొత్త పరిచితులలో చక్కగా మొక్కువ నైపుణ్యతతో, ఎంతో విజయవంతంగా మెలగ గలగడం చూస్తే నాకే అమితాశ్చర్యంగా నుండేది.

నా భర్తకు నేనంటే ప్రత్యేకాప్యాయత యని, మా అత్తగారు స్తమానమూ నన్నుగూర్చి పలవరిస్తూంటారని నలుమూలలా నల్గురూ చెప్పుకోడం నేను తరచు వింటూ వచ్చాను.

పీటర్సుబర్గులో నాతో ఏవిషయంలోనయినా పోటీచేయగలిగిన మరొకస్త్రీ యెవరూలేరని ప్రశంసిస్తూ ఒకరన్నారు. దీనినే ధృవపరుస్తూ మరొకామె కొంచెం అలంకరణలో శ్రద్ధవహిస్తే సమాజానికి కొక క్రొత్త సొగసు, నాగరికతను నేను తీసుకొని రాగలనని నన్నుగురించి చెప్పు

తోంది. నాభర్త బంధువుల్లో ముఖ్యంగా, సమాజంలో సొగసుగా తిరిగే వడివయస్సులో నున్నరాకుమార్తె అంటే "దీనా" కు నాపై నన్ను చూచి నప్పటినుండి అనంతమైన అనురాగం పుట్టుకవచ్చింది. ఆమె నన్ను పొగడ్తలతో ఆకాశాని కెత్తి నాతల తిరిగిపోయేటట్లు చేసింది. నన్ను నృత్యానికి రమ్మని తొలితూరి ఆప్యాయతతో ఆహ్వానించింది. నేనాసంగతి నా భర్తకు తెలియచేయగనే ఆయన నాముఖంవైపు తిరిగి చిరునవ్వు తొణికిసలాడుతున్న వదనంతో "ఏం ? నీకు వెళ్ళాలని ఉందా ?" అని ప్రశ్నించారు. నేను బిడియపడుతూ "అవును" అని తల వంకించాను. ఈ అభినయమంతా పరికించి "నీవు అభిలషిస్తూన్న యే విషయాన్ని గూర్చయినా నీ యభీష్టాన్ని తెలియపరచేముందు ఎందుకూ అలా ఏదో పెద్ద మహాపరాధం చేసిన నేరస్థునివలె నటిస్తావు ?" అని సౌజన్య పూరిత మందహాసంతో అడిగారు.

"మరి మీ రిదివరలో సమాజాలకు వెళ్ళడం మంచిదికాదని చెప్పారు. మళ్ళీ యిప్పుడు మీరు చెప్పినదానిని మీరే మ్రింగివేస్తున్నారన్నమాట !" అని లజ్జాద్యోతకమైన స్నిగ్ధ దృష్టుల నాయనపై ప్రసరింపచేస్తూ, నవ్వుతూ అనేసరికి "నీకంత వెళ్ళాలని కోరికగావుంటే వెళ్ళి వద్దాం పద" అన్నారాయన తిరిగి.

"అంతకంటె మరో మంచి విలాస క్రీడ లేదు గదా ?" అని నేనంటే "అయితే నీకు వెళ్ళాలని గట్టిగా ఉందన్నమాట ! తప్పక వెళ్ళాల్సిందేనా ?" అని మరల ప్రశ్నించారు. నే నేమీ మాట్లాడ లేదు.

"అసలు సమాజాలలోకి వెళ్ళుతూన్నందువల్ల అంత కీడేమీ లేదు గాని —" అని కొంచెమాగి మరల అందుకొంటూ "లోపభూయిష్టమైన సాంఘి కాచారాలున్నాయే అవి బహు అసహ్యకరమైనవి, అధమాధమమైనవీను. ఈ కఠోర సత్యాన్ని మనం అంగీకరించాలి. తప్పక అంగీకరిస్తాం కూడ" అన్నారు. "దాపరికం లేకుండా చెప్పాలంటే" అని

నేను ప్రారంభించి "నాకు జీవితంలో దేనిపైన లేనంత మమకారం ఈ నృత్యం పైపు పుట్టుకవస్తోంద"ని పూర్తిచేశాను.

సరే ఏలాగయితేనేం మేము ఆ రోజు నృత్యానికి వెళ్ళాం. నేనను కొన్నదానికంటె అనేకరెట్లు ఆనందాన్ని అనుభవించాను. నా కోసమే ఆ నృత్య మందిరం ప్రజ్వలిత దీపాలతో శోభాయమానంగా అమర్చబడినట్లు నేను మధ్యన నిలచుంటె ప్రతీదీ నా చుట్టూ తిరుగుతూన్నట్టూ, ఆ విశాల విస్తృత వినోద మందిరంలో ప్రత్యేకంగా నాకొఱకే వివిధరకాల వాయిద్యాల నేర్పరచినట్లూ, గుంపులు గుంపులుగా చేరిన జన సముదాయమంతా నన్ను అభినందించి ప్రశంసించడానికే క్రిక్కిరిసినట్లు తోచింది. దాసీ మనిషి, క్రాపు దువ్వే మంగలి, ఒకరేమిటి? అందరూ, ఆఖరకు హాలులో అసంఖ్యాకులుగానున్న ముసలివారుకూడ నా వలపులో చిక్కుకొని యున్నట్లు కనబడ్డారు. తర్వాత మా బంధువుద్వారా నేను విన్న విషయ మేమంటే, నేను తదితర పల్లెప్రాంతీయపు పడచుల వలె గాక అసాధారణ చిద్విలాసముతో, తీయని సొగసుతో, సహజ సౌందర్యంతో, అత్యంత సరళత్వంతో యింకా అనేకమైన అందచందాలతో విరాజిల్లుతున్నానని, ఆనాడు హాజరయిన ప్రతి ఒక్కరూ అభిప్రాయపడ్డారట. నే నానాడు పొందిన పొగడ్తలను చెప్ప నలవి కాదు. ఈ దిగ్విజయంతో నా కమిత ధైర్యం వచ్చి నా భర్తతో అలాంటి నృత్యాల కింకా రెండు మూడింటికి 'అంటే నాకు విసుగు పుట్టేంతవరకు' అని భాష్యం చెప్పుతూ, వెళ్ళాలని — నే చెప్పేదాని అర్థం ఏమిటో నాకే తెలియకుండా అనేశాను. ఆయన వెంటనే అంగీకరించారు.

నృత్యాల కాయన సంతోషంతో, సంతుష్ట చిత్తంతో నాతోకూడ వచ్చేవారు. సంఘంలో నేను ధైర్యంగా విజయవంతంగా మెలగ గలగడంచూచి ఎంతో ఆనందించేవారు. వీటన్నిటిని చూస్తే ఆయన సమాజాన్ని గూర్చిచేసిన ప్రబోధన లన్నింటిని మరచిపోయినట్లే కనపడ్డారు నాకు. కాని కొంత కాల మయ్యేసరికి ఈ మాదిరి జీవిత విధానంతో

ఆయన విసిగి వేసారినట్లు బహిర్గతమైంది. నాకు ఆ "విసుగుదల" అంటే ఏమిటో, అది ఏలాగుంటుందో, అసలు దానిని గురించి ఆలోచించడానికే తీరుబడి కనబడ లేదు. అప్పు డప్పు డాయన కోప దృక్కులతో ప్రశ్నార్థకంగా నాకేసి గ్రుచ్చిగ్రుచ్చి తీక్ష్ణంగా చూడడం గుర్తించానే గాని వాటి భావం నాకేమీ అర్థం కాలేదు. నాపై నా క్రొత్త పరిచితు లందరిలో అకస్మాత్తుగా ఉద్భవించి పొంగి పొర్లుతూన్న ఆప్యాయతానురాగాలను చూచి కండ్లు మూతలు పడిపోయాయి. విలాసకరమైన, విచిత్రమైన నాగరికతా వాతావరణంలో పడి కొట్టుకొనిపోతూ, దారీ తెన్నూ తెలి యక తికమకలు పడసాగాను. అట్టి వాతావరణంలో తిరుగుటకు నాకెంతో సంతృప్తిగాను హాయిగాను ఉండేది. అంటే ఆయనతో సమానురాలుగా కాదు సుమండీ ! అధికురాలుగా మాత్రమే !! అయినా ఆయన్ని పూర్వం కన్న ఎక్కువ స్వతంత్రతతో ప్రేమించాలని ఉండేది కూడ. కాని దీని కాయ నెందుకు అటంక పరుస్తున్నారో, సమాజంలో మసలడ మాయన కెందు కయిష్టంగా వుందో నాకేమీ బోధపడ లేదు. నేను నృత్య మంది రంలో కాలు పెట్టడం తరువాయి అందరి చూపులు నా వైపు తిరుగు తూంటే, నాకొక నూతన ప్రౌఢత్వం చేకూరినట్లు ఎంతో ఆత్మ సంతు ష్టిగా నుంటూంటే, ఆయ నెందులకో ముఖం చిట్లించుకొని, నన్ను అంతమందిలో తన వస్తువుగా చెప్పుకొనడానికి సిగ్గుపడి పారిపోతూ న్నట్లు అభినయిస్తూ నన్ను తప్పించుకొని తొందరగావెళ్ళి మగమందలో కలసి పోయేవారు.

నల్లకోట్ల గుంపులో ఆ తప్పించుకొని పారిపోయిన మనిషిని గుర్తు పట్టినప్పుడు, ఆయనా గదిచివర దుఃఖాక్రాంతులై నిలబడియున్న ప్పుడు 'మనం యింటికి చేరేవరకు కాస్త ఓపిక పట్టండి ! అప్పుడు మీ కర్థ మవుతుంది. మరి నే నెవరికోస మింత తాపత్రయపడి అందంగా ఆకర్షణీయంగా కనబడడానికి ప్రయత్నిస్తున్నానో ! ఈ వాతావరణంలో అసలు నే నే వస్తువును మనసార ప్రేమిస్తున్నానో ! ' అనుకొనే దాన్ని.

నే నిలా సంఘంలో తిరగడం వాస్తవంగా నన్నెందుకు సంతృప్తి పర చిందంటే ఆయన కిదెప్పు డయిష్టంగా ఉంటే అప్పుడు ఆ కార్య కలా పాలను పూర్తిగా త్యజించ గలననే అచంచల ధైర్యం ఉన్నందువల్లే। అయినప్పటికి దీనివల్ల వచ్చే ఆపదను నేను గుర్తించక పోలేదు — ఏ నూతన పరిచితుని వింత ఆకర్షణా పాశాలలోనో నేను చిక్కుపడిపోతే నా భర్త అసూయ జ్వాలలతో మండిపోతారని నాకు తెలుసు. కాని ఆయ నకు నాపై పూర్తి విశ్వాసమున్న విషయముకూడ గట్టిగాతెలుసు. అందు చేతనే ఆయన ఈలాంటి విషయాలపై ఏ విధమైన ఉత్సుకతను గాని ఉద్రేకాన్నిగాని చూపించనూ లేదు. వాటికేమీ చలించనూ లేదు. అచ్చటి యువకులంతా గుణ రూప సంపదలలో నా భర్తకంటె హీనులనే సంగతి నాకు రూఢిగా తెలుసును. కాబట్టి నే నా అపాయాన్ని గురించి ఎక్కు వగా ఆలోచించి దిగులు పడ లేదు. సమాజంలో అనేకమంది దృష్టిని ఆకర్షించాననే అహంభావం, గర్వాతిశయం, అదొక విధమైన ఆత్మ సంతృప్తి — యివన్నీ నా భర్తపై నాకు గల ప్రగాఢ పవిత్ర ప్రేమలో ఏదో గొప్ప శక్తి ఉన్నట్లు ఆలోచించడానికి మాత్రమే దారితీశాయి. ఆయనపట్ల నా ప్రవర్తన, నడవడికను గూర్చి ఎక్కువగా ఆత్మ విశ్వా సాన్ని చేకూర్చుకొన్నాను.

ఒకరోజు రాత్రి విందునుంచి యింటికి రాగానే నా చూపుడు వ్రేలును ఆయన ముఖంవైపు పెట్టి ఆడిస్తూ, "ఈ సాయంత్రం మీరు "వీనా"తో ఎంతో ఉత్సాహంగా చనువుగా సాగించిన సంభాషణంతా నేను కనిపెట్టుతూనే ఉన్నాను లెండి।" అన్నాను నిజానికి ఆమెతో ఆ సాయంత్రం ఆయన సంభాషించినమాట వాస్తవమే. వీనా పీటర్సుబర్గు సమాజంలో బాగా పేరు ప్రఖ్యాతులున్న సుప్రసిద్ధ స్త్రీ. నే నా మాటలన్న ప్పుడాయన హిలువునా క్రుంగిపోయారు. ఆయన్ని కేవలం రెచ్చగొట్ట డానికే ఆమాట లన్న సంగతి విస్పష్టం.

"ఆవిధమైన అసహ్య ఆరోపణలను చేయడం వల్ల ముఖ్యంగా నీకు కలసి వచ్చే ప్రయోజన మేమిటి మాషా ?" అని బాధతో వణుకు తూన్న పెదిమలను పళ్ళతో నొక్కుతూ, కోపంతో కనుబొమలు ముడి వేస్తూ, "అటువంటి నీచాపవాదులను యితర్లకు వదలివేయి. అది నీకు నాకు కూడ బొత్తిగా సరిపడదు. ఈ లాంటి సన్నివేశాలు మనిద్దరి మధ్య నున్న పవిత్ర ప్రేమ సంబంధ బాంధవ్యాలను పాడుచేస్తాయి. అవి యెప్పటికయినా తిరిగి వస్తాయని నే నింకా ఆశిస్తూనే ఉన్నాను" అని పూర్తిచేశారు. సిగ్గుతో నేను రసాతలానికి క్రుంగిపోయాను. మరే మాట నా నోటిమండి రాలేదు. "మాషా ! అవి మళ్ళీ తిరిగి వస్తాయనే ఆశ నీ కున్నదా ?" అని ప్రశ్నించారు.

"అవి విచ్ఛిన్నం కాలేదని యిక ముందెప్పుడూ చితికిపోవని నా దృఢ విశ్వాసం" అన్నాను. నిజానికి నే నలా నమ్ముతూనే ఉన్నాను.

"నీ కోరిక సఫలం కావాలని సర్వేశ్వరుని ప్రార్థిస్తున్నాను. అలా కాకపోతే మన మీ పాటికి యింటికి వెళ్ళియుండే వాళ్ళం" అన్నా రాయన. ఆ ఒక్కసారే ఆయ నా విధంగా మాట్లాడారు. ఏమయితేనేం మొత్తానికి ఆయనకూడా నావలెనే అన్ని విధాల సంతృప్తి పడ్డారని నే నెంతో సంతోషించాను. ఈ ఆలోచన నా కెంతో ఆత్మశాంతిని చేకూర్చింది.

ఆయనొకప్పుడు విసుగుగానుంటే, ఆ విసుగుదలలో కసిరినా, కోపపడినా, తిట్టినా, ఏమి చేసినా నే నెంతో ఓర్మితో పల్లె ప్రాంతాల్లో నున్నప్పుడు సహించి ఊరకుండేదాన్ని. మా యిద్దరికీ మధ్యనున్న సంబంధ బాంధవ్యా లేమన్నా సడలినట్లయితే వేసవి వచ్చాక మరల మే మిద్దరం "నికోలోస్కా"లో మా అత్తగారితో మా యింట్లో నివసిస్తూన్న ప్పుడు సర్దుకొని పోతాయి కదా అని ఊహించి ఉపశాంతి కలుగ చేసు కొనేదాన్ని.

చలికాలం చల్లగా జారిపోయింది. మా ప్లానుల మాటెట్లావున్నా మే మా పీటర్సుబర్గులోనే ఈస్టరు పండుగ వెళ్ళిపోయేదాక ఉండి పోయాం. మరొక వారం గడచిపోయాక ప్రయాణ ప్రయత్నాలు ప్రారంభించాం. అన్నింటిని పూర్తిగా సర్దాం. మా తోటలో వేయాలవి ఆయనెన్నో పూల మొక్కలు తీసుకొని వచ్చారు. నికోలోస్కాలోవి మిత్రులకెన్నో బహుమతులు కొన్నారు. ఆ రోజెంతో మంచి ధోరణిలో సంతోషంగా ఉన్నారు. ఈలాంటి సమయంలో రాకుమార్తె దీనా పిడుగులాగ వచ్చి మమ్మల్ని శనివారందాక ఆగమని అర్థిస్తూ బోరిక్ రాకుమారుడు నా కొరకై పెద్దపెట్టున సన్మాన ప్రయత్నాలు చేస్తున్నాడని, నన్నేలాగు నయినా రప్పించాలని ఆ రాకుమారు డెంతో పట్టుదలగా నున్నాడని చెప్పింది. అంతే కాకుండా పీటర్సుబర్గును దర్శించడానికి వచ్చిన విదేశ ప్రభు వొకాయన నన్ను ఏదో విందులో చూచి, రష్యాదేశ మంతటిలోను నా అంత సౌందర్యవతి లేదని తన అమూల్యాభిప్రాయాన్ని వెలిబుచ్చి తానుకూడ ఆ సన్మాన సభకు హాజరుకావాలని కుతూహల పడుతున్నానని తెల్పాడట. నాతో పరిచయం చేసుకోవాలనికూడ ఉత్సాహపడుతున్నాడట. ఒకరేమిటి, రేపక్కడికి ప్రపంచమంతా వచ్చి వ్రాలుతుందంటే అతిశయోక్తి కాదు. ఇటువంటి ప్రధానమైన సమావేశానికి హాజరు కాకపోవడం కొండంత మహాపరాధం చేసినట్లేనని దీనా రాకుమారి నొక్కి చెప్పింది.

ఆ గదిలోనే మరొకమూల నా భర్త ఎవరితోనో మాట్లాడుతున్నారు. "అయితే మరి తప్పక వస్తావుకదూ మేరీ ?" అని మరల ప్రశ్నించింది దీనా రాకుమార్తె.

"మరెట్లాగ ? ఎల్లుండే మా గ్రామం వెళ్ళిపోడానికి స్థిరపరచుకొని ప్రయాణ సన్నాహాలుకూడ చేసేస్తున్నాం" అని పాము చావకుండా కట్టె విరక్కుండా ఆసందిగ్ధంగా సమాధానం చెప్పి నా భర్తవంక చూశాను. మా చూపులు కలిశాయి. ఆయన వెంటనే ముఖం త్రిప్పేసుకున్నారు.

"అలాగయితే అతణ్ణి బలవంతాన అపాలన్నమాట ! మేరీ ఒక్క మాట చెపుతాను విను. శనివారం గనుక మన మా సమావేశానికి హాజరయ్యామంటే అందరి చూపులు మనపైపే ఉంటాయి. అందరి తలలు తిరిగిపోవా లన్నమాట ! సరేనా ? ఏమంటావు ?" అన్నదామె.

తిరిగి "ఇది మా కార్యక్రమాన్ని తల్లక్రిందులయ్యేటట్లు చేస్తుంది. అప్పుడే సామానులన్నీ కట్టేస్తున్నారు కూడ" అని కొంచెం ఆశ చూపిస్తూ ప్రారంభించాను.

"ఆమెగా రీ సాయంత్రమే పోయి ఆ రాకుమారునికి తన కృతజ్ఞతను తెల్పిరావడం చాల మంచిదేమో !"అని ఆ మూలనుంచి హఠాత్తుగా గర్జించారు. అణగిపోయిన కంఠంతో రెచ్చకొట్టే ధ్వనితో ఆయ నా విధంగా మాట్లాడడం నే నెప్పుడూ వినలేదు.

"ఇంత కాలానికి నీవు అనుమానంతో, అసూయతో విండి పోయావని తెలుసుకోడానికి చాల విచారపడుతున్నాను" అని నవ్వుతూ ఆరంభించి "కేవలం ఆ రాకుమారుని సంతృప్తి పరచడానికే కాదు. మా అందరిని సంతోషపెట్టడానికికూడ రమ్మని నే నింతగా బలవంతపెడుతున్నాను. ఆ రాకుమారు డీమె ఉనికి నెక్కువగా అపేక్షిస్తున్నాడు" అని పూర్తిచేసింది.

"అవన్నీ ఆవిడే తేల్చుకొని నిర్ణయించుకోవలసియున్నది. అంతా ఆవిడగారి యిష్టం"అని మెల్లిగా రెండు మాటలంటించి చల్లగా అగదిని విడచి వెళ్ళిపోయారు.

ఆయనెంతో కలత చెందినట్లు నేను గుర్తించాను. నాకుకూడ చాల బాధ కల్గించిం దీ సంభాషణ. నే నేమీ నిర్ధారణగా వాగ్దానం చేయ లేదు. అతిథి నిష్క్రమించగనే నేను నా భర్త ఉన్న చోటుకు వెళ్ళాను. ఆయన తన గదిలో యిటునటు పచార్లుచేస్తూ ఏదో ఆలోచనలో నిమగ్నులయిన ట్లున్నారు. నా పాద ధ్వనిని వినసే లేదు.

ఆయనవైపే చూస్తూ నాలో నేను 'ఆయనకెంతో ప్రేమపాత్ర మైన తన స్వగ్రామం వికోల్స్కాను గురించి కలలు కంటున్నారప్పుడే! శోభాయమానమైన మా సమావేశ మందిరంలో మేము ఉదయాన కాఫీ త్రాగుతూండడం, అనేక మంది కూలీలు రోజూ మా యింటికి వస్తూం డడం, సంధ్యాసమయంలో మా సంగీత మందిరంలో గడిపే మధుర ఘడియలు, అర్ధరాత్రివేళ మేము దొంగతనంగా వంటింట్లో ప్రవేశించి ఫలహారాలు తస్కరించి భుజించిన రోజులు............ ఛా! అధిక సంపన్నుల పొగడ్తలకోసం, విందులు, విలాసాల కోసం, సన్మాన సభల కోసం, నేను అన్యాయంగా యీాయన మనస్సును కలవర పరచి క్షోభ పెట్టడమేనా నాకీ ప్రపంచంలో మిగిలియున్న పని? ఇదెంత అక్రమం! దారుణం!! ఘోరం!!' అని నా మనస్సులో నిర్ణయించుకొని యీ విందుకు వెళ్ళడానికి నా కిష్టం లేదని చెప్పేద్దామని నోటిదాక వచ్చేసింది. అనేద్దామని అనుకొంటూండగా, గదంతా పారచూస్తూ ఆయన నావంక చూచి కనుబొమలు చిట్లించారు. అంతవరకూ ఆలోచనలతో ఎంతో ప్రశాంతంగా నున్న ఆయన ముఖ కవళికలన్నీ ఒక్కసారి మారిపోయి పూర్వపు విచార రేఖలు, గ్రుచ్చిగ్రుచ్చి చూచిన ప్రశ్నార్థకపు చూపులు మరల ప్రత్యక్ష మయ్యాయి. ఆయన మానవ మాత్రులుగా కనబడుట కంగీకరించుట లేదు కాబోలు! అనుకొన్నాను. ఆయన వైఖరంతా చూస్తే చైతన్య శూన్య శిలా ప్రతిమలాగ తయారయినట్లు కన బడ్డారు నాకు.

"అయితే ఏమిటి ప్రియా?" అని వ్యాకులిత వాతావరణంలో మన్న నావైపు తిరిగి ప్రశ్నించారు.

నే నేమీ మాట్లాడ లేదు. అసలు విషయ మేమిటో చెప్పకుండా చేస్తూ నన్నుద్రేక పరుస్తున్నా రాయన. నే నిదివరలో ప్రేమించిన వ్యక్తి గా ఉండలేక పోతున్నారు.

"శనివారం నీ వా సన్మాన సమావేశానికి హాజరు కావాలని కోరు తున్నావా ?" అని అడిగా రాయన.

"నే ననుకొన్నా ఏమి ప్రయోజనం ? మన సామాన్లన్నీ కట్టివేసు కొన్నామాయె ! అదీ కాక ముందు మీ కిష్టం లేదు కదా ?" అన్నాను.

మును పెన్నడూ ఆయన కంఠ ధ్వనిలో అంత నిర్లక్ష్యం చూపుల్లో అంత నిర్దయ నే నెప్పుడూ చూడ లేదు.

"సర్దినవన్నీ ఊడదియ్యమని ఆజ్ఞాపిస్తాను. అదెంతసేపు? నీకోసం మంగళవారం దాక ఆగుతాను కూడ. నీకు వెళ్ళాలని వుంటే ఆ సభకు నీవు వెళ్ళవచ్చు. తప్పక వెడతావనికూడ ఆశిస్తున్నాను. కాని నేను మాత్రం రాను — రాలేను" అన్నారు ఖచ్చితంగా. కలవరపాటుగా నున్న వ్పుడు అలవాటుగా నడిచే విధంగా, ఆయన నా వంక చూడకుండా పెద్ద పెద్ద అంగ లేసుకుంటూ ఆ గదిలో పచార్లుచేయసాగారు.

"మీ ధోరణి నాకేమీ అర్థం కావడం లేదు"అని నే నున్నచోటనే మిగిలిపోయి నా చూపుల్ని ఆయన నడకతో నడుపుతూ అన్నాను. "ఆత్మ నిగ్రహం ప్రతిమనిషికి ఉండాలని దానిని యెట్టి పరిస్థితులలోను జారవిడుచుకోరాదని మీరు పదే పదే చెప్పేవారు కదూ ? (నిజానికి ఆ విషయ మాయన నాతో పెక్కుసార్లు చెప్పారు) మరి యెందుకు నాతో అలా వింతగా మాట్లాడుతారు ? ఈ సుఖాలను, ఆనందలను మీకోసం త్యాగం చెయ్యడానికి నే నెప్పుడూ సర్వ సన్నిద్ధంగా ఉన్నాను. మీరెదో వ్యంగ్య ధోరణిలో క్రొత్తగా నేనెదో తప్పక వెళ్ళుతానని, మిమ్మల్ని అంగీకరించమని బలవంత పెడుతూన్నట్లు మాట్లాడు తు న్నా రే !" అనేసరికి

"అయితే నీవు త్యాగం చేస్తావన్నమాట !"అని "త్యాగం" అన్న మాటను ఒత్తి మాట్లాడుతూ "మంచిది. చాలా బాగుంది ! అయితే నేనూ ఆ పని చేయగలను. అంతకన్న సన్మార్గ మేముంది ? ఇంతకీ మనం

ఔదార్యం పట్ల పోటీ పడుతున్నా మన్నమాట — ఆహా! సంసార సుఖావి కెంత ఉదాత్తమయిన ఆదర్శం!!" అన్నారు.

ఆయన పెదవులనుండి అంత కఠోరమైన, తిరస్కారభావ పూరితమైన భాషను నే నెప్పుడూ వినలేదు. నాకు తొట్రుబాటేమీ కలుగ లేదుగాని ఆయన చూపిన తృణీకారంచే. తీవ్రంగా అవమానింప బడ్డాను. కటువయిన ఆయన వాగ్ధోరణి నన్నేమీ భయపెట్టలేదు గాని నన్నుకూడ కఠినపరచింది. ఎప్పుడూ సూటిగా, సరళంగా నిర్భయంగా మాట్లాడే మనిషి, ఆవిధంగా ఏలా మాట్లాడగల్గారో? ఇంతకుపూర్వం మా సంభాషణల్లో ఒకరియం దొకరి కే విధమైన అపనమ్మకం కలుగుతుందోనవి భీతిల్లుతూ, ఎంత జాగ్రత్తగా మాట్లాడుకునే వాళ్ళం? ఆయ నా రీతిగా మాట్లాడడానికి నే నే ఘోరమైన అపరాధం చేశాను? నూటికి నూరు పాళ్ళు నిజంగా, నా ఆనందాన్ని హాని కనుపించని సంతోషాన్ని ఒక టేమిటి, నా సర్వస్వం ఆయనకొరకు త్యాగం చేయాలని నే నుద్యమిం చాను. ఒక క్షణం వెనుక ఆయన్ని నే నెంతో ప్రేమించాను. ఆయన భావాల నిదివరలో కంటె విస్పష్టంగా అవగతం చేసికొన్నాను. ఇప్పుడు మా భావాలు మారిపోయాయి. ఆయన ముఖా ముఖీని సూటిగా మాట్లాడుట మానివేశారు. కాని నే నిప్పుడు వాటినే వాంఛిస్తున్నాను.

"మీరు పూర్తిగా మారిపోయారు" అని ఒక నిట్టూర్పు విడచి "నేను మీ ముందు చేసిన గొప్ప నేరం ఏమిటి? ఈ విందు విషయమే కాదు — అసలు మీకు లోపల దీనికెదో పాతగాధ ఉంది. ఎందుకు నాపై మీ కింత అపనమ్మకం? పూర్వం ఆ మాటంటేనే మీరెంతగా భయపడే వారు? దాపరికం లేకుండా నేను చేసిన అపరాధాలేమిటో చెప్పరాదా?" అని ముగించి దీనికాయ నేమంటారా అని ఆలోచిస్తూ, నే నిక్కడున్న చలికాల మంతటిలోను ఏ యే తప్పిదాలు చేశానా అని పర్యావలోకనం చేసికొని చివరకు ఏమీ. చేయలేదని నాలో తప్పులేమీ పట్టలేరని తృప్తి చెందాను.

గది మధ్యలో నిలబడియున్న ఆయన దగ్గరకు రాసుకొంటూ పోయి ఆయనవంక చూస్తూ నిలబడ్డాను. 'ఆయనవచ్చి నన్ను తమ భుజ స్కంధాల నడుమ బంధించివేస్తారు. ఆ స్వర్గీయానందంలో నే నన్ని కించల్ని, వైషమ్యాలను మరచిపోతాను' అని ఏమేమో ఊహించు కొంటున్నాను. ఆయనదే తప్పని, నిరూపించడానికి నా కెక్కడా వీలు దొరకనందుకు విచారం కల్గింది. కాని ఆయన దూరంగా మూలకెక్కడకో పోయి నిలబడ్డారు. నా వంకచూస్తూ "నీ కింకా అర్థం కాలేదా ?" అని ప్రశ్నించారు. "లేదు నా కేమీ బోధపడలేదు" అన్నాను.

"అయితే నీకు విపులంగా వివరించవలసి యున్నది. నే నెంతో మధనపడ్డాను. ఆలా విచారించకుండా ఉండలేకపోయాను కూడ. ఇంతటి బాధతో క్రుంగిపోవడం నా జీవితంలో యిదే తొలిసారిగా చూచుకో గల్గు తున్నాను" క్రోధంలో వచ్చే తొట్రుపాటువల్ల కొంచెం ఆగారు. "ఇంతకూ మీ అభిప్రాయం ఏమిటి ?" అని నే నడిగాను. నా కండ్లు రెండూ శోకబిందువులతో నిండిపోయాయి.

"ఎవరో రాకుమారు డొకడు నిన్ను అధికంగా ప్రశంసించి మెచ్చుకొన్నాడు. దానితో నీ కతనిని వెంటనే కలసికోవాలనే ఉబలాట మెక్కువైపోయి. నీ భర్తని, నిన్ను, నీ స్త్రీ గౌరవాన్ని పూర్తిగా మరచి పోయి, పరుగెత్తాలని చూస్తున్నావు. నీవు పొందాలని వాంఛిస్తూన్న అఖండ గౌరవం, నిన్ను గురించి నీ భర్త ఏ విధంగా ఆలోచించడానికి దారి తీస్తూందో నీవు గుర్తించక చాల హఠంగా ప్రవర్తిస్తూ దురభి ప్రాయ పడుతున్నావు. అంతటితో ఆగకుండా నీవు సరాసరి నీ భర్త సమక్షానికి వచ్చి నీవు చేసే "త్యాగం" గురించి ప్రస్తావించడానికి సాహ సించావు — ఏమిటి నీ వనుకొనేది ? — 'ఆ గొప్ప ప్రభువుగారికి నా దర్శన మీయడ మనేది మహాభాగ్యం, అమితానందాన్ని చేకూర్చే విషయం. కాని దీని నంతా మీకోసం "త్యాగం" చేయ దలచుకొన్నాను' ఇంతేగా నీ అభిప్రాయం" అని ఉపన్యాసం సాగిస్తున్నారు.

ఆయ నెంత ఎక్కువగా మాట్లాడితే నాకంత ఎక్కువగా ఉద్రేకం పుట్టుకవస్తోంది. ఆయన కంఠ స్వరంలో నున్న కఠినత్వం, మొరటుతనం, క్రూరత్వం, నన్ను మరింత రెచ్చకొడుతున్నాయి. ఆ రూపంలో ఆయన్ని నే నెప్పుడూ చూడ లేదు, అలా చూస్తానని నే నెన్నడూ ఊహించుకోలేదు కూడ. రక్తమంతా ఒక్కసారి నా హృదయంలోనికి ప్రసరించింది. భయంతో నేను వణకిపోయాను. నేనెంత ఆలోచించినా సిగ్గుపడాల్సినపనినేనేమీ చేయలేదనేతేలుతోంది. ఉద్రేకంతో ముక్కముక్కలయిన నా అహంకారమంతా ఆయనపై అతి త్వరలో కసి తీర్చుకోమని ప్రోత్సహించి తొందర పెడుతూంది.

"ఈ విధంగా మీరంటారని, ప్రవర్తిస్తారని చాలకాలంనుండి నేను అనుకొంటూనే ఉన్నానులెండి. ఆపేశారేం, కానీయండి! మీ రనదలచు కొన్నదంతా పూర్తిగా అనండి" అన్నాను.

"నీ వేమనుకొన్నావో నాకు తెలియదు గాని, మొన్న ఆ అసహ్య కరమైన, సోమరిపోతుల, విశేష భోగ లాలసుల సమాజంలో నీవు పాత్ర వహించడంతోనే తెలసిపోయింది నీ వెంత నీచానికి పోగలవో! ఆఖరకు అదే అయింది. నే నిప్పుడు పొందినంత బాధ, అవమానం, తలవంపులు నే నెప్పుడూ పొందలేదు — హేయమైన తన వ్రేళ్ళతో నా హృదయంవైపు చూపుతూ, నీ స్నేహితురాలు నా అసూయనుగూర్చి ప్రస్తావిస్తూంటే నాకు నరకబాధకాక మరేమిటి? ఒక మనిషిపై నాకు అసూయట! అందులోనూ నీకు గాని నాకుగాని యింతవరకూ తెలియని అసూయ!! నన్ను సరిగా అర్థం చేసుకోవడంమాట పూర్తిగా కాలదన్ని నా కొఱకు నీవేదో పెద్ద త్యాగం చేస్తున్నావని, యింకా చేయబోతున్నావని గర్వించడం! నీ వీ నీచదశకు దిగజారడం చూచి, నా కసహ్యం వేసింది. అవమానంతో సిగ్గుతో తల ఎత్తలేక రసాతలానికి క్రుంగి పోతున్నాను.......త్యాగమట త్యాగం!!" అని మరల ఆ మాటనే రెట్టించారు.

'ఓహో! భర్త అధికారం చెలాయించడ మంటే యిదే కాబోలు' అనుకొన్నాను నాలో నేను. 'ఒక అమాయకురాలైన పవిత్రస్త్రీని అవ మాన పరచటం భర్త అధికారాలలో ఒకటయితే కావచ్చునుగాని, నేను మాత్రం వీటికి వేటికీ లొంగిపోను' అని హృదయాన్ని దిట్టపరచు కొన్నానేగాని, రక్తమంతా ఒక్క చుక్కయినా లేకుండా నా ముఖం నుండి మాయమైపోయినట్లు, శ్వాస ఆగిపోయినట్లూ తోచింది నాకు.

"లేదు — లేదు మీకోసం నేనేమీ త్యాగం చెయ్యనులెండి. శని వారం తప్పకుండా ఆ సన్మాన సమావేశానికి, విందుకు హాజరవుతాను" అని నేనంటే "వెళ్ళి అమితానందాన్ని అనుభవిస్తా వనుకొంటానులే! మన కిద్దరికీ మధ్య నున్నదంతా ఖర్చయిపోయింది" అని కోపాన్ని ఆపుకోలేక అరుస్తూ, "ఇకముందెప్పుడూ నన్ను హింసించ వనుకొం టాను. అసలు నిన్నని ప్రయోజన మేముంది. ఇంతకీ నేను చాల తెలివి తక్కువ దద్దమ్మని. లేకపోతే నిన్ను..................." అయన పెదిమలు వణికాయి. బహిర్గతమైన పెద్ద ప్రయత్నంతో పెదిమలను పండ్లతో నొక్కి ఆ వాక్యాన్ని పూర్తిచేయకుండానే ఆపివేశారు.

ఆ క్షణాన ఆయన్ని చూస్తే భయం, అసహ్యంకూడ కల్గాయి. ఆయనతో సమానంగా నేనుకూడ ప్రతివాదనలు చేసి ఆయన చేసిన అవ మానానికి తగిన బుద్ధి చెపుదామనుకొన్నాను. గాని పెదవి మెదిపితే కన్నీటి ధారలు సంతత ధారగా ప్రవహించేవి. నా సతీత్వాన్ని, గౌరవాన్ని పూర్తిగా పోగొట్టుకొని ఉండేదాన్ని. ఏమీ మాట్లాడకుండా గదిని విడిచి పెట్టి వెళ్ళిపోయాను. ఆయన అడుగుల చప్పుడు వినపడుట ఆగిపోగానే ఆయన చేసిన హంగామాను తల్చుకొని హడలి కంపించి పోయాను. నాకెంతో సంతోషాన్ని చేకూర్చిన మా అన్యోన్య సంబంధ బాంధవ్యాలు శాశ్వతంగా తెగిపోతాయోమోనని భయపడ్డాను. ఆయన దగ్గరకు మళ్ళీ వెళ్ళాలనిపించింది. కాని ఆయన నన్ను సరిగా అర్థం చేసుకొనేటంత శాంతిందారా? నే నెంతో ఆదరణాను రాగాలతో చేతులు చాచి ఆయన

వంక కరుణ దృష్టులను ప్రసరింప చేస్తే నన్ను ప్రేమతో స్వీకరిస్తారా? కొంపతీసి నేను పొందిన దుఃఖాన్నంతటినీ నటనక్రింద జమకట్టరుకదా? లేకపోతే ఆయనదే నిస్సందేహంగా సరియైన దృక్పథమని, నా పశ్చాత్తాపాన్ని, చలించని గర్వాతిశయంతో అంగీకరిస్తారేమో? ఎందుకట్టా! అంతగా నేను ప్రేమించిన వ్యక్తి నన్నింత క్రూరంగా అవమాన పర చాలి? అని ఆలోచించి ఆయన దగ్గరకు కాకుండా సరాసరి నాగదిలోనికి పోయి ఎంతో సేపక్కడే కూర్చుండి ఏడ్చాను. క్రుంగి కుమిలిపోయి భయంతో వణుకుతూ, మా సంభాషణలో ఆయన అన్న ప్రతి ముక్కను జ్ఞాపకం చేసికొంటూ ఆ మాటల స్థానంలో యితర పదాలను అంటే మే మిదివరలో సాగించుకొనే ప్రేమ పూరిత కరుణ శోభిత పదాలను జేర్చి, వాస్తవికతను భయ విహ్వలిత చిత్తంతో, ఆ గాయపడిన హృదయం లోనే ఒక్కసారి పునరావృత్తం చేసుకొన్నాను. సాయంకాలం టీ త్రాగ డానికని క్రిందకు వెళ్ళాను. నా భర్త తమ స్నేహితునితో మాట్లాడు తున్నారు. ఆ రోజునుండీ మా యిద్దరికీ మధ్య ఏదో పెద్ద అఖాతం ఏర్పడినట్లు మాకు తోచింది. మే మెప్పుడు వెళ్ళేదీ చెప్పమని ఆ స్నేహితుడు అడిగాడు. నేను సమాధానం చెప్పకముందే నా భర్త "మంగళ వారం వెడుతున్నాం. రోరిక్ రాకుమారు డివ్వబోయే సన్మానంకోసం ఆగి పోవలసి వచ్చింది" అని జవాబు చెప్పి నా వైపు తిరిగి "నీవు హాజ రవ్వాలని కోరుతున్నావు కదూ?" అన్నారు.

ఆయన సమాచారం సేకరించే ధోరణి, కంఠస్వరం చూస్తే నాకు దడ పుట్టింది. బెదురుతూ ఆయనవంక చూశాను. ఆయన చూపులు సూటిగా, నావైపే గుచ్చి గుచ్చి చూస్తూ, నిర్దయగా విరసన భావాన్ని వ్యక్తపరుస్తున్నాయి. ఆయన కంఠస్వరం నిశ్చలమైన నిరుత్సాహాన్ని నిరూపిస్తోంది. "అవును" అని ముక్తసరిగా సమాధాన మిచ్చాను.

ఆ సాయంకాలం నేను ఒంటరిగానున్న సమయాన నాదగ్గరకు వచ్చి తన చేతులను ముందుకు చాచి "నే నీ రోజున అన్న మాటలన్నీ

దయయుంచి మరిచిపో" అన్నారు. ఆయన చేతులను దగ్గరకు తీసికొం టూండగా, పెదవులపై చిరునవ్వులు మొలక లెత్తాయి. అశ్రువులు ప్రవ హించడానికి సిద్ధంగా ఉన్నాయి. కాని ఆయన చేతులను వెనుకకు లాగు కొని ఈ సంకల్ప రంగానికి భయపడినట్లు ఎక్కడికో దూరానికి పోయి పడక కుర్చీలో చతికిలబడ్డారు.

'ఇంకా ఆయనదే సరియైన దృక్పధమని ఆలోచించడానికి సావు కాశా లేమున్నాయా ?' అని ఆశ్చర్యపోయాను. ఆయన్ని విందుకు వెడదాం రమ్మని అడుగుటకు సంసిద్ధపడ్డాను. కాని ఆ మాటలు పైకి రాకుండా నా అధరాలపైననే అంతరించిపోయాయి.

"మన ప్రయాణం ఆగిపోయిందని మా అమ్మకు ఉత్తరం వ్రాయాలి. లేకపోతే ఆవిడ అనవసరంగా ఖంగారు పడుంది" అన్నారాయన.

"ఎప్పుడు వెడదా మనుకొంటున్నారు" అని ప్రశ్నించాను.

"సన్మాన సంరంభ మయిన తర్వాత మంగళవారం" అని సమా ధానం చెప్పారు.

"ఆ భారమంతా నా మీదే లేదనుకొంటాను" అని ఆయన నేత్రాల కేసి చూస్తూ అన్నాను. ఆయన కండ్లు నా కండ్లను చూచాయేగాని తిరిగి సమాధాన మివ్వ లేదు. ఏదో తెర వచ్చి నన్ను చూడకుండా కప్పివేసి నట్లు ఆయన ముఖం హఠాత్తుగా ముసలిరూపం దాల్చి అనంగీకార యుతంగా నున్నట్లు తోచింది నాకు.

ఏమయితేనేం మే మా సన్మాన సభకు, విందుకు వెళ్ళాం. మరల మంచి స్నేహ సంబంధ బాంధవ్యాలు మా మధ్య సమకూరినట్లు కన బడింది. కాని వీటికీ పూర్వపువాటికి చాల తేడా ఉన్నది.

విందులో నే నితర స్త్రీలతో వేరే కూర్చున్నాను. రాకుమారుడు నా దగ్గరకు వచ్చేసరికి ఆయనతో మాట్లాడుటకు నేను లేచి నిలబడ

వలసివచ్చింది. లేచీ లేవడంతోటే నా కండ్లు అప్రయత్నంగా నా భర్త కోసం వెతికాయి. ఆయ నా గదిలో మరొక మూలనుండి నా వంక చూస్తూనే ఉన్నారు. నే నెప్పుడయితే ఆయనవంక చూశానో వెంటనే ఆయన ముఖం చాటేసుకొన్నారు. హఠాత్తుగా ఏదో చెప్పరానిబాధతో నా ముఖం దైన్య మేఘావృతమై అవమానంతో క్రుంగిపోయింది. ఈ కలవరపాటులో నా ముఖం, మెడ రాకుమారుడు చూస్తూండగనే ఎఱ్ఱబారిపోయాయి. నే నలాగే నిలబడి రాకుమారుడు చెప్పేదానిని వినవలసి వచ్చింది. రోరిక్ ప్రభువు బాగా ఆజానుబాహుపు కాబట్టి ఎత్తునుంచి నా పైపే దృష్టులు కేంద్రీకరించి సంభాషించాడు. మా సంభాషణ ముగిసింది. కాని పాప మా రాకుమారునికి నా సరసన నిలబడి ముచ్చటించ దానికి సావుకాశం చిక్కలేదు. నే నాయనతో మాట్లాడుట కిచ్ఛగించుట లేదని భావించి బాగా ఖేదపడి వుంటాడు. వేసవిలో జరుగబోయే విందులను గూర్చి ఆయనేదో ప్రస్తావించాడు. నన్ను విడచి వెళ్ళిపోయేముందు నా భర్తతో పరిచయం చేసికోవాలనే కోరికను, కుతూహలతను వెలిబుచ్చాడు. తర్వాత వారిద్దరూ ఆ గదిచివర సమావేశమై సంభాషించుకొనుట నేను చూచాను. ఆ రాకుమారుడు నన్ను గురించి ఏదో చెప్పాడనుకొంటాను. దానికి నా భర్త చిన్న మందహాసం చేసి మధ్యలో నా పైపొకసారి దృష్టిని మళ్ళించారు. మరి యింతలో ఏమి వచ్చిందో అకస్మాత్తుగా నా భర్త తటాలున లేచి రాకుమారుడు సంభాషణ ముగించక పూర్వమే తామే చిన్న నమస్కారం, కరస్పర్శ చేసి వెళ్ళిపోయారు. ఈ దృశ్యం చూచేసరికి నా ముఖం మళ్ళీ ఎఱ్ఱబారింది. రాకుమారుని పట్ల ముఖ్యంగా నేను, నాకంటె ఎక్కువగా నా భర్త ప్రకటించిన తిరస్కార భావ వైఖరికి నేను చాల సిగ్గుపడ్డాను. ఆ విందుకు హాజరైన ప్రతి ఒక్కరూ అసహజమైన, వికారమైన నా సిగ్గును చూచి, ఆశ్చర్యపడి ఉంటారని, నా భర్త విపరీత ప్రవర్తననుకూడ గుర్తించి యుంటారని అనుకొన్నాను. 'మా ప్రవర్తన కేలాంటి భాష్యం చెప్పి ప్రచారం చేశారో

ఆ భగవంతునికే తెలియాలి. అన లీపాటికి నాకు, నా భర్తకు మధ్య చెల రేగిన కీచులాట లన్నీ తెలిసే ఉంటాయి' ఈ విధంగా పరుగెత్తాయి నా భావాలు.

దీనా రాకుమార్తె నన్ను తన బండిలో మా యింటిదాకా తీసుకొనివచ్చి దిగబెట్టింది. దారిలో ఆమెకు నా భర్తను గురించి యావత్తూ చెప్పాను. నా ఓర్పు అంతరిస్తోందని, ఈ విందును గూర్చి జరిగిన రభస జగడము అన్నీ విపులంగా చెప్పాను. నన్ను శాంతపర్చడాని కామె, అటువంటి చిన్న చిన్న పోట్లాటలు సామాన్యంగా భార్యాభర్తల మధ్య చెలరేగుతూనే ఉంటాయని, వాటికి మనం పెద్ద ప్రాధాన్యతనిచ్చి పట్టించుకోకూడదనీ హెచ్చరించి "కాని ఈ మధ్య నీ భర్త బాగా వింతగాను, విపరీతంగాను మార్పు చెందాడు. అతనిలో అసూయ, కాఠిన్యం, సంఘ ద్వేషం ప్రబలుతున్నాయి" అని నిష్కర్షగా నా భర్తపై తన అభిప్రాయాన్ని చెప్పింది. నే నది నిజమేనని నమ్మి అంగీకరించాను. ఈ అభిప్రాయంతోనే ఆయన్ని చూడసాగాను.

కాని తర్వాత నేను ఒంటరిగా మన్నప్పుడు లేదా నా భర్తతో కాలం గడుపుతూన్నప్పుడు నా మనో ఫలకంలో ఆయన శీలాన్నిగూర్చి నిర్ణయించుకొన్న తీర్పునుగూర్చి ఆలోచించినప్పుడు ఏదో పెద్దబరువును ఆయన నెత్తిపై మోపి నేను హాయిగా ఉన్నత స్థానంలో కూర్చున్నట్లుండేది. మా యిద్దరికీ మధ్య ఏర్పడ్డ అఖాతం నెమ్మది నెమ్మదిగా పెద్దదవుతూన్నట్లు నేను గ్రహించాను.

# అధ్యాయం 8.

ఆ రోజునుండి మా యిద్దరికీ మధ్యనున్న అన్యోన్య సంబంధ బాంధవ్యాలలోను, మా జీవిత సరళిలోను విపరీతమైన మార్పులు పూర్తిగా వచ్చేశాయి. ఇదివరలో మే మిద్దరం ఏకాంతంగా గడిపిన సమయాల్లో పొందిన ఆనందం యిప్పుడు మచ్చుకయినా కనబడకుండా మాయమైపోయింది. ఇష్టం ఉన్నా లేకపోయినా కొన్ని కొన్ని విషయా లకు పెద్ద స్థానం ప్రాధాన్యత యివ్వవలసి వచ్చేది. మూడవ మనిషి మా మధ్య నున్నప్పుడుమాత్రం మా సంభాషణలు సాఫీగా, సరళంగా సాగేవి. గ్రామ జీవితాన్ని గురించిగాని, విందు విషయాలను గూర్చి గాని ఏదయినా ప్రస్తావన వస్తేమాత్రం, మా యిద్దరికీ మనస్థిమితం ఉండేది కాదు. ఒకరి నొకరం చుర చుర చూచుకోవడంకూడ తటస్థించేది. ఏ విషయంపై మా యిద్దరికీ మధ్య అఖాతం ఏర్పడిందో పూర్తిగా తెలిసీ కూడ, దానిని పూడ్చడానికి ప్రయత్నించకపోవడం అటుంచి, అసలు దానిని సమీపించడానికే సాహసించలేక పోయేవాళ్ళం.

ఆయన మొండిగా స్వాతిశయంతో నున్నారని, ఈ దుర్బలాం శంపై నేను కలుగ చేసుకోకూడదనుకొని నిశ్చయించుకొన్నాను. నాకు పల్లె జీవితమంటే రోతని, విందులు వినోదాలు అంటే పడిచస్తానని ఆయనకుకూడ పూర్తిగ తెలసును. కాని నాకోసం తన కేమాత్రం యిష్టం లేకపోయినా, నా అభిరుచులతో లయ కల్పాల్సి వస్తోంది. ఒకరి నొకరం తప్పుగా అర్థం చేసుకుని, ఆ యా విషయాలపై నిష్కపట మైన చర్చలను పూర్తిగా పరిత్యజించాము. ప్రపంచంలో మే మిద్దరమే మచ్చలేని మనుష్యుల మనే భావం మాసిపోయింది. ఎంతసేపూకూడ ఒకరినొకరం శల్యపరీక్ష చేస్తూ మాలో నేరస్థు లెవరో, వారికి సామాన్య ప్రజలస్థాయి సరిగా తూనిక సరిపోతుందా లేదా అని చాటు చాటుగా చూచుకోవడం అలవాటయిపోయింది. పీటర్సుబర్గు వదలి వెళ్ళిపోదా

మమకొంటుండగా నాకు జబ్బు చేయడంవల్ల మా బసమ పట్టణ సమీప ప్రాంతానికి మార్చుకోవలసి వచ్చింది. నా భర్త తన తల్లిగారిని చూడ డానికని ప్రయాణమయ్యారు. అప్పటికి నా ఆరోగ్యం బాగుపడి ఆయనతో వెళ్ళడానికి తగిన స్వస్థత చేకూరింది. అయినా ఆయన నన్ను ఆరోగ్యపు నెపంమీద పీటర్సుబర్గులోనే వదలి, ఒక్కరూ వెళ్ళిపోయారు. నాకేమీ తోచలేదు. ఏకాంతావాస క్లేశాన్నెక్కువగా అనుభవించవలసి వచ్చింది. ఆయన తిరిగి వచ్చిన తర్వాతకూడ ఆయన కెక్కువ సంతోషాన్ని కలుగజేయలేక పోయిన సంగతి నిజమే. ఇదివరలో నా మనోవీధి లోని కే ఆలోచన వచ్చినా, నేను యేయే అనుభూతులు పొందినా అవి ఆయ నకు చెప్పకుండా దాచితే, నా నెత్తిపై ఏదో పెద్ద బరువున్నట్లుండేది. ఆయన ప్రతి పలుకు, ప్రతి చర్య పరిపూర్ణత చెందినవాటికి ప్రత్యేకోదా హరణలుగా నుండేవి. ఒకరినొకరు చూసుకొన్నప్పుడు ఆనందావేశంతో సదా నవ్వుకొంటూండే వారం. ఇవన్నీ గుర్తుపట్టలేనంతగా మారి పోయాయి. పైగా అవి ఎప్పుడు నిష్క్రమించాయో మే మసలు గుర్తిం చనే లేదు. మాలో ప్రవేశించడాని కెప్పుడూ సాహసించని, స్వార్థపూరిత మైన ప్రత్యేక అభిరుచులు, ప్రత్యేక శ్రద్ధలు తమ తమ రూపాలను కన పర్చడం మొదలు పెట్టాయి. మనఃక్లేశాలుగాని, ఎడబాట్లుగాని మాకు దుఃఖాన్ని కలుగచేయడం మానివేశాయి. అంతకంత కీ భావాలే బాగా నాటుకో నారంభించాయి. ఈ మాదిరిగా ఒక్క సంవత్సరమైనా గడవక ముందే ఆశ్చర్య సంభ్రమము లేవీ లేకుండా ఒకరి నొకరం చూచుకో గల్గుతున్నాం. నాతో ఆయ నిదివరలో బాల్యచాపల్య జనితమైన చిలిపి చేష్టలతో ఆడేవారు. అవన్నీ పూర్తిగా సమసిపోయాయి. సంతోష పర వశంలో నన్నెంతో ఉద్రేకపరచి మనసిచ్చి ముద్దుగా, చనువుగా, ఎంతో ప్రశాంతంగా సాగించే ఆయన సంభాషణలన్నీ వెళ్లిపోయాయి. నన్ను తికమకలు పెట్టి ఎంతో ఉల్లాసాన్ని కలుగచేసే ఆయన సుతీక్ష్ణ దృక్కు లన్నీ తరలిపోయాయి. మేనులు మైమరచి మహదానందంలో గడిపిన

మధుర ఘడియలు, మే మిద్దరం కలసి గావించిన ప్రార్ధనాది మేటిఘట నలు వన్ని వేళాలు సంపూర్తిగా అంతరించాయి. మే మిప్పుడు తరచుగా కలుసుకోవడమే మానివేశాం. చీకు చింతా లేకుండా నిర్భయంగా నన్నా యన ఒంటరిగా వదలి తమపనులు చేసుకొంటున్నారు. ఆయన లేకుండా నే నెక్కువగా సమాజ కార్య కలాపాలలో కాలాన్ని గడిపేస్తూ వచ్చాను.

తర్వాత మా మధ్య పోట్లాట లేమీ చెలరేగ లేదు. ఆయన్ని అన్ని విధాల సంతృప్తి పరచడానికి సదా ప్రయత్నించేదాన్ని. ఆయనకూడ నా ప్రతి చిన్న కోరికను తీర్చేవారు. మరల ఒండొరుల మధ్య అనంత మయిన అనురాగాప్యాయాలు మొలకలెత్తి ఒకరి నొకరం గాఢంగా ప్రేమించుకుంటూన్నట్లే కనబడింది.

అరుదుగా మే మిద్దరం కలసి గడిపిన ఘడియలుకూడ ఉంటూం డేవి. ఆ సమయాల్లో ఉత్సాహంగాని, సంతోషంగాని లేదా కలవరంగాని ఏమీ పొందలేకపోయేదాన్ని. ఆయన సాన్నిధ్యంలో నున్నప్పటికీ నే నొంటరిగా యున్నట్లే యుండేది. నా ఎదురుగానున్న వ్యక్తి ఎవరో అపరిచిత వ్యక్తి కాదని, చాల సద్గుణ సంపన్నుడని నా భర్తయే ఆయన అనే భావంమాత్రం ఉండేది. ఆయన ఏ విధంగా మాట్లాడేదీ, చేసేదీ, చూచేదీ నాకు బాగా తెలుసు. నా కమితాశ్చర్యం కల్గినట్లు ప్రవర్తిస్తే మాత్రం, నాదేమీ తప్పులేదని ఆయనే పూర్తిగా దోషులని ధృవపరుచు కొనేదాన్ని. ఆయన నుండి నే నేమీ ఆశించలేదు. ఒక్క ముక్కలో చెప్పాలంటే, ఆయన నా భర్త — అంతే! ఇకముందు కూడ పరిస్థితు లన్నీ ఈ మాదిరిగానే ఉండాలని కోరుకొనేదాన్ని. ఈ ఆలోచనా దృష్టితో పరిశీలిస్తే అంతకన్న అధికమైన సంబంధ సంపర్కాలేమీ ఎప్పుడూ లేనట్లే తోచింది. ముఖ్యంగా ఆయన నన్ను ఒంటరిగా వదలి మా అత్తగారి దగ్గరకు వెళ్ళినప్పుడు, ఎక్కువగా ఎడబాటును.

భయాన్ని పొందాను. నా అవసరం ఆయనకు తప్పకుండా కల్గుతుందని ఆశించాను. ఆయన తిరిగి రాగానే అధికతరానందంతో పరుగెత్తుకొని వెళ్ళి ఆయనవళ్ళో వ్రాలాను. రెండుగంటలు గతించాయి. నా ఆనంద మంతా అదృశ్యమై పోయింది. ఆయనతో చెప్పడానికేమీ వింతలు, విశే షాలు లేకపోయాయి. అప్పుడప్పుడు కొన్ని కొన్ని సమయాల్లో వర్ణింప లేనంత ప్రేమ లాలింపులతో కాలం గడచిపోయేది. మళ్ళీ వెనువెంటనే ఎదో పెద్ద తప్పు చేసినట్లు లోలోపల బాధగా నుండేది. సరిగ్గా ఈ లక్ష ణాలే ఆయన ముఖ వర్చస్సులోకూడ ప్రకటితమయ్యేవి. నేను ఎప్పు డన్నా చైతన్యంతో కూడిన ఆర్ద్రహృదయతను పొందికగా ప్రదర్శిం చినా ఆయనేమీ చలనం లేకుండా కనబడేసరికి నే నొక్కడుగయినా ముందుకు వేయలేకపోయేదాన్ని. దీనిని చూస్తే నాకెంతో దిగులుగా నుండేది. పాత సంఘటనలను పర్యావలోకనం చేసికొందామంటే బొత్తిగా తీరిక లేకపోయేది. గతాన్ని విస్మరించి ప్రస్తుత పరిస్థితులలో మార్పుకోసం తహతహ లాడుతూ పరధ్యానంలో మునిగిపోయేదాన్ని. తళతళా మెరిసే నాగరికతా జీవనం, తన దివ్య ప్రభావాన్ని ప్రస్ఫుట పరచి నా శరీరంపై మెదడుపై అధికారం చలాయించుతూ, సంకెళ్ళు సారించి నా చిత్త ప్రవృత్తిపై పూర్తి గుత్తాధికారాల నేర్పరచుకొంది. ఒక్కొక్కప్పుడు ఆయన నాకు దూరంగా వెళ్ళిపోతే సహించలేక పోయేదాన్ని. అంతేనేగాని నా విపరీత ప్రవర్తనను ఆలోచనలను విమ ర్శించుకొనడానికి ధైర్యం చాలేది కాదు. ఉదయం మొదలు సాయంత్రం దాక సమాజ కార్యక్రమాలలోనే గడిపేదాన్ని. అథవా నే నింటి దగ్గ రున్నా నా మనస్సు మనస్సులో ఉండేది కాదు. ఈ స్థితిని చూస్తే నాకు సంతోషమూ లేదు — విచారమూ లేదు, ఒకటి మాత్రం స్ఫటికంలా కని పిస్తోంది. అదేమిటంటే ప్రస్తుతం మా జీవిత సరళి పాతజీవితంలా మాత్రంలేదు. అంతవరకే నేను చూసుకోగల్గాను.

ఈ మాదిరిగా మూడు నిండు సంవత్సరాలు దొర్లుకొనిపోయాయే

గాని మా సంబంధ బాంధవ్యాలలో ఏమీ మార్పు రాలేదు. అవి బాగు పడనూలేదు, అధోగతికి దిగజారనూలేదు. స్థాణువులా మిగిలిపోయాయి. ఈలోగా మా కుటుంబంలో రెండు పెద్ద మార్పులు జరిగాయి — ఒకటి నాకు ప్రథమ సంతానం కల్గడం, రెండవది మా అత్తగారు చనిపోవడం. ప్రప్రథమంగా చెప్పవలసిందేమంటే, నేను మాతృత్వం పొందడంవల్ల నాలో ఏదో మహాద్భుత శక్తి, అనంతమైన ప్రేమోత్సాహానుభూతి కల్గడం వల్ల నా జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభ మవుతూన్నదని ఉప్పొంగిపోయాను. రెండు నెలలు కాల ప్రవాహంలో కొట్టుకొని పోగానే, నేను కాస్త లేచి తిరుగగలుగుతున్నాను. కాని నా ఆశలన్నీ క్రమ క్రమంగా కాలం సాగేకొద్దీ బలహీనపడి నీరసించిపోయాయి. నిస్సారమైన దైనందిన కార్యక్రమంలోపడి తన్నుకోవడం అలవాటయి పోయింది. నా భర్త తద్వ్యతిరేకంగా, మా జ్యేష్ఠుడు జన్మించగనే పాత మనిషిగా మారిపోయారు. ఎంతో శాంత ప్రవర్తనతో సంచరిస్తూ ఎప్పుడు యింటిదగ్గరే ఉంటూ, ఎడతెగని ఆనంద పరవశత్వంలో నా బిడ్డను అపురూపంగాచూచుకోసాగారు. సొగసుగా సింగారించుకొని విందు లకు వినోదాలకు పోయి అర్ధరాత్రికి యిల్లుచేరి పరుండబోయే ముందు బిడ్డను శిలువతో పవిత్రం చేయాలని ఆ గదిలోనికి వెళ్ళేసరికి నా భర్త బిడ్డప్రక్కనే కూర్చుండి ఆ పసిపాపకేసి చూస్తూండేవారు. నన్ను చూడ గానే ఆయన చూపులు తీక్ష్ణమై క్రోధజ్వాలలను వెదజల్లేవి. నా హృదయం అంతగా కఠినత్వంతో ఎందుకు కరడు కట్టుకొనిపోయిందో ఆలోచిస్తే సిగ్గుతో తల క్రుంగిపోయేది. అసలు నాలో ఎక్కడన్నా మాతృత్వంగాని కనీసం స్త్రీత్వం గాని ఉన్నాయా అని చూచుకొనేదాన్ని, ఇతరస్త్రీలకంటె అధమ స్థితిలో నున్నానని చింతించేదాన్ని. 'కాని దీనికి మనమేమీ చెయ్యలేం. నా బిడ్డను నేనెంతో ప్రేమిస్తున్నమాట వాస్తవమే ! ఎటొచ్చీ ప్రొద్దస్తమానమూ ఆ శిశువు దగ్గరే కూర్చోవాలంటే మహా చెడ్డ విసు గుగా ఉంటుంది. మనస్సులో అనుభూతి చెందనిదానిని గురించి దొంగ

నటింపు చేయడం నాకు చేత కాద'ని నాకు నేనే సర్ది చెప్పుకొని సంతృప్తిని కలుగచేసికొనేదాన్ని.

నా భర్తకు ఆయన తల్లిగారి మరణం విపరీతమైన దుఃఖాన్ని కలుగ చేసింది. నికొలోస్కా వెళ్ళడాని కపరిమితమైన బాధగా ఉందని అనేకసార్లు వాపోయారు. నేనుకూడ చాలసార్లు విచారించి, కంట తడి పెట్టుకొని నా భర్తకు సానుభూతి చూపించానేగాని, అత్తగారి తదనంతరమే ఆ యింట్లో సౌఖ్యప్రదమైన జీవితాన్ని సాగించ గలననే ధైర్యం కలిగింది. ఆ మూడు సంవత్సరాలలో ఎక్కువభాగం మేము పట్టణాల లోనే కాలం గడిపాం. ఒక్కసారిమాత్రమే నేను నికొలోస్కా వెళ్ళి రెండు నెలలపాటు ఉండివచ్చాను. ఆ మూడో సంవత్సరం మేము మరింత దూరానికి పోయి "బేడెన్"లో గడిపాం.

నా కప్పటికి 21 సంవత్సరాలు. మా ఆర్థిక స్థోమత నాకు తెలసినంతవరకు సంతృప్తికరంగానే ఉంది. నా కుటుంబ జీవనం నాకు కావలసినదాని నంతా యిచ్చిందనే చెప్పాలి. ప్రతివ్యక్తి నన్ను ఆదరించి ప్రేమించేవారు. నా ఆరోగ్యం సరిగానే ఉంది. బేడెన్‌లో నాకంటె అందంగా అలంకరించుకొన్న సుందరాంగి మరెవ్వరూ లేదంటే అతిశయోక్తి కాదు. నేను స్ఫురద్రూపి నని నాకు బాగా తెలుసు. అచ్చటి వాతావరణంకూడ చాల నచ్చింది. ఆ సుందర నాగరికతా వాతావరణంలో నే నఖండమైన ఆనందాన్ని పొంద గల్గాను. క్లుప్తంగా చెప్పాలంటే నేను బేడెన్‌లో స్వర్గానందాన్ని పొందానన్నంత ఉత్సాహంగా ఉన్నాను. ఇంతకంటె ఎక్కువ ఆనందాన్ని నే నొకసారి నికోలోస్కాలో అనుభవించాను. అప్పుడు ఆ ఆనందమంతా నాలోనే ఉద్భవించింది. దానిని పొందడానికి నే నత్యంత సమర్థురాలనని, యింకా దీనికంటె అధికతరమైన సంతోషాన్ని పొందాలని అభిలషిస్తూ అర్రులు చాస్తూ కూర్చున్నాను. కాని ఆ పరిస్థితులు వేరు అనుకోండి. ఈ వేసవిలోకూడ నేను బాగానే గడిపానని చెప్పాలి. నా కిప్పుడేమీ ప్రత్యేక అభిలాషలు — ఆశలు

భేదా భయాలుగాని లేవు. నా జీవితం ఆహ్లాదంతో నిండి శోభిల్లుతోన్నట్లు పూర్తి మనశ్శాంతి చేకూరినట్లు తోచసాగాయి. ఈ ఋతువులో బేడెన్‌కు హాజరయిన ప్రేక్షకులలో ఫలానివారు మిగతావారికన్న మెచ్చుకోతగ్గ వారని చెప్పడానికి వీలు లేదు. ఆఖరకు మా ముదుసలి రాయబారితో కూడ ఎవర్నీ పోల్చలేం. 'క్రొపాట్కిన్ రాకుమారుడు' నాపై చూపిన శ్రద్ధాభక్తులను వర్ణింప నలవి కాదు.

ఒకరు యువకులు, మరొకరు వృద్ధులు, ఇంకొకరు అందమయిన ఆంగ్లేయుడు, వేరొకాయన ఫ్రెంచి దేశీయుడు సుందరమైన గడ్డాన్ని పెంచి, కళకళలాడే ముఖంతో హాజరయ్యేవాడు. ఇందులో ఎవరూ త్రోసి పారవేయవలసిన మనుష్యులు కారు. అందరూ నాకు ఒకలాగే కనిపించారు. దూరం చేయజాలని ఈ జట్టు నా పరిసర వాతావరణాని కెంతో శోభ చేకూర్చుతూ అత్యంత సంతోషప్రదాయకంగా చేసేవారు. ముఖ్యంగా వారందరిలోను పేర్కొనదగిన "ఇటాలియన్ ప్రభువు మార్క్విస్" ఒకాయన ఉన్నాడు. ఆయన సహేతుకమైన ధైర్య సాహ సాలతో మిగతావారికంటె అన్నివిషయాలలోను ప్రథమ శ్రేణిలో నిల బడగల వీరుడు. అనేకసార్లు నన్నాయన ప్రశంసించాడుకూడ. నాతో కలసి తిరగడాని కేకాస్త సావుకాశమున్నా దాని నాయన వినియోగించు కొనేవాడు. నాతో నృత్యానికి, గుర్రపు స్వారికి, వాహ్యాళికి, థియేటర్లకి, నేను వెళ్ళే ప్రతి ప్రదేశానికి నాతో హాజరై అస్తమానము నా సౌంద ర్యాన్ని పొగడేవాడు. నా బసచుట్టూ ఊరికే పనిలేకుండా ప్రదక్షిణాలు చేస్తూండడం చాలసార్లు నా కిటికీగుండా చూశాను. మిల మిలా మెరిసే అతని విశాల నయనాలనుండి వెలువడే తీక్ష్ణమైన చూపులు నన్ను అప్పు డప్పుడు బాధ పెట్టేవి. ముఖమంతా కంద ఎఱ్ఱబడిపోయేది. వెంటనే ముఖాన్ని వెనుకకు త్రిప్పేసేదాన్ని. అతడు నిజంగా యువకుడు, సుందరా కారుడు, కట్టుబాట్లతోగూడిన మంచి నడవడిక గలవాడు. అన్నిటికంటె

అధికమైనది ఆకర్షణీయమైనది అతని చిరునవ్వు. తీర్చి దిద్దిన కను బొమ్మల భావవైశద్యాన్ని చూస్తే అచ్చంగా నా భర్తను పోలినట్లు కన బడేవాడు. నిజానికి నా భర్తకంటె అతడే అందగాడనేది దాపరికం లేని మాట. అతని పొడుగాటి గడ్డం, అధరాలు, చూపులు చూస్తే వాటిల్లో పరుషత్వం, మొరటుతనం, కనిపిస్తున్నాయి. నా భర్తలోనుండే ప్రశాంతత, సౌకుమార్యం, మహోన్నతమైన స్వచ్ఛందత అతనిలో లేకపోయినా, నాపై అతనికున్న విపరీతమైన వెఱ్ఱి ఆపేక్షచే ఆకర్షింపబడ్డాను. నాపై జనించిన తీవ్ర ప్రణయావేశ క్లేశంతో అతడుకూడ బాధపడుతూన్నట్లు కనిపిస్తున్నాడు. అతన్నిచూస్తే ఒక్కొక్కప్పుడు జాలి, గర్వంకూడ కలిగేవి అతని నీ ప్రణయ మార్గంనుండి తప్పించి, ఉపశాంతి కలుగ జేసి, స్నేహ ధర్మ ధోరణికి తీసుకొని రావడానికి ప్రయత్నించసాగాను. దీని నతడు గ్రహించి ఒక విధమైన ఉద్రేకంతో లోనకాగుతూ, ఏ నిము షాన్నయినా పైకి ప్రాకి అంతా ఆవరించుకొంటాయా న్నట్లుండే మోహ జ్వాలలను నాపై ప్రసరింపచేసి నాకు మనస్థిమితం లేకుండా చేసేవాడు. నా కటువంటి అనుభూతి కలుగకపోయినా అతనంటే ఎందుకో భయం వేసేది. నా కిష్టం లేకపోయినా అప్పుడప్పు డతనిని గురించే ఆలోచించే దాన్ని. నా భర్తకూడ అతనిని బాగా ఎరుగును. మా యితర పరిచితు లందరికంటె అతనినే బాగా గౌరవిస్తూ, ఒక మాదిరిగా అతనినే 'నా భర్త'గా చూచేవారు — అతనిపై ఆయనకు నిర్దయ, నిర్లక్ష్యంకూడ ఉంటూండేవి.

ఆ ఋతువు చివరి రోజుల్లో నాకు జబ్బు చేసింది. 15 రోజులపాటు నే నింటిపట్టునే ఉండిపోవలసి వచ్చింది. నేను కొంచెం కోలుకొన్నాక ఒకనాటి సాయంత్రం నృత్యగానం వినడానికని సమాజానికి బయలు దేరాను. ఆనాటి విశేష మేమంటే, 'సర్వాతి సుందరి' అని పేరు గాంచిన స్మట్సు సతి అనే ఆంగ్లేయ యువతి సమాజానికి వచ్చింది. ఆవిడ రాక

కోసం చాలకాలంనుండి అందరూ వేచియున్నారు. ఆఖరి కామె. నేను అస్వస్థతగా నుండి సమాజానికి హాజరు కాలేని రోజుల్లో వచ్చింది. నేను సమాజ మందిరంలో కాలు పెట్టగానే నా చుట్టూ కొంతమంది చేరారు. అంతకంటె ఎక్కువగా ఆ నూతన సుందరస్త్రీ చుట్టూ మూగారు. ఆమె గుణ శీలాలను గురించి, ఆమె సౌందర్యాన్ని గురించి నా చుట్టుప్రక్కల వారు ప్రస్తావించసాగారు. నే నామెకేసి పరీక్షగా చూచాను. నిజంగా ఆమె చాల అందకత్తె. సందేహం లేదు. కాని ఆమె మనోగర్వం, అహం భావం చూసేసరికి అసహ్యం వేసింది. అంతవరకూ సమాజమంటే సమాజ కార్యకలాపాలంటే ఉండే ఆసక్తి, శ్రద్ధ, ఉత్సాహం నేటి సంఘటనతో నశించిపోయాయి. స్మట్సుసతి ఆ మరునాడు శిధిలావస్థలో నున్న కోటకు చిన్న వినోద యాత్రను ఏర్పరచింది. నన్నుకూడ రమ్మని కోరిందిగాని నే నామె ఆహ్వానాన్ని తిరస్కరించాను. మిగిలినవారు ఒక్కరూ మిగలకుండ ఆమెను అనుసరించారు. బేడెన్‌పై నాకున్న సదభిప్రాయాలన్నీ ఒక్కసారి పటాపంచ లయ్యాయి. ఈ విపరీతమైన మార్పుకి నేను చకితురాల నయ్యాను. అందరూ దద్దమ్మల్లాగ కనపడ సాగారు. అపరిమితమైన దుఃఖం వచ్చింది. వైద్య చికిత్సకూడ వదలి వేసి రష్యా వెళ్ళిపోదా మనుకున్నాను. ఏదో అసూయాభావం నాలో తల దాచుకొంది. అది ఏమిటో, ఎటువంటిదో యిప్పటికీ చెప్పలేను. జన సాంద్రత ఎక్కువగాఉండే సమావేశాలకు వేటికీ అనారోగ్య నెపంపై హాజరయ్యేదాన్ని కాదు. ఎప్పుడన్నా బయటకు వెళ్ళితే ప్రొద్దున్న పూట మాత్రం మంచినీరు తేవడానికి వెళ్ళేదాన్ని. మేరీ అనే రష్యన్‌స్త్రీ నాకు తోడుగా వస్తూండేది. అప్పుడప్పుడామెతో సాయంసమయాల్లో వాహ్యాళికి కూడ వెళ్లేదాన్ని. నా భర్త ఏదో పనిమీద "హీడెల్‌బర్గు" వెళ్ళుతూ నా చికిత్స పూర్తి కాగానే రష్యా వెళ్ళిపోదామని నాతో చెప్పి వెళ్ళారు. అప్పుడప్పుడు బేడెకా వచ్చి నన్ను చూచి వేళ్లేవారు.

మరొకరోజు స్మట్సుసతి వేటకని అందరినీ లాక్కొనిపోయింది.

నేను, మేరీ ఆ సాయంత్రం కోటకు షికారు బయలుదేరాం. మా బండి రహదారి కిరుపార్శ్వాలా ఉన్న పురాతనమైన జీడి చెట్లగుండా, బేడెన్ చుట్టూ మన్న సుందరాతి సుందర ప్రకృతిగుండా నెమ్మదిగా నడక సాగిస్తోంది. ఏమేమో సంభాషించుకొంటూ మేము కదలిపోతున్నాం. సూర్యు డస్తమించాడు. అరుణ కాంతు లింకా పూర్తిగా అదృశ్య మవ లేదు. మా సంభాషణ ఇదివరలో ఎప్పుడూ సాగనంత తీవ్ర ధోరణిలో జోరుగా సాగుతోంది. మేరీని నేను చాలకాలంనుంచీ ఎరుగుదును. కాని నేడామె యెంతో విజ్ఞానవతిగా, వివేకవతిగా నూత్న వికాసంతో శోభిల్లుతూన్నట్లు కనబడింది. ఆమె దగ్గరేమీ దాపరికం లేకుండా అన్నీ సూటిగా చర్చించాలన్న భావం. ఆమె మిత్రత్వాన్ని యెల్లకాలం పొందాలనే పూజ్య భావం, కల్గాయి. మా అంతరంగిక విషయాలను గూర్చి, పిల్లలను గూర్చి, బేడెన్‌లోని విస్పారమైన జీవిత సరళిని గూర్చి చర్చించాక మా దృష్టులు, కోరికలు రష్యాదేశం పైకి, అచ్చటి ప్రజలకేసి, వారి పల్లె జీవిత విధానంవైపు పోయాయి. కోటలోనికి ప్రవేశించాము. లోన చల్లని అమృత ప్రాయమైన నీడ ఉంది. సూర్యాస్తమయపు ఎఱ్ఱని కాంతు లా శిధిలాలపై పడితే శిధిలావస్థలోనున్న వాటికికూడ నూతన శోభ చేకూరింది. ఇంతట్లో ఏదో అడుగుల చప్పుడు ఎవరో మాట్లాడుతూన్న ధ్వని మాకు వినవచ్చాయి. ఆనాటి వాతావరణం, ప్రకృతి యెంతో రమణీయంగా ఉన్నమాట వాస్తవమే. అయినా మా రష్యన్ నేత్రాల కది సామాన్యంగానే ఉందిగాని ఏమంత ఎక్కువగా లేదు. మా కెదురుగా పెద్ద ద్వారబంధ మొకటుంది. మేము ప్రశాంతంగా కూర్చొని సూర్యాస్తమయపు సొగసును తిలకిస్తున్నాము. ఆ కంఠ ధ్వనులు క్రమ క్రమంగా పెద్దవి కాజొచ్చాయి. ఎవరో నా పేరును తలపెట్టినట్లు వినవచ్చింది. ఆ సంభాషణంతా జాగ్రత్తగా వినసాగాను. ఆ కంఠాలనుకూడ గుర్తు పట్టాను. అందులో ఒకటి ఇటాలియన్ ప్రభువు మార్క్విస్‌ది.

రెండవది ఫ్రెంచి స్నేహితునిది. వారిద్దరూ నన్ను గురించి, స్మట్సుసతిని గురించి చర్చిస్తున్నారు. సౌందర్యానికి ప్రత్యక్ష ప్రతికతులుగా విలచామని ఫ్రెంచి స్నేహితుడు చెపుతూండేసరికి నా నాడులు తీవ్రంగా కొట్టుకో సాగాయి. సావధానంగా మా యిద్దరి గుణ గణాలను ఉల్లేఖిస్తున్నాడు. నే నప్పుడే ఒక బిడ్డతల్లినని, స్మట్సు సతికి 19 సంవత్సరాలేనని, నాశిరోజాల సొగసు నాఅందానికి దోహదమిస్తూన్నప్పటికి, స్మట్సుసతిది సుందరమైన విగ్రహమని, అన్నివిధాల తరచిచూస్తే ఆమె మిక్కిలి సౌందర్యసంపదగల ప్రౌఢయువతి అని నన్ను గురించి ఎక్కువగా చెప్పతగ్గదేమీ లేదనీ, యితర రష్యన్ రాకుమార్తె లున్నట్లే ఉన్నానని, ఈ మధ్య ఈ తరహా మనుష్యులను తా మిక్కడ ఎక్కువగనే చూస్తు న్నామని చెప్పి, స్మట్సు సతితో ఎక్కువగా పోటీచేయకుండా దూరంగా నిలబడడంవల్ల నేను చాల తెలివయిన పని చేశానని లేకపోతే స్మట్సు సతి సౌందర్యాతిశయం ముందు బేడెన్‌లో నేను, నా అందం, పూర్తిగా దిగదుడుపయే వాళ్ళమేనని అన్నాడు.

"ఆవిడను చూస్తే నాకు జాలి పుడుతోంది. నీ యందామె ప్రత్యే కత వహించి, నీతో తృప్తిపడి ఉంటే నయం" అన్నాడు ఫ్రెంచి యువ కుడు గంభీరంగా.

"ఆమె యిక్కడనుండి వెళ్ళిపోతే నేనామెను తప్పకుండా వెంటాడుతాను —" ఈ మాటలు ఇటాలియన్ వాగ్ధోరణిలో వెలువడ్డాయి.

"నిత్యానంద పురుషుడవు నీవు! నీ కింకా కామోద్రేకం తగ్గలేద న్నాడు ఫ్రెంచి స్నేహితు డికిలిస్తూ.

"కామం!" అని ఆశ్చర్యంగా రెట్టిస్తూ "అది నాకు చాల అవు సరం. అదిలేనిదే నేను జీవించలేను. జీవితాన్ని ప్రేమపూరితం చేసి సుఖ మయంగా చేసుకోవడం ప్రతీవారు వాంఛించ దగినది. చేసుకోతగ్గదీను. ఈ విషయంలో నా పవిత్రప్రేమ నన్ను మధ్యస్తంలోముంచి మోసగించ

లేదు. దానిని కొనసకంటా తీసుకొని వెడతాను" అన్నాడు ఇటాలియన్ ప్రభువు మార్క్విస్.

"నీకు శుభ మగు గాక ! " అని దీవించాడు ఫ్రెంచి స్నేహితుడు.

కొంచెం సేపటివరకు వారి మాటలేవీ మాకు వినపడ లేదు. మెట్లుదాటి వస్తూన్నట్లు శబ్దం వినపడింది. మరికొన్ని నిముషాలకు పక్క ద్వారంగుండా మే మున్నచోటికి వచ్చి నిలబడి మమ్మిద్దర్నీ చూచి చకితు లయ్యారు. మార్క్విస్‌ను చూస్తే నా రక్తం ఉవ్పొంగింది. వెనువెంటనే భయంకూడ వేసింది. కోటదాటి అంతా బయటకు వచ్చాం. తన చేతిని నా కందించా డతడు. నేను తృణీకరించ లేకపోయాను. బండి విడచి మేము చాల దూరం పోతున్నాం. మా వెనకాల నెమ్మదిగా మేరీ, ఫ్రెంచి మిత్రుడు కలసి వస్తున్నారు.

ఫ్రెంచి స్నేహితుని మాటలకు నాకు చాల చిన్నతనమైంది. వాస్తవాని కవన్నీ నే నిదివరలో అనుకొన్న భావాలే ! వాటినే మాటల రూపంలో అతడు వక్కాణించాడు. మార్క్విస్ కల్ల కపటాలు, దాప రికం ఏమీ లేకుండా తన ఉద్దేశాన్ని ధైర్యంగా వెలిబుచ్చిన పద్ధతిని చూస్తే నాకు ఆశ్చర్యం, కలవరం కల్గాయి. అతని ఆలోచన నన్నెంతో బాధ పెట్టింది. యిదివరలో యెన్నిసార్లు త్రోసిబుచ్చినా చలించక, భయ మనేదిలేకుండా నాకు మరింతదగ్గరగా వస్తూంటే, ఆతనంటే అసహ్యం వేస్తోంది. చేయి విదళించికొని, అత డడిగేవాటి కేమీ సమాధానం చెప్ప కుండా వడివడిగా ముందుకు నడిచి పోతున్నాను. నా ఆకస్మిక దర్శనం గురించి, నాపై తనకు గల సదభిప్రాయాన్ని గురించి ఏమిటేమిటో వాగుతున్నాడు. నే నవి వినిపించుకోవడం లేదు. నా ఆలోచనలన్నీ నా భర్తపై నా బిడ్డపై, మా గ్రామంపై లగ్నమయియున్నాయి. నా నడవడిని చూస్తే నాకే అసహ్యంగాను, సిగ్గుగానుఉంది. మా బసకు ఎంత త్వరితంగా పోయి, నా ఏకాంత మందిరంలో ఎప్పుడు వ్రాలుదామా అని

నాకు హడావుడిగా ఉంది. అక్కడ తీరుబడిగా మనోవీధిలో చెలరేగిన తుపానును గురించి ఆలోచిద్దామను కొన్నాను. మేరీ అతినెమ్మదిగా నడుస్తోంది. నాకు, బండికిమధ్య చాలదూరం ఉంది. నాతోవస్తూన్న మనిషింకా తన విపరీత భావప్రేరేపణలోపడి తీవ్రంగా కొట్టుకొంటూ, ఆప్రయత్నాలలోనే ఉన్నట్లు కనిపిస్తున్నాడు. నన్ను బలవంతాన విలిపి వేయాలని చూస్తున్నట్లున్నాడు "అలాంటి పిచ్చిపిచ్చి పనులు ప్రయత్నా లేమీ సాగనివ్వను" అని నాలో దృఢాభిప్రాయాల నేర్పరుచుకొంటు న్నానేగాని, అంతకంతకు తొట్రుపాటెక్కువై పోతూంది. అంతాగతజల సేతుబంధనమయింది. బాహ్యప్రపంచం లోనికివచ్చి చూచేసరికి అత నప్పుడే నాచేయిపట్టుకొని గట్టిగా నొక్కుతున్నాడు. మేరీ మరొక మూలకు తప్పుకొంది మేమిద్దరమే మిగిలిపోయాం. నాకు భయం వేసింది. "నన్ను క్షమించు" అని నెమ్మదిగా అంటూ నాచెయ్యిని వదలించుకోడానికి గట్టిగా ప్రయత్నించాను. కాని నా లేసుకొంగు అతని కోటుబొత్తానికి తగులుకుంది. నామీదికివంగుతూ దానిని తీయబోయాడు అతనిచేయి నాకు తగిలింది. ఆస్పర్శతో నాలో సగం భయం, సగం ఆనందం, ఏదోవింతానుభూతి ఒక్కసారి కల్గాయి. నాశరీరమంతా పులక రింపులతో వణకిపోసాగింది. అతని దుశ్చర్య నాకెంత ఏవగింపు కల్గిం చినదీ తెల్పడానికి అతనికేసి చురచురా చూడాలనుకొన్నాను. కాని చూపు భయోత్సాహోద్రేకాలను మాత్రమే వ్యక్తపర్చ కల్గింది. అతనికండ్లు ఆనందబాష్పాలతో చెమ్మగిల్లాయి. తీక్షణంగా నాముఖంకేసి, మెడకేసి, వక్షస్థలంకేసి చూస్తున్నాడు. "నిన్ను నేనెంతో ప్రేమిస్తున్నాను. నీవే నా సర్వం" అని ఏమేమో ప్రేలుతూ, దూరంగాఉన్న అతని అధరాలు నన్ను సమీపిస్తున్నాయి. నాముంజేయిచుట్టూ ఏవోరెండుచేతులు వచ్చి చుట్టుకొన్నాయి. ఆతర్వాత నన్నెవరో గట్టిగా, మరింత గట్టిగా నొక్కుతూ, ఒత్తుతూ కౌగలించు కొంటూన్నట్లు కనబడుతోంది. ఏదో

జ్వర తీవ్రత నానాడులగుండా శరీరమంతా ప్రాకుతూన్నట్లు గ్రహించాను. నాదృష్టి నన్నగిల్లింది. హేయమైన అతని అక్రమచర్యలను విరోధించ డానికి ఏదో ఘాటుగా చెప్పాలని నోరు మెదిపాను కాని అవణుకులో నామాటలు నాకంఠంలోనే అంతరించిపోయాయి. అకస్మాత్తుగా నాబుగ్గ పై ఒకముద్దు రాలింది నావణుకు చల్లారిపోయింది. విటూరుగా నిలబడి దృష్టి నిగుడించి అతనికేసి చూశాను. భయవిహ్వల చిత్తంతో దేవిని ఆహ్వానిస్తూ అలా చలనంలేకుండా నిర్జీవ ప్రతిమలాగ నిలబడిపోయానో నాకే తెలియదు. అదంతా ఒక్క నిముషంలో జరిగిపోయింది! ఆ ఒక్క నిముషం భరింపడానికి శక్యం కాలేదు. అకాస్తవ్యవధిలోను అతని నిజస్వరూపాన్ని ఉన్నదున్నట్లు చూశాను. గడ్డిటోపీ క్రిందిభాగాన ఉన్న విశాలమైన ఫాలభాగం. (నాభర్త ఫాలభాగంకూడా అచ్చంగా అలాగే ఉంటుంది) సంపంగిపూవులాంటి ముద్దొచ్చే అతని తిన్నని ముక్కు. విస్తరించిన నాశికారంధ్రాలు. ఒత్తుగాపెరిగిన పొడుగాటి మీసాలు. చిన్నగడ్డం. చక్కగా క్షౌరంచేసికొన్న నున్నటిబుగ్గలు. ఎండ వేడిమికి ఎఱ్ఱబారిన కంఠం. అన్నీ పరీక్షగా చూశాను. అతనంటే అస హ్యం. భయం రెండుకూడ కల్గాయి నాకు. పూర్తిగా సమ్మతం కాని ఒక పరాయి పురుషుడు నాహృదయంలో హేయమైన కామోద్రేకాన్ని తీవ్రంగా రెచ్చకొట్టాడు. ఆసుందరమైన మోటుమనిషి వదనంపై యెన్ని ముద్దులన్నా ఏమీ అడ్డుచెప్పకుండా నేనే వర్షిద్దామను కొన్నాను. ఆతెల్లటి సుకుమార హస్తాల ఒత్తిడిలో నలిగిపోదామనుకొన్నాను. హఠాత్తుగా, తలవని తలంపుగా నాముందు తెరచబడిన ఈ నీచాతి నీచ మైన అఖాతంలోనికి, ఆనందంకోసం నన్ను నేనే త్రోసుకోవాలని వాంఛించాను.

"ఇప్పటికే నాహృదిలో అశాంతి సంక్షోభం చెలరేగింది ఇంకా పెద్దపెట్టున. అసంఖ్యాకంగా ఈ అశాంతి తుపానులు. విచ్చలవిడిగా.

నా హృదయంలో శ్రద్ధలు కావాల" ని నేను కోరు కొంటూన్నట్లు తోచింది.

నా నడుంచుట్టూ తనచేయిపోనిచ్చి. తన ముఖాన్ని నాముఖం మీదికి వంచుతున్నాడాతడు 'మంచిది అలాగే కానీయి! ఇంకా మిగిలిన సమస్త పాపకర్మలు అవమానాలు నాపై కుప్పలుగా కురిసి, నన్ను లోతుగా పాతిపెట్టెయ్యాలి' అని కోరుకోసాగాను.

"నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను" అని ఏమేమో గొణుగుతూనే ఉన్నాడాతడు. ఆధ్వని అచ్చంగా, నాభర్త కంఠస్వరాన్ని పోలిఉంది. ఒకప్పుడెంతో అమూల్యవ్యక్తిగా కనబడ్డ నాభర్త, నాచంటి బిడ్డ, నాజీవితావధినుండి బయటపడ్డట్టు కనబడసాగారు. ఈవ్యవస్థలో మేరికేక వినబడింది. అటుమూలనుంచి పెద్దగా పిలుస్తోందామె. ఆ పిలుపుతో నేను బాహ్యప్రపంచంలోనికి వచ్చాను. అతని వంకయినా చూడకుండా, ఒక్కసారి చేతిని విదళించుకొని, ఆమె దగ్గరకు పరుగు తీసాను. బండిలోకూర్చున్నాక మాత్రం వెనుతిరిగి అతనికేసి ఒక్కసారి చూశాను. చిరునవ్వుతో టోపీసర్దుకొంటూ, 'మనం రోజు రహస్యంగా కలుసుకోడానికొక ప్రదేశాన్ని ఏర్పరచు కొందామా?' అని ప్రశ్నార్ధకంగా చూస్తూన్నట్లు, నాకేసి చూదాడు. ఆక్షణంలో అతనంటే నాకెటువంటి హేయమైన అభిప్రాయం ఏర్పడిందో అతనికేమీ అర్ధమయినట్లులేదు.

ఆలోచించి చూడగా భూతకాలమంతా అంధకారకూపంలో గడచిపోయినట్లు, ప్రస్తుతం నాజీవితమంతా పాపభూయిష్టంగా కొట్టుకొనిపోతూన్నట్లు, భావినిస్సహాయంగా ఉన్నట్లు తోచింది. మేరీ ఏదో మాట్లాడుతోందిగాని, ఆమాటలభావం నాకేమీ బోధపడలేదు. నాస్థితికి జాలిపడి ఉపశాంతిమాటలేవో చెపుతోందను కొన్నాను. నాపై ఆమెకు కల్గిన నీచభావాన్ని కప్పుచూస్తోందని భావించాను. ఆమె పలికే ప్రతి

పలుకులోను చూచే ప్రతిఒక్క చూపులోను ఈ హేయభావం, అవమాన ప్రదీప్తమైన జాలి నాకు కనబడుతున్నాయి. ఆపాదుముద్దుతో పొందిన అవమానం నాశరీరాన్నంతటినీ దహించి వేస్తోంది. నాభర్త జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఆబాధను మరింత ఓర్చుకోలేకపోతున్నాను. ఈ నా దీన స్థితిని గురించి, గదిలో ఒంటరిగా సింహావలోకనం చేసికొనడానికి ప్రయత్నించాను. ఒంటరిగా ఉండడానికికెంతో భయంవేసింది. నాచేష్ట లేమీ నిలకడగా నిలుచుటలేదు. నాకొఱకై తేబడిన తేనీటిని ముట్టనేలేదు. హీడెల్‌బర్గులోనున్న నాభర్తను వెంటనేకలసికోవాలనే ఆరాటం బయలు దేరింది. ఆసాయంత్రమే బయలుదేరాలని నిశ్చయించుకొని హడావుడిగా ప్రయాణానికి తయారయ్యాను.

ఖాలీగానున్న రైలుపెట్టెలో నేను, నాదాసి ప్రవేశించాం. రైలు కదిలింది. గవాక్షంగుండా చల్లనిగాలి నాముఖంమీదికి వీస్తోంది. వేదనా పూరితమైన మనస్సును మరొకసారి దీక్షగా లగ్నపరచి, పాతజీవిత సంఘటలు స్మరించుకొంటూ భవిష్యజ్జీవితాన్నిగురించి ఏమేమో చిత్రించు కొంటున్నాను. పెండ్లిఅయిన క్రొత్తలో మాదాంపత్య జీవనం, అటు తర్వాత మేము ప్రథమపర్యాయం పీటర్సుబర్గు దర్శించినప్పటినుండి గడిపిన సంయుక్త జీవనం, నాకొక నూతనవికాసాన్ని కలుగజేసాయి. కాని అవే యిప్పుడు నామనో ఫలకంపై నింద్యమైన, ఒక మాయని మచ్చను చేసాయి. నికోల్‌స్కోనుండి మేము బయలు దేరడం, భావి జీవితానికి మేము వేసిన పథకాలు, ఒక్కొక్కటే జ్ఞప్తికి తెచ్చుకో సాగాను. మొట్టమొదటసారిగా 'పెండ్లిఅయిన రోజునుండి నేటివరకు నా వల్ల నాభర్త ఏమయినా ఆనందాన్నిగాని, సుఖాన్నిగాని, పొంద గల్గారా ?' అని నన్ను నేను ప్రశ్నించుకొన్నాను ఆయనపట్ల చాల చెడ్డగా ప్రవర్తిస్తున్నాననికూడా గుర్తించాను 'కాని ఎంగుచేత అలా ప్రవర్తింపవలసి వస్తోంది ?' అని మళ్ళీ ప్రశ్నించుకొన్నాను. 'చెడుదారి

నుండి నన్నాయనెందుకు మళ్ళించలేదు? ఎందుకు కపటనాటకమాడాలి? తనభావాలేవీ విపులంగా విడమర్చి చెప్పకుండా అన్నీ తనలోనే దాచుకో వలసిన అగత్యమేమివచ్చింది? ఆయన తన పవిత్రప్రేమ ప్రభావంచే నన్నెందుకు ఆకర్షించలేకపోయారు? అసలాయన నన్ను త్రికరణ శుద్ధిగా ప్రేమిస్తున్నారా? లేదా?' ఈలాంటి ప్రశ్నలేన్నో నామనోవీధి లోకి వచ్చిపడ్డాయి. ఆయన నిందార్హులయినా కాకపోయినా, ఆనూతన వ్యక్తి నాబుగ్గపై పెట్టుకొన్న ముద్దుమాత్రం నాకింకా జ్ఞాపకం వస్తూనే ఉంది. హీడెల్‌బర్గు సమీపమయ్యేకొద్దీ నాభర్త ముఖచిత్రం మరింత విస్పష్టంగా నాకళ్ళముందు తేలియాడ సాగింది. మాయిద్దరి సమాగమ మంటే నాకింకా భయంవేసింది. 'ఆయనతో జరిగినగాధ యావత్తుచెప్పి పశ్చాత్తాపంతో, అశ్రుబిందువులతో అంతటినీ తుడిచి పారేస్తాను. ఆయన నన్ను తప్పక క్షమిస్తారు' అని నాభావపోకడలు. కాని ఆ "గాధ" ఏమిటో నాకే తెలియదు. మళ్ళీ వెనువెంటనే ఆయన క్షమిస్తారనే నమ్మ కం లేకపోయింది.

నేను నాభర్తగదిలోనికి ప్రవేశించగనే ఆయన నాకేసి శాంత ప్రసన్నమైన వుత్సుకదృష్టితో చూచారు. వెంటనే ఆయనతో చెప్పదగ్గ దేమీ నాదగ్గరలేనట్లు తోచింది. ఆయన్ని క్షమార్పణ కోరడానికి నేనేమీ తప్పుచేయలేదని భావించి నేపొందుతున్న చెప్పనలవికాని దుఃఖాన్ని పశ్చాత్తాపాన్ని, నాలోపలనే దాచుకొన్నాను.

"ఇక్కడికి రావాలన్న ఆలోచన నీబుర్రలో ఏలాప్రవేశించింది? నేను రేపే బేడెజా రావాలని అనుకొంటున్నాను" అని చెప్తూ నావై పొకసారి ఆశ్చర్యంగా తీక్షణంగా చూచి "అసలేమి జరిగింది? నీకేమీ ఆపద సంభవించలేదుకదా?" అని తిరిగి ప్రశ్నించారు.

పైకి వ్యక్తంకాని దుఃఖలో క్రుంగిపోతూ "ఏమీలేదు" అని ఆరంభించి "నేనుమళ్ళీ అక్కడికి వెళ్ళను. మనం రేపే రష్యా వెళ్ళ

పోదాం". అన్నాను కొంతసేపటివరకు ఆయనేమీ మాట్లాడలేదు కాని నావైపు ఏకధాటిగా చూస్తూనే ఉన్నారు. "అసలు నీకేమి జరిగిందో చెప్పుముందర" అని మళ్ళీ అడిగారు.

అప్రయత్నంగా సిగ్గుతో నాతల క్రిందికి దించుకొని పోయింది. దానితో అసంతృప్తిజ్వాలలు అహంకార జ్వాలలు ఒక్కసారి ఆయన కండ్లల్లో మెరసాయి.

# అధ్యాయం 9.

ఇంతవరకు మానవసంచలనములేని మానికోలోస్కా గృహంలో మరల క్రొత్త జీవనం కలకలలాడుతూ ప్రవేశించింది. కాని యిదివర కంతటి అమితానందమైన జీవిత మాధుర్యం మచ్చునకైనా దొరకకుండా మాయమైన సంగతి చెప్పకతప్పదు. మా అత్తగారు చనిపోయారు. అంత పెద్ద గృహంలో మే మిద్దరమే మిగిలిపోయాం. మా యిద్దరిమధ్య నుండే పూర్వపు సన్నిహిత స్నేహ సంబంధ బాంధవ్యాలు తిరిగి తలె త్తాలని వాంఛించుటమాట అటుంచండి. అసలా విషయాన్ని చర్చించడానికే చీదరగామండేది. ఆ చలికాలం నా అనారోగ్యంవల్ల మరింత నిస్సారంగా నిరుత్సాహంగా తరలిపోయింది. మా ద్వితీయ పుత్రుడు పుదయించేవాక నేను కోలుకోలేక పోయాను. పీటర్సుబర్గులో మా యిద్దరి జీవనం యేలా సాగిందో, యిక్కడకూడ అలాగే నడుస్తోంది. అంతేనేగాని మా సంబంధ బాంధవ్యాలలో క్రొత్తగా మార్పులేమీ రాలేదు. ఆ కలతలు అలాగే ఉండి పోయాయి. మా స్వగృహంలోని ప్రతిగోడ, సోఫా, ఒకప్పుడు ఆయన నాకెంత ఆప్యాయంగా, అనిర్వచనీయమైన, అవిభాజ్యమైన, అత్యవసర వ్యక్తిగా నుండేవారో మాటిమాటికి జ్ఞప్తికి తెస్తూ నేను పోగొట్టుకొన్న పవిత్రమైన, అమూల్యమైన ప్రేమను పదేపదే స్మరింప చేసుకొనేటట్లు చేసేవి. ఒకరియం దొకరికుండే స్నేహ సౌజన్యాలు చల్లబడ్డాయి. ఏదో మహోపద్రవమైన ఆపద సంభవించడం వల్ల క్షమింపరాని ఘోరమైన నేరమేదో చేసినందువల్ల మేమిద్దరం దూరం చేయబడ్డట్టు కనపడుతోంది. ఒకవైపునుంచి వన్నాయన దండిస్తూ తనకేమీ తెలియనట్లు నటిస్తూంచే నా కమితమైన బాధ కలిగేది. ఆయనను క్షమార్పణ కోరడానికి నే నేమీ తప్పుచేయలేదని, దండించవద్దని మొర పెట్టుకోవలసిన అవుసరమే లేదని నే నభిప్రాయపడ్డాను. మునపటి మాదిరిగా తన మనస్సుని నా ఆలోచన లతో లయపరచి, సన్నిహితంగా సంచరించుటలేదని పూర్తిగా తెలుసు.

కాని తన మనస్సు మరెవరిపైనాగాని, ఏ వస్తువపైగాని లగ్నపరచ లేదనే సంగతి విస్పష్టం. అసలు ఎవరికయినా యివ్వడాని కాయనకిప్పుడు హృదయమనేది ఉంటేనా? కేవలం నన్ను కష్టపెట్టడానికే అప్పుడప్పుడా మాదిరిగా ప్రవర్తిస్తూన్నప్పటికీ, పూర్వపు పవిత్ర ప్రేమ ఆయన శరీరమంతటా ప్రవహిస్తూన్నదని దానిని పైకి తెచ్చుకోవలసిన బాధ్యత నాదేనని ఊహించి పలుమార్లు ప్రయత్నించి విఫల మనోరథురాల నయ్యాను. విష్కపటమైన సంభాషణల నాయన సదా తప్పించడానికి ప్రయత్నిస్తున్నారని, ఎప్పుడు ఏ ఉద్రేక చిహ్నాలు తలయెత్తి పిచ్చిపనులకు చోటిస్తాయోనని భయపడుతూ, నిస్సందేహంగా నా శీలాన్ని అనుమానిస్తున్నారని, నేను త్వరగానే తెలిసికోగల్గాను. మొదట్లో ఆయన విష్కపటమైన మాటి సంభాషణలంటే నాకెంతో భయంగా ఉండేది. ఇప్పుడవన్నీ ఆయననుండి పూర్తిగా అదృశ్యమైపోయాయి. హఠాత్తుగా పోయి 'నన్ను మీ రనుమానించ వద్దు. నేను మిమ్మల్ని గాఢంగా ప్రేమిస్తూనే ఉన్నాను' అని చెప్పడానికిగాని, నాతో కలసి దైవప్రార్థనలు సాగించమని కోరడానికి గాని, లేదా నేను పియానోపై పాటలు పాడుతూంటే వినవలసినదిగా అర్థించడానికిగాని సావుకాశాలు దొరకడం దుర్భరమైపోయాయి. మా అన్యోన్య సంసర్గమంతా ఎవో నిర్దేశింపబడిన కొన్ని సత్కార్యకలాప కర్మకాండలతో నియమిత పద్ధతుల లోనికి తేబడింది. ఎవరికి వారం ప్రత్యేకంగా జీవించడం మొదలు పెట్టాం. నా సహాయ సానుభూతు లేమీ అవసరంలేని స్వంత వ్యవహారాలలో ఆయన మునిగి పోయేవారు. వాటిలో జోక్యం కలగచేసుకొని కొంత భారం మోయాలనే కోరికకూడ నాకు లేకపోయింది. పూర్వంలాగే నా నిర్వ్యాపార జీవనం నాకు సంక్రమించింది. కాని యిప్పు డిది మాటిమాటికి విచారాన్నిగాని, విసుగుదలను గాని, కల్గించుట లేదు. పోనీ మా యిద్దరి మధ్య త్రెంపజాలని ప్రేమపాశాలను పిల్లలిద్దరు అల్లుకొని పోతారనుకుంటే, వారింకా పసితనంలోనే ఉన్నారు.

గ్రీష్మన వసంతకాలం తిరిగి వచ్చింది. వేసవికాలమంతా మాతో కులాసాగా గడపడానికని కాట్యా, సోన్యా లు వచ్చారు. నికోలోస్కాలో ఉన్న యింటిని బాగు చేస్తూన్నందువల్ల మేమంతా పోక్రొవిస్కోలోని మా పాత యింటికి వెళ్ళాం. మా యిల్లు మార్పేమీ చెందలేదు — ఆ వరండా అందులోనున్న మడత బల్ల, నా పియానో ఉన్న ప్రాతఃకాల సమావేశ మందిరం, తెల్లటి లేసుతెరలతో శోభాయమానంగా అలరారే నా శయన మందిరం, బాల్యంలో నే విహరించిన ఉద్యాన వనాలు నేనక్కడ విడచి వెళ్ళినవన్నీ ఆలాగే ఉన్నట్లున్నాయి. నా గదిలో రెండు మంచాలున్నాయి. ఒకటి నాది. దానిపై పుష్టిగానున్న నా చిట్టితండ్రికొకోషా కాళ్ళు, చేతులు పారజాచుకొని నిద్రపోతున్నాడు. రాత్రి ప్రొద్దెక్కిన తర్వాత పిల్లలిద్దరిని సిలువతో ముట్టించిరావాలని గదిలోనికి వెళ్ళాను. ఉయ్యాలలోంచి నా చంటిబిడ్డ వాన్యా తొంగిచూస్తున్నాడు. నా పని అయిపోయినాకూడ, ఆ ప్రశాంత వాతావరణంలో గదిమధ్యన నిలబడి పిల్లలవంక చూస్తూ నిల బడిపోయేదాన్ని. మరచిపోయిన పాత గాధలు యవ్వనపు విపరీత చేష్టలు గది నలుమూలల నుండి, గది గోడలనుండి, తలుపు తెరలనుండి, ఒక్కు మ్మడిగా విజృంభించి, ఆ పాత స్వరాలను చిన్నతనంలో పాడిన పాటలను పాడేవి, ఆ స్వర్గీయ దృశ్యాలన్నీ యిప్పు డేమయినాయి? ఆ తీయని పాటలన్నీ యెక్కడి కెగిరిపోయాయి? దివ్యమైన ఆ మహోన్నత సన్ని వేశా లెప్పటికయినా తిరిగి వస్తాయా? అసందిగ్ధంగా, అల్లకల్లోలంగా నున్న స్వప్నాలన్నీ సత్యాలయ్యాయి. కాని తర్వాత అసత్యాలన్నీ అణగ ద్రొక్కబడ్డాయి. జీవితమంతా నిస్సంతోషంగా, నిస్సారంగా, నికృష్టంగా మారిపోయింది. మిగతా ప్రకృతంతా అలాగే మిగిలిపోయింది — కిటికీ గుండా కనుపించే మా ఉద్యానవనం, అందులో ఒత్తుగా పెరిగిన లేబచ్చిక దానిగుండా చిన్న కాలిబాట, ఆత్రోవ ప్రక్కనున్న బెంచి, కొంచెం దూరంగానున్న చిన్న కోనేరు, దాని సమీపంగానున్న చెట్ల ఆకుల్లో దాగు కొని కూసే కోయిల కూతలు, ఆ కోనేటిలో చక్కగా రెక్కలు విడిచిన

కలువలు, మా యింటిపైన ప్రకాశవంతంగా ప్రకాశించే చందమామ — అన్నీ పూర్వ మున్నట్లే ఉన్నా వాటిలో అగోచరమైన అఖండమైన మార్పులెన్నో ఉన్నాయి. ఇదివరలో నేను, కాట్యా చావడిలో ప్రశాంతంగా కూర్చొని ఆయన్ని గురించి ఎడతెగకుండా కబుర్లు చెప్పుకొనే వారం. కాట్యా ముసలిదైపోయింది. ముఖమంతా ముడతలు పడిపోయాయి. ఇదివరలోవలె కండ్లు, సంతోషంతో క్రొత్త క్రొత్త ఆశలతో మెరయుట లేదు. ఏదో విచారాన్ని సానుభూతిని, పశ్చాత్తాపాన్ని వ్యక్త పరుస్తున్నాయి. మరల మే మిద్దరం సమావేశమయ్యాం. ఆనంద పరవశతను చేకూర్చు సంఘటనలను గూర్చి మే మిప్పుడు చర్చించలేదు. ఎంతసేపూ ఆయన్ని విమర్శించి, తీర్పు లివ్వడంలోనే సరిపోయింది. మేము ఊహించే అమర సౌఖ్యాన్ని పొందడానికి ఘనకార్యా లేమి చేశామాయన్న ఆలోచనే లేదు మాకు. పోనీ మా ఆలోచనలను, అభిప్రాయాలను, చేసిన తీర్పులను ప్రపంచానికి బహిర్గతం చేయవలసిన అత్యవసర మేమిటోకూడ మా దృష్టికి రాలేదు. "కాదు!" అని మే మిద్దరం ఒకేసారి కుట్రదారుల్లాగ ఏమేమో గొణిగాం. ఇంత దుఃఖమయంగా మారడానికి గల కారణా లేమిటని వెయ్యిసార్లు ప్రశ్నించుకొన్నాం. కాని ఆయనలో మార్పేమీ లేదు. ఇదివరకటి మనిషే! లోతుగా, ప్రస్ఫుటంగా కనబడే ఆయన నుదుటిపై గీతలు, తెల్లగా నెరసిపోయిన కనుబొమ్మలు, తీక్ష్ణమైన చూపులు — ఇవన్నీ సదా నా కళ్ళముందు మబ్బుతెరలలాగ తరలిపోతున్నాయి. నేనూ పూర్వపు స్త్రీనే! కాని నాలో ప్రేమనే పదార్థ మిప్పుడు లేదు. ప్రేమించాలనే కోరికా లేదు. ఏ పని చేయడానికి కుతూహలం, ఆసక్తి రెండూ లేకుండా పోయాయి. సహనం, సంతృప్తి సమూలంగా నశించిపోయాయి.

నా భర్తపైనుండే ప్రేమ, వెనుకటి జీవితంలో వుండే ఆనందోత్సాహోద్రేకాలు — ఇవన్నీ కంటికి కనపడకుండా కేవలం కలలోని దృశ్యాల మాదిరిగా అయిపోయాయి. ఒకప్పుడు నాకు యితరుల సౌఖ్యం

కోసం, ఆనందంకోసం జీవించడమే నా పరమావధిగా కనపడింది. అదే సరియైన మార్గమని, అదే నా కత్యంత సంతోషాన్ని కలుగచేసేదిగా తోచింది. అప్పుడా భావాలన్నీ పట్టి తెలివితక్కువవని నిర్ధారణ చేసుకొన్నాను. జీవితంలో ఏ ఒక్కరిపైన ఆకర్షణ లేనప్పుడు యితరుల కోసమని జీవించడం మూర్ఖత్వం కాదా? పీటర్సుబర్గులో కాలుపెట్టడం నా సంగీతానికి స్వస్తివాచకం చదవడం రెండూ ఒకేసారి జరిగాయి. ఇప్పుడు నా పియానోను చూడగనే మరల పాటలు పాడాలనే కోరిక బయలుదేరింది.

ఒక రోజున నా వంట్లో బాగుండనందున నేను యింట్లోనే ఉండి పోయాను. నికోలోస్కాలోని నూతన భవనాలను చూడడానికని నా భర్త కాట్యా, సోన్యాలతో వెళ్ళారు. క్రిందకుపోయి, వాళ్ళకోసం నిరీక్షిస్తూ పియానో దగ్గర కూర్చున్నారు. వెన్నెలనుగూర్చి పాడడం ప్రారంభించాను. చూపుదూరంలో ఎవరూ లేరు. వాతావరణం చాల ప్రశాంతంగా వుంది. తోటవైపు తలుపులన్నీ తెరువబడి ఉన్నాయి ఈ నిశ్శబ్ద నీరవాన్నుండి ఏదో పరిచితమైన ధ్వని వచ్చింది. ఆతృతతో చుట్టుప్రక్కలంతా కలయచూస్తూ, సామాన్యంగా నేను పాడేటప్పుడు ఆయన కూర్చుండే మూలవైపు కూడ చూశాను. కాని అక్కడెవరూ లేరు. ఆ స్థలంలో చలనం లేని కుర్చీమాత్రం ఉంది. కిటికీలోనుంచి చూస్తే సూర్యాస్తమయపు అరుణకాంతుల శోభలో, సన్నజాజిపువ్వుల పొద ప్రకాశిస్తోంది. సుగంధ పరిమళ పవనాలు నా నాశికారంధ్రాలను సోకుతున్నాయి. మోచేతులను రెండింటిని పియానోపై ఆనించి, అరచేతులతో నా ముఖం కప్పుకొని చాలసేపు కూర్చున్నాను. ఏదో ఆలోచిస్తూ గతించిన గతాన్నెంతో బాధతో జ్ఞప్తికి తెచ్చుకొన్నాను. భావిని గురించి ఆలోచించడానికే భయం వేసింది. నా కింక భవిష్యత్తు లేనట్లు, ఏ విధమైన ఆశలు, కోరికలు లేనట్లు కనబడ సాగింది. 'నా జీవిత మింతటితో అంతరించినట్లేనా?'

అని వణుకుతూ నన్ను నే నొకసారి ప్రశ్నించుకొన్నాను. తల పైకెత్తి వెనుకటి దానినంతా ఒక్కసారి మరిచిపోవాలని ముందు జీవితాన్ని గురించి ఆలోచించ కూడదని నిశ్చయించుకొన్నాను. పాడిన పదాన్నే పదేపదే నాకు తెలియకుండా పాడేస్తున్నాను. "ఓ ప్రభూ! నే నేమయినా పాపం చేసినట్లయితే క్షమించు. మరల ఆనందమయ జీవితం పొందాలంటే నేనే యే మార్గాలలో పోవాలో నాకు ప్రబోధించి ఆత్మశాంతి చేకూర్చవా మహాప్రభూ"అని పరమేశ్వరుని ప్రార్థించారు. ఇంటిముందు మెట్లనుండి పచ్చగడ్డిగుండా ఎవరో వస్తూన్నట్లు శబ్దం వినవచ్చింది. ఆ ధ్వని చాల పరిచితమైనదిగానే ఉంది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలాపి జాగ్రత్తగా విన్నాను. వరండా దాక వచ్చి ఆ ధ్వని ఆగిపోయింది. ఆ ధ్వనికి నా హృదయమేమీ చలించ లేదు. నేను పాట ఆపేశాను. అడుగుల చప్పుడు నా వెనుకనుండి క్రమక్రమంగా నన్ను సమీపిస్తోంది. హఠాత్తుగా ఎవరిదో చెయ్యి నా భుజంపై పడింది.

"ఎంత తెలివయినదానివి! ఆ పాట పాడడానికే సమకట్టావూ?" అన్నారాయన. నే నేమీ మాట్లాడలేదు. "టీ త్రాగావా?" అని తిరిగి ప్రశ్నించారు. ఆయనకేసి చూడకుండా తల పంకించాను. నా ముఖంలో కనబడే ఉద్రేక ఛ్ఛాయలను చూడనివ్వకూడదని నా ప్రయత్నం. "వెధవ గుర్రం దారిలో మారంచేసింది. వాళ్ళు నెమ్మదిగా నడచి వస్తున్నారు" అని జరిగిన గాథను వివరంగా చెప్పారు.

"అయితే వాళ్ళు వచ్చేదాక ఆగుదాం" అని వరండా నుంచి బయటకు వెళ్ళాను. నా వెనుక ఆయనకూడ వస్తారనే ఆశతో. కాని పిల్లలెలా ఉన్నారని అడుగుతూ వారిని చూడడానికని పైకి వెళ్ళారు. ఆయన సరళతను చూచి మృదు మధురమైన కంఠస్వరం వినడంతోటే, అసలు నే నేమయినా పోగొట్టుకొన్నానా అని సందేహం కలిగింది. ఇంతకంటె నేను వాంఛించే దేమిటి? ఆయన చాల సుస్వభావులు, కరుణా

మయులు. అంతేకాదు, యింతకంటె మంచి భర్త, మంచి తండ్రి ఉంటారా? మరయితే అధికంగా నేను కోరేదేమిటో నాకే అర్థం కావడం లేదు. కాలిబాట ప్రక్కనున్న బెంచిపై కూర్చుండి మే మిదివరలో కులాసాగా కబుర్లు చెప్పుకొనేవారం. ఇప్పుడుకూడ అక్కడే కూర్చుని ఆలోచించడం సాగించాను. సూర్యు డస్తమించాడు. మునిచీకటి పడుతోంది. శ్రావణ మాసపు వర్షమేఘాలు యింటిపైన తోటపైన ఆవరించాయి. చెట్ల వెనకాల కనపడే దిక్చక్రంమాత్రం స్పష్టంగా ఉంది. మాసిపోయే సంధ్యకాంతిలో ఒక తారమాత్రం మిణుకు మిణుకుమంటూ ప్రకాశిస్తోంది. ప్రకృతంతా మేఘాలచే కప్పబడి నీటితుంపరకొరకు వేచియున్నట్లుంది. గాలి స్తంభించిపోయింది. ఒక్క ఆకయినా కదలడం లేదు. సన్నజాజి, అశోక పుష్పాల సుగంధ సౌరభ ప్రభావం తోటను, యింటినికూడ ఆవరించుకొంది. గాలి యావత్తు ఆ పుష్పాలలోనే దాగుకొన్నట్లుంది. ఘాటుగా సువాసనలు అలలు మాదిరిగా ఒక్కొక్కసారి మరీ యెక్కువగను, మరికొంతసేపటికి ఉదృతం తగ్గి పలుచబడి తక్కువగను ప్రసరిస్తున్నాయి. ఆ పరిమళ ప్రభావానికి తల దిమ్మెత్తి, కండ్లు చెవులుకూడ మూతలు పడిపోయాయి. సంపంగి, రోజా లింకా పూయటం లేదు. అందుకనే కాబోలు ఆ చివరనవి చలనం లేకుండా చక్కగా తీర్చి దిద్దిన వరుసలలో నిబ్బరంగా, నిటారుగా నిలబడి తమ ఎదుగుదలను ప్రకటిస్తున్నాయి. కోనేటిలోని కప్పలు కుతూహలంతో కులాసాగా బెకబెక మంటూ విరామం లేకుండా వానరాకముందే అరుపులు సాగించాయి. సంతత ధారగా వర్షించే వర్షం వాటి సవ్వడిని సునాయాసంగా అధిగమించి ఉవ్వెత్తుగా లేచింది. కోయిలలు, పక్షులు, తమ తమ తీయని కంఠాల నెత్తి పాటలతో సంభాషించుకొంటున్నాయి. ఆనందంతో ఒక పొదనుండి మరొక పొదకు పరుగులు తీస్తూ ఆడుకొంటున్నాయి. తప తపా విదలించుకొనే వాటి రెక్కలనుండి ఉద్భవించే ధ్వనిని సుస్పష్టంగా వినగల్గుతున్నాను. ఈ వర్షాకాలంలోకూడ ఆ కిటికీదగ్గర గూడు

కట్టుకోడానికి కోకిల అతి చురుకుగా సన్నాహాలు సాగిస్తోంది. నేను వరండాలోకి వచ్చేసరికల్లా అది రివ్వున చెట్లసందుల కెగిరిపోయి చెట్ల చాటునుండి ఒక కూతకూసి ఆపేసింది. పాపం అదికూడ వర్షంకోసం ఎదురు చూస్తోంది!

ఈ విపరీతాలోచనలను అణచుకొందామని తీవ్ర ప్రయత్నం చేసి విఫలురాల నయ్యాను. దేనికోసమో ఎదురు చూస్తోంటే, విషాదచ్ఛాయ లేవో నన్ను సోకాయి.

ఆయన క్రిందికి దిగివచ్చి నా ప్రక్కనే కూర్చున్నారు "సోన్యా వాళ్ళు వానలో తడిసి పోతారేమోనని భయంగా ఉంది నాకు" అన్నా రాయన. "అవును, నిజమే" అన్నాను నే నది ధృవపరుస్తూ. చాలసేపటి వరకు యిద్దరం నిశ్శబ్దంగా కూర్చుండిపోయాం.

పవన రహితమైన మేఘమొకటి క్రమక్రమంగా క్రిందికి దిగుతూ మధురమైన సువాసనల నెన్నింటినో నాశికా రంధ్రాలకు సరఫరా చేసింది. ఇంతలో హఠాత్తుగా ఒక చినుకు కాన్వాసు గుడ్డపై పడి క్రిందికి జారింది. వెనువెంటనే మరి రెండు ఆ సన్నని కాలిబాటలో రాలాయి. దాని నంటుకొని ఒక జల్లు చెట్లపై వర్షించింది. నెమ్మదిగా ఆ జల్లు పెరిగి పెద్దదై కుంభవృష్టిగా కురిసింది. ఈ దెబ్బతో కోయిలలు, కప్పలు ఒక్కసారి మూగనోము పట్టాయి. వాన ఎంతో దూరాన కురుస్తూన్నప్ప టికీ, హోరు స్పష్టంగానే వినిపిస్తోంది. అంతవరకు వరండా సమీపంలో ఎండుటాకుల మధ్య తలదాచుకొన్న పక్షొకటి నెమ్మదిగా తన రెక్కలను విప్పి పదే పదే ఝుళిపిస్తూ ఎగిరిపోయింది. నా భర్త లేచి లోనికి వెళ్ళ ప్రయత్నించారు. ఆయన్ని ఆపాలనే ఉద్దేశంతో "ఇక్కడింత హాయిగా ఉంటే ఎక్కడికండీ వెళ్ళుతున్నారు" అన్నాను.

"మనం వాళ్ళకోసం వెంటనే గొడుగులు, గొనెలు పంపాలి" అన్నారాయన.

"ఎందుకండీ మీరనవసరంగా ఆదుర్దా పడతారు? ఈ వాన కొంచెంసేపటిలో వెలిసిపోదూ?" అన్నాను.

దాని నాయన నమ్మి ఆగిపోయారు. అక్కడే మరికొంతసేపటి వరకు ఉండిపోయాం. వానతో తడిసి జారుజారుగానున్న గోడ నొక చేతితో ఆనుకొంటూ నా తలను బయటకు పెట్టాను. సరికొత్త వర్షపు జల్లొకటివచ్చి, నా మెడను శిరోజాలను తడిపివేసింది. మేఘాలు పలుచబడి తేలికై, పైకెగరిపోతూ ఆకాశాన్నుండి అప్పుడప్పుడు చిల్లరగా చినుకులను వదలుతున్నాయి. వాటికితోడు గాలి కొద్దికొద్దిగా వీయడం వల్ల చెట్లాకులలో దాగుకొన్న చినుకులుకూడ జలజల రాలుతున్నాయి. కప్పలు బొరియలనుండి బయటకు వచ్చి మళ్ళీ అరుపులు మొదలు పెట్టాయి. కోయిలలు మైకంనుండి మేల్కొని పొద పొదకు పరుగులిడుతూ, కుహూ కుహూరావాలను ఆలాపిస్తున్నాయి. మబ్బు తెరలనుండి తేటబడిన ప్రకృతంతా ప్రస్ఫుటంగా గోచరిస్తోంది.

వరండా మెట్లపై కూర్చుండి ప్రకృతిని పరిశీలిస్తూ ఒకచేతితో నా తడి శిరోజాలను నిమురుతూ "ఈ వాతావరణం ఎంత ఆహ్లాదంగా ఉందీ!" అన్నారాయన. "మానవుని కింతకంటె కావలసిన దేముంది?" అని అందుకొని "నాకు చాల సంతృప్తి కలుగుతోంది. ఇంతకంటె మరేమీ కోరను — అక్కరలేదు కూడ. నే నిప్పుడెంతో హాయిగా ఆనందంగా ఉన్నాను" అని పూర్తి చేశారు.

ఇదివరలో ఆయన భావాలను, మనో వ్యవస్థను మరో విధంగా వ్యక్తపరచారు. ఆయనెంత ఆనందమయ జీవితాన్ని గడుపుతూన్నప్పటికీ, సంతృప్తి లేక యింకా యింకా అధికంగా కావాలని కోరడం ఆయనకు పరిపాటి. ఇప్పుడో? నా హృదయమంతా కానరాని కన్నీటి కాల్వలో మునిగి చెప్పరాని పశ్చాత్తాప సాగరంలోతేలి కొట్టుకుంటూంటే ఆయనమాత్రం ప్రశాంతంగా కూర్చొని "నాకున్నది చాలు, దానితో

సంతృప్తి చెందుతాను — ఇంకేమీ అక్కర లేదు' అని మధుర భాషలు పల్కుతున్నారు.

"నాకుకూడ చాల ఉల్లాసంగా ఉంది" అని ఆరంభించి "కాని ఈ సుందర ప్రకృతి శోభను చూస్తే కొంచెం విచారంకూడ కలుగుతోంది. నా మనోసీమలో పెద్ద కల్లోలం చెలరేగి, అసంతృప్తి జ్వాలలు విజృంభించుతూంటే, ఈ ప్రకృతిలోని ప్రతి వస్తువు, ప్రతిజీవి అందచందాలతో అలరారుతున్నాయి. అసలు కొద్దిగా ఆలోచించి చూస్తే బాధారహితమైన అణువేదయినా ఈ విశాల విశ్వంలో గోచరిస్తుందా ? ఎంత ఆహ్లాదకరమైన వాతావరణంలో విహరిస్తున్నా, భూతకాలపు సంఘటనలను స్మరించుకొని విచారించని జీవి ఉంటుందా ?

అంతవరకు ఆయన నా తలను మృదువుగా నిమురుతూనే ఉన్నారు, ఒక్కసారి తన చేతిని వెనక్కి తీసుకున్నా రెందుకో. కొంత సేపటివరకు ఏమీ మాట్లాడ లేదు.

"నే నదికూడ అనుభూతి చెందాను" అని మొదలుపెట్టి ఎవో పాత సంఘటనలను పునః స్మరించుకొంటూన్నట్లు ముఖ కవళికలను మార్చి, "ముఖ్యంగా చెప్పవలసి వస్తే వసంతకాలంలో నిశారాత్రులు నిద్రపోకుండా మేల్కొని ఎవెవో అనంతమయిన ఆశాలతల నల్లుకొంటూ మధురఊహలలో తేలియాడుతూ, అప్పుడప్పుడు భయవిహ్వల చిత్తంతో వణుకుతూ, మరల ఏ చెడు రోజులు ప్రాప్తమవుతాయోనని మధ్య మధ్య బెదురుతూ అనేక రోజులు గడిపాను. ఆనందోద్రేకోత్సాహ భయ భ్రాంతులతో కూడిన ఆ ఆలోచనలే నా సన్నిహిత సహచరులు. నిజానికి వాటినే సుసాంప్రదాయాలు గల శ్రేష్ఠమైన స్నేహబృందం అని పిలవాలి ! అప్పట్లో జీవితమంతా యవ్వనఝరీవేగంలో కొట్టుకొనిపోతూ దివ్యస్వప్నాలతో, తీయని ఊహలతో, అనంతమైన ఆశలతో, మహోజ్వలమైన భావిని నా కంద్రకు చూపి నేత్రోత్సవంగా నృత్యం చేయిం

చింది. కాని యిప్పుడో ? అవన్నీ నన్ను ముందుకు త్రోసి తాము వెన కనే అదృశ్యమైపోయాయి. నా ప్రస్తుత జీవిత సరళికూడ సంతోషాన్ని కొల్లలు కొల్లలుగా అందచేస్తోంది. ఉన్నదానితోనే నేను తృప్తి చెంద గలను" అని చంచలిత మనోధైర్యంతో సునాయాసంగా పూర్తిచేశారు. అవన్నీ వాస్తవిక విషయాలే అయినా వినడానికెంతో బాధ కలిగించాయి.

"ఇక మీరు ఆశించేదేదీ లేదా ? "అని ప్రశ్నించాను.

నా ఊహలను ముందే గ్రహించి "అసంభవమైన వాటిని నే నెప్పుడూ ఆశించను" అని అందుకొని "ముందు నీ జుత్తు తడుపుకొని రావాలంటే తడుపుకొని రా" అని చిన్న పిల్లవాని మాదిరిగా నా జుట్టు పీకుతూ, తడి శిరోజాలను మృదువుగా దువ్వుతూ "వానలో తడిసిన పచ్చటి చెట్లాకులను, పచ్చికను చూస్తే నీకసూయగా వుంది కదూ ? ఆ వానలో, చెట్లాకులలో, పచ్చటి లేబచ్చికలో నీవు ఐక్యమైపోవాలని వాంఛిస్తున్నావు కదూ ? కాని వాటిని చూస్తూ నేను తృప్తిపడుతున్నాను. ప్రతి జీవి ఆనందంతో, యౌవనంతో చక్కగా అలరారుతున్నది" అని ముగించా రాయన.

"అయితే గతించినదానికి మీ రేమి వగవరా ?" అని ప్రశ్నించాను బరువెక్కిన హృదయంతో.

సమాధానం చెప్పేముందు ఆయన కొంచెం యోచించారు. నిర్ధ యంగా తన అభిప్రాయాన్ని వెలిబుచ్చడానికి సంసిద్ధులవుతున్నారని నేను గ్రహించాను.

"ఉహూఁ ! ఏమీ విచారించవలసిన పని లేదు" అన్నారు ముక్తసరిగా.

ఆయనవంక ఆయన కళ్ళల్లోకిచూస్తూ "అబద్ధం ! వట్టి అబద్ధం!" అని "నిజరిగా చెప్పండి, జరిగిదానికి మీ రేమాత్రం విచారించటం లేద న్నమాట !" అడిగాను.

"లేదు" అని ఆ మాటనే అంటూ "దానికి నే నెంతో కృతజ్ఞుణ్ణి. అంతేకాని విచారించను."

"కాని ఆ రోజులు తిరిగి రావాలని వాంఛించరన్నమాట !"

ఆయన ముఖము ప్రక్కకు త్రిప్పి, తోటకేసి చూస్తూ "లేదు ! మరొక్కటి చెపుతా విను. నాకు రెక్కలు కట్టుకొని ఎగిరిపోవాలని ఉందనుకో. ఎల్లాగ ? అది అసంభవం" అన్నారు.

"జరిగినదానిని మార్చడానికి ప్రయత్నించరుకూడా, అంతేనా ? మిమ్మల్ని మీరు విమర్శించుకోవడంగాని, లేదా నన్ను విమర్శించడం గాని కూడా చేయరన్నమాట ?"

"ఎప్పటికీ చెయ్యను ! అదంతా మన మేలుకోసమే."

"అయితే నే నొక్కటి అడుగుతాను చెప్పండి" అని ఆయన్ని చెయ్యి పట్టుకొని నా వైపు త్రిప్పి "మరయితే మీకు నిజంగా నచ్చిన రీతిని నేను నడవాలని ఎప్పుడూ నాకు చెప్పలేదేం ? స్వాతంత్ర్యం పొందడానికి అర్హతలేని నాకు స్వాతంత్ర్యం ఎందుకిచ్చారు ? హితోప దేశాల నెందుకు మానేశారు ? మీ కిష్టమే ఉన్నట్లయితే నన్ను మరొక రీతిని నడిపించియుండేవారు. అప్పుడిదంతా జరిగియుండేది కాదు." అని విదారాన్ని, నిరుత్సాహాన్ని, నిస్పృహను ప్రస్ఫుటంగా ప్రకటించేవిధంగా నిట్టూర్పు విడిచాను.

"ఏమి జరిగుండేదంటావు ?"అని ఆశ్చర్య సంభ్రమాలతో నా వైపుతిరిగి "ఇప్పుడున్నదాన్ని ఉన్నట్లు పరిశీలించిచూస్తే బాగానే వుంది. అంతేకాదు చాలా సంతోషప్రదంగా, చక్కగా వుంది" అన్నారు చిరు నవ్వుతో.

ఆయన నిజంగా అర్థంచేసుకోలేదా ? లేక యింకా క్రిందకు దిగ జారి అసలుపరిస్థితులను అర్థంచేసుకొనడానికి ఉద్యుక్తులు కావడం లేదు కదా ? ఏది నిజం ?"అని ఆలోచించసాగాను. హఠాత్తుగా మళ్ళీ మొదలు పెట్టి "పోనీ ! యిప్పటికయినా, తప్పిదమేమీ చేయని నన్ను బాధించడం

అన్యాయమని గుర్తించారా ? మీరు నాపైగల విముఖతను, ద్వేషాన్ని పరిమాణాలుగా తీసుకొని, నే నెంతో అమూల్యంగా భావించే ఆనందాన్ని అక్రమంగా అపహరించడం న్యాయసమ్మతమేనా ?" అని పూర్తిచేశాను.

"నీ వనేదేమిటి ప్రియా ?" అని అడిగారు.

.... ఆయనేమీ అర్థం చేసుకొన్నట్లు లేదు.

"నన్ను మధ్యలో అడ్డుపెట్టకండి ! మీపై నాకుండే విశ్వాసాన్ని గౌరవాన్ని, పవిత్ర ప్రేమను మీరే చేతులారా కాజేశారు. పూర్వపు రోజుల్ని తలచుకున్నాకూడా మీరు నన్నింకా ప్రేమిస్తున్నారనే నమ్మకం కలగడం లేదు. నడుమలో మాట్లాడకండి ! నన్ను పూర్తిగా చెప్ప నీయండి. నన్ను చాలా రోజులనుండి హింసిస్తూన్న విషయాలన్నీ ఏకంగా ఒక్కసారే చెప్పనీయండి. జీవితమంటే ఏమిటో నేను సరిగా అర్థం చేసుకోలేనంత మాత్రాన, అనుభవంవల్లే అన్నీ సుబోధక మవు తాయని నన్ను మీరు గాలికి వదలివేస్తారన్నమాట ? తగిన విజ్ఞానాన్ని సంపాదించి మీకింకా చేరువగా చేరి మీ హృదయంలో ఉన్నతస్థానాన్ని సంపాదించాలని ఏడాదినుంచి ఆరాటపడుతూంటే నన్ను క్రూరంగా గెంటిపారేసి, నాకు కావల్సినదేమిటో పాపం మీ కేమీ అర్థం కానట్లు నటించడంకూడా నా తప్పిదంకిందే వస్తుందా ? నే నేదో అపరాధం చేసి, నిస్సంతోషంగా కుమిలి కుమిలి ఏడుస్తూంటే మీరు దిగ్బంధన విధానా లన్నీ ప్రయోగించి మీ సమీపానికి రావడమే అసంభవం చేసేస్తున్నారు. అవును ! నాకు తెలిసిందిలెండి. మన యిద్దరి ఆనందాన్ని దోచిన ఆ పాడు పట్టణ జీవిత రొంపిలోనికి నన్ను త్రోసిపారేయాలని చూస్తు న్నారుకదూ ?"

"దాని నే నేవిధంగా వ్యక్తపరచాను ?" అని ఆశ్చర్య సంభ్రమాలతో ఉద్రిక్తులై ప్రశ్నించారు.

"ఎప్పటిమాటో ఎందుకులెండి. విన్నటిదాకా మీ రేమంటూ వచ్చారు ? ఈ పల్లెల్లో నేను నివసించలేనని, ఈ చలికాలంకూడా పీటర్సు

బర్గులో గడుపుదామని, ఒకే నరుసని ఏకధాటిగా అస్తమానూ అంటు న్నారా, లేదా ? ఆ వెధవ పీటర్సుబర్గుఅంటే నాకు పరమ అసహ్యం :" అని ఆరంభించి "నా అభిప్రాయాలతో ఏకీభవించి నన్ను సమర్థించక పోగా, ఆ మాటలటుంచి మాయ మర్మంలేని సూటిసంభాషణలను సంపూ ర్తిగా విసర్జించేశారు. పోనీ యీమధ్య నాతో ఎప్పుడయినా నిష్కపట మైన ప్రేమపూరిత పలుకొక్కటయినా పలికారా ? దుర్భరమైన యీ మనో వేదనతో మొదలుకంటా కూలిపోతే, మీ రప్పుడు నా సామీప్యానికి చేరి, కేళించాలని కోరుతున్నారు కదూ ?" అని సాగిస్తున్నాను తీవ్ర ధోరణిలో.

"ఆగు" అన్నారు తీవ్రమైన కఠోరస్వరంతో. "అల్లా ఆరోపించ డానికి నీకేమీ అధికారం లేదు. ఇందంతా నీకు నాపై అసంఖ్యాకంగా దురభిప్రాయాలున్నాయనే సత్యాన్ని నిరూపిస్తోంది. అంతే కాదు నీ వసలు నన్ను ..............." అని ఆగారు.

"నేను ప్రేమించుట లేదనేగా ? అనండి ! తడబడతా రెందుకు ? అనదల్చుకొన్న దేమిటో మిగల్చకుండా పూర్తిగా అనేయండి. తీరి పోతుంది" అని ధైర్యంగా అనేశానేకాని, ఏకధారగా అశ్రువులు నా కండ్ల నుండి ప్రవహిస్తున్నాయి. బెంచీమీదికి పోయి కూర్చుని జేబు రుమాలుతో ముఖాన్ని కప్పుకొని ఏడ్వనారంభించాను.

"ఆయన నన్ను ఆ విధంగా అర్థం చేసుకొన్నారన్నమాట !" అని నాలో నేను బాధపడ్డాను. కన్నీరు ఆపుకొందామని ఎంతో ప్రయ త్నించాను. "పూర్వము మా యిద్దరిమధ్యనున్న ప్రేమానురాగాప్యాయా లన్నీ మట్టిపాలయ్యాయి" అని ఎవరో నా హృదయసీమలో ఘోషిస్తో న్నట్లు తోచింది.

నన్ను సముదాయించడానికయినా ఆయన దగ్గరకు రాలేదు. ఆయన మాట్లాడబోయేసరికి కంఠం ఎండిపోయింది. అల్లాగే "నీవు

దేనితో నన్ను సమీపించాలని కోరుతున్నావో నా కర్థం కావడం లేదు." అని మొదలుపెట్టి "నేను నిన్ను యిదివరలో ప్రేమించినట్లు యిప్పుడు ప్రేమించుట లేదనేగా నీ అభిప్రాయం ?" అని ప్రశ్నించారు.

"ఇదివరలో ప్రేమించినట్లు !"అని ఆయనన్న ముక్కని ఆశ్చర్యంగా రెట్టించాను. నా ముఖం జేబురుమాలు ముసుగులోనే వుంది. అశ్రువులు సంతత ధారగా ప్రవహిస్తున్నాయి.

"దానికి కాలాన్ని నిందించవలసి యుంటుంది" అని ఆరంభించి కొద్దిసేపు నిశ్శబ్దంగా ఊరుకొని "నీవు నిజంగా నిష్కపటాన్నే వాంఛిస్తూన్నట్లయితే యధార్థమంతా చెప్పనా ? ఆ వేసవికాలంలో నిన్ను మొట్ట మొదటి సారిగా చూచినప్పట్నో నాకు మనశ్శాంతి వుండేది కాదు. రాత్రిళ్ళు పక్కమీదపరుండి, నిద్ర మానేసి, ఎల్లప్పుడూ నిన్నుగురించే ఆలోచించేవాణ్ణి.

"నాలో నేనే ప్రేమను సృజించుకొన్నాను. అది నాహృదయంలో దిన దినాభివృద్ధి చెందింది. మరల పీటర్సుబర్గులోను, తదితర విదేశాలలోను, నిద్ర లేకుండా అనేక భయంకరమైన రాత్రులను గడిపాను. నన్ను హింసించాలని చూస్తూవున్న ప్రేమను తుత్తునియలు చేసి, చెల్లా చెదరుగా తరిమి తరిమి కొట్టాలని విశ్వప్రయత్నం చేశాను. దానిని సర్వ నాశనం చేయలేదు. కాని నాకు బాధ కలుగచేసిన భాగాన్నిమాత్రం పూర్తిగా తుడిచిపారేశాను. అప్పుడు నాకు గొప్పమనశ్శాంతి లభించింది. నే నింకా ప్రేమిస్తూన్నట్లే ఉంది. కాని యీ ప్రేమ మరొక రకమైన ప్రేమ" అని ఆయన తన గంభీరోపన్యాసాన్ని పూర్తి చేశారు.

"మీరు దానిని 'ప్రేమే' అని పిలవవచ్చును. కాని నేను హింస అంటాను ; మీరు సమాజం బహు చెడ్డదని యెంచినప్పుడు, దానివల్లే నన్ను ప్రేమించుట మానేసినప్పుడు, ఆ కార్యకలాపాల్లో నన్ను కలుగ చేసుకోవద్దని ఎందుకు చెప్పలేదు ?" అని ప్రశ్నించాను.

"అది సమాజంలోపం కాదు ప్రియా !" అన్నా రాయన.

"అయితే మరెందుకు మీ అధికారాన్ని అమలు జరుపలేదు ? నన్ను యింట్లోనే తాళం వేయడంకాని, లేదా చంపివేయడంకాని చేయ లేకపోయారా ? నేను నా వెనుకటి ఆనందాన్ని పొందలేనప్పుడు అదే మంచి మార్గం. ఈలాగ అవమానకరమైన బాధతో కుళ్ళేదానికన్న సంతోషంగా చావునే ఆహ్వానించేదాన్ని" అని ఆగాను.

అప్పుడే కాట్యా, సోన్యా తడిసిన బట్టలతో సంతోషంతో గట్టిగా కేకలేసుకుంటూ వరండాలోనికి వచ్చారు. మమ్మల్ని చూడగానే ఒక్కసారి మౌనం వహించి యింట్లోకి వెళ్ళిపోయారు.

చాలా సేపటివరకు మేముకూడా నిశ్శబ్దంగానే ఉన్నాం. నేను అన దలుచుకొన్నదంతా అని, ఆత్మ సంతృప్తి కలుగజేసుకొన్నాను. ఆయన వంక ఒకసారి చూచాను. తలను చేతిమీద ఆన్చి ఏదో దీర్ఘంగా ఆలో చిస్తున్నారు. నా చూపున కేదో సమాధానం పంపుదామనుకొన్నారు. కాని ఒక్క నిట్టూర్పు విడిచి వూరుకొన్నారు.

నే నాయన దగ్గరకు వెళ్ళి తలక్రిందవున్న చేతిని లాగివేశాను. ఆయన ప్రశ్నార్థకంగా నా ముఖంకేసి చూశారు.

"అవును" అని ఆయన ఆలోచనలను సాగిస్తూ బిగ్గరగా "మనందరికి అందులోను ముఖ్యంగా స్త్రీలకి స్వయంగా ప్రపంచకంలోని సకల అనర్థాలు, అత్యాచారాలు, అనుభవంలోకి వస్తేనేగాని మామూలు జీవిత పథానికిరారు. ఇతరులెంత అనుభవనీయులైనప్పటికి వారిమాటలు వీరికి రుచించవు. అత్యంతాకర్షణీయంగా నుండే ఆ అసహ్యావరణ అంతి మావధిని చేరుతున్నప్పుడు నిన్ను నే నెంతో మెచ్చుకున్నాను. అటు వంటి కార్యకలాపాలలో కలుగచేసుకొనే కాలం నా కెప్పుడో చెల్లి పోవడంవల్ల, నీపై ఎట్టి వొత్తిడి తీసుకొనిరావడానికి నా కేవిధమైన అధికారం లేదని విచారించి నిన్ను ఒంటరిగా ఆ రంగంలో వదిలేశాను" అని సాగిస్తున్నారు.

నే నింతలో అడ్డుకొని "మీరే నన్ను మనసారా ప్రేమిస్తూన్నట్లయితే, మీరుకూడా నా సరసన నిలబడి అటువంటి అర్ధరహితమైన, తెలివితక్కువయిన ప్రమాద పరిస్థితులలోనికి జొరబడకుండా అడ్డగించియుండేవారు కదా ?" అన్నాను.

"నీ వెంత ప్రయత్నించినా అప్పట్లో నా మాట వినడం అసంభవమని పూర్తిగా తెలిసే వూరుకొన్నాను పైగా స్వానుభవమే అత్యుత్తమ పాఠాన్ని గరుపుతుంది కదా ? ఇప్పుడు నీ కదంతా సుబోధకమైంది" అన్నారు.

"అందులో అతిశయోక్తి, ముందాలోచన, ఊహా చాలా ఉన్నాయనుకోండి కాని కొంచెం ప్రేమ ఉన్నట్లయితే ............... " అని మరల అన్నాను.

మళ్ళీ మే మిద్దరం కొద్దిసేపు నిశ్శబ్దంగా ఉండిపోయాం.

హఠాత్తుగా నిలబడి వరండాలో యిటునటు పచార్లు ప్రారంభించి "ఇప్పుడు నీవన్నది బాధాకరమైనప్పటికీ వాస్తవిక విషయమే ! అవును ! నీవు చెప్పినది నిజమే. నేనే నిందార్హుణ్ణి" అంటూ నాకెదురుగా వచ్చి నిలబడి "నిన్ను నే నసలు ప్రేమించకుండా ఉండవలసింది. అథవా ప్రేమించినా యింత గాఢంగా కాకుండా మామూలుగా ప్రేమించియుండవల్సింది" అన్నారు.

"అవన్నీ మరిచిపోదాం" అన్నాను సగం బెదురుతూ.

"లేదు, గతించిన దెప్పటికీ తిరిగి రాదు." ఆయన మాట్లాడుతూన్నకొద్దీ కంఠస్వరం క్షీణిస్తోంది.

ఆయన భుజంపై నా రెండు కోమల హస్తాలను ఆన్చి "అది ఎప్పుడో తిరిగి చేకూరింది" అన్నాను.

నా హస్తాలను తీసి నెమ్మదిగా నొక్కుతూ "నేను గతించిన దానికేమీ చింతించడం లేదని పొరపాటున చెప్పాను. నిజానికి నేనెంతో

విచారిస్తున్నాను. పూర్వపు ప్రేమ తిరిగెన్నడూ రాదని లోలోపల నేను చాలా ఖేదపడుతున్నాను. ఇందులో ఎవరు నిందార్హులో నేను చెప్పలేను. ప్రేమ యింకా మిగిలియుంది కాని యిది పూర్వపు తరహాది కాదు. దాని స్థానం కాళీగానే వుంది. కాని ఆ పదార్థమంతా వృధా అయి పోయింది. శక్తి యావత్తూ సన్నగిలింది. పూర్వ స్మృతులు, కృతజ్ఞత అలాగే ఉండిపోయాయేగాని ..........."

"అలాగనకండి" అని గద్గదస్వరంతో "మనం పూర్వంలాగానే వ్యవహరిద్దాం! అది తప్పక సాధ్యమవుతుంది కూడ" అని అంటూ ఆయన నయనాలలోనికి చూచాను. ఆయనచూపుల్లో క్రోధం, క్రూరత్వం లేదు. ఎంతో విలకడ, ప్రశాంతత, గోచరిస్తున్నాయి. నేనలా మాట్లాడు తున్నానేగాని, నా కోరికలు, నా అర్జీ నెరవేరడం కేవల మసంభవమని నాకు పూర్తిగా తెలుసు. నెమ్మదిగా మృదువుగా ఆయన నవ్వారు. ఆచిరు నవ్వులో ముసలితనం గోచరిస్తోంది.

"నీ కింకా కుర్రతనం పోలేదు. నేనెంతో ముసలివాణ్ణయి పోయాను. నీవు నాలో వెతికే పదార్థం అక్కడ లేదు. ఎందు కనవ సరంగా మనల్ని మనం మోసగించుకోవాలి ?" అన్నారాయన నవ్వుతూనే! నేనాయన కెదురుగా వచ్చి నిలబడ్డాను. నా హృదయం చాలా కుదుట పడింది.

"జీవితాన్ని పునః ప్రారంభించాలని మనం ప్రయత్నించ వద్దు" అని ప్రారంభించి "మనమిక అనవసర నటనలు చేసుకోవద్దు. మన ఉద్రేకోత్సాహాలు ఒక చివరకు చేరినందుకు ఎంతో కృతజ్ఞులమై ఉండాలి. మన దాహం తీరింది. కావలసినంత ఆనందాన్నికూడా అనుభ వించాం. ఇక మన మీ దారినుండి తప్పుకొని వాళ్ళకి చోటివ్వాలి" అని నర్సు తీసుకొని వస్తూన్న నా చంటి బిడ్డ 'వాన్యా'కేసి చూపిస్తూ; "అది అక్షరాలా నిజం ప్రియా !"అని నా శిరస్సును దగ్గరకు లాగుకొని ముద్దు

పెట్టుకొన్నారు. ప్రస్తుత మాయన నా ప్రియునిలాగ లేరు. ఎవరో పాత స్నేహితుని వలె వ్యవహరిస్తున్నారు. ఉద్యాన వనంనుండి సంధ్యరోజా పుష్పాల వాసనా పటిమ ఘాటుగా వీస్తోంది. శబ్దాలన్నిటినీ ప్రక్కకు త్రోసేసి, నిశ్శబ్దం ఆవరించింది ఆ ఖాళీస్థలంలో. తారాపథంలో తార వెంబడి తార తళుక్ తళుక్‌మని ప్రజ్వరిల్లుతున్నాయి. ముఖం పైకెత్తి ఆయన వంకొకసారి చూశాను. హఠాత్తుగా నా హృదయం తేలికబడి నట్లయింది. పాత కష్టాలను, వాటి బాధను గమ్మత్తుగా మంత్రం వేసి తీసివేసినట్లయింది. పిలుపునకయినా అందకుండా నా పాతభావాలు, అనుభూతులు, భూతకాలంలాగే మాయమైపోయాయి. వాటిని తిరిగి మనో వీధిలోనికి తీసుకురావడం అసంభవమేకాక, చాల బాధాకరమైన, దుఃఖ భాజకమైన విషయం. పోనీ నాకు ఆనందంగా కనపడిన ఆ కాలాన్ని మంచిదని పిలువగలమా? అదీకాక అది చాల రోజులనాటి సంగతి!

"టీ త్రాగడానికి వేళయింది" అన్నారాయన అకస్మాత్తుగా. ద్వారం దగ్గరకు వెళ్ళగానే పిల్లవాని నెత్తుకొని నర్సు ఎదురుపడింది. చంటి బిడ్డను నా చేతులలోనికి తీసుకొని బయటికి కనపడే ఆ యెర్రటి చిరు పాదాలను గుడ్డతో కప్పి, నా బంగారు పాపను హృదయానికి హత్తుకొని మృదువుగా ఆ చిరు పెదవులపై ముద్దు పెట్టుకొన్నాను. అర్ధ నిమీలిత నేత్రాలతో ముఖాన్ని యిటునటు కదుపుతూ, తన చిన్న చేతిని చాచి ముడిచిన వ్రేళ్ళను విప్పి, ఏదో కావలసి వచ్చినట్లు, లేదా ఏదో జ్ఞాపకం చేసుకొంటూన్నట్లు నెమ్మదిగా తన రెండు నయనాలను తెరిచాడు. తెరచీ తెరవడంతో నాపై చూపులను లగ్నం చేశాడు. ఆ రెండు చిన్న నయనాలు మిలమిలా మెరిశాయి. దూరంగా వున్న చిగురాకువంటి రెండు పెదిమలు దగ్గరకు వచ్చి మళ్ళీ తెరచుకొని లేచిరు నవ్వులను విరజిమ్మాయి.

"నా ముద్దుల రాశి" అని అంటూ మరింత గట్టిగా నా వక్షస్థలానికి అదుముకొన్నాను. నే నప్పుడు పొందిన స్వర్గీయానందంలో నా ప్రతి

అంగం పులకరింపులతో గట్టిపడింది. ఈ పసికూన ఎక్కడ నలిగి పోతుందోనని భయపడ్డాను. కాళ్ళను, కడుపును, చేతిని, తలను వరుసగా ముద్దు పెట్టుకొంటున్నాను. ఇంతలో నా భర్త దగ్గరగావచ్చి నిలబడ్డారు. నేను బిడ్డ ముఖంపై గుడ్డకప్పి మరల వెంటనే తీసేశాను.

అతని చిన్న గడ్డాన్ని ఆడిస్తూ, "ఇవాన్ సెర్జైచ్" అన్నారు. మళ్ళీ చంటిపిల్లవాని శరీరాన్ని గుడ్డతో కప్పడానికి నేనుద్యుక్తురాల నయ్యాను. నేను తప్ప ఆ బిడ్డవంక తేరిపారి చూడడాని కెవ్వరికీ అధి కారం లేదనేభావంతో నా భర్తవంక చూచాను. ఆయన నయనాలు నవ్వుతూ నావంక చూశాయి. నేను మరల మరింత ప్రేమతో సంతో షంగా ఆయన కండ్లలోనికి చూశాను, చాలాకాలంనుండి అదృశ్యమైన సౌందర్యమంతా లభించినట్లయింది నాకు.

మా వివాహకాలం నాటినుండి వస్తూన్న ప్రేమ, ఆనాటితో అంత మొందింది. పాతాలోచనలన్నీ అమూల్యములై సుస్థిరస్థాపితం చేయలేని మనుగడలై పోయాయి. కాని నా పిల్లలంటే మరొక నూతన భావాను భూతిగల గాఢమైన ప్రేమ జనించింది, ఈ క్రొత్త జీవనానికి, మరొక రకమైన సౌఖ్యానందాలకు నూతన మార్గాలన్నీ తెరచినది నా భర్తే!! ఈ విధమైన సంసార సుఖమైనా సుస్థిరంగా నిలచి, సంతోష ప్రదంగా సాగాలని వాంఛిస్తున్నాను.



"మార్క్సు జన్మించిన 2½ ఏళ్ళకు 1820 నవంబరు 28 వ తేదీ నాడు ఎంజెల్సు జర్మనీలోని బార్మెన్ నగరంలో జన్మించి 1895 ఆగస్టు 4 వ తేదీన లండన్‌లో చనిపోయాడు. ఒక ఉత్పత్తిదారుడి కుమారుడైనప్పటికీ ఈయన అభ్యుదయపంథానే అనుసరించి వ్యాపారాన్ని, ధనాన్ని త్రోసివేశాడు. కమ్యూనిస్టు మూలసిద్ధాంతాలను (కమ్యూనిస్టు మానిఫెస్టో) మార్క్సుతో కలిసి రచించాడు. సైనికశాస్త్రం, జీవశాస్త్రం, చరిత్ర మొ॥న ఎన్నో శాస్త్రాలలోనూ, అనేక భాషలలోను ఆరితేరినాడు. తానుకూడా 'కుటుంబం - దాని పుట్టుపూర్వోత్తరాలు' మొదలైన గ్రంథాలు రచించాడు. సామ్యవాదాన్ని మధ్యతరగతుల 'హార్టీ కలాపం' క్రింద మార్చడానికి చేయబడిన ప్రయత్నాలను ఖండిస్తూ 'ఆంటీ డూరింగ్' అనే సుప్రసిద్ధ గ్రంథాన్నికూడా వ్రాశాడు.

గ్రంథరచయిత సోవియట్ రష్యా స్థాపకుడైన లెనిన్ గనుక గ్రంథాన్నిగురించి వేరే వ్రాయనక్కరలేదు."

—ఆంధ్ర పత్రిక.

"లెనిన్ వ్రాసిన గ్రంథానికి శ్రీ ఉమారాజేశ్వరరావుగారి అనువాదం సరళంగా వుంది. కార్మికోద్యమాన్ని అర్థం చేసుకోవాలన్నవారికి ఈ గ్రంథపఠనం ఎంతగానో తోడ్పడుతుంది."

—ఆంధ్ర ప్రభ.

# చదవండి !

చైనా మన పొరుగుదేశం. ప్రపంచవాసులలో నాల్గవవంతు చైనా వారు. "అగ్ర"రాజ్యాలని వ్యవహరింపబడే అయిదింటిలోనూ చైనా ఒకటి. ఐక్యరాజ్యసమితి ఉపాంగమైన భద్రతాసంఘంలో శాశ్వత సభ్యురాలు. ఒకప్పుడు చైనా మహోన్నతమైన వైభవం అనుభవించింది. సకల కళల లోను, విజ్ఞానంలోను చైనాదేశీయులొకనాడగ్రతాంబూలమందుకున్నారు. కాని "అగ్ర" రాజ్యమని పిలిపించుకునేందుకు అర్హతగాని, ఔన్నత్యం ప్రదర్శించే శక్తిగాని నేటి చైనాకు మృగ్యం.

ఉన్నతశిఖరాలనుండి నేటి శోచనీయస్థితికి ఏ కారణాలవల్ల ఆ ప్రాచీన దేశం పతనంజెందవలసి వచ్చింది? ఈ ప్రశ్నకు సమగ్రమైన సమాధానం తెలుసుకోవాలంటే "చైనా విప్లవ చరిత్ర" చదవండి.




ప్రతులకు :—

ప్రగతి ప్రచురణాలయం,

నిడమర్రు. (వయా) పెంటపాడు.

(పశ్చిమగోదావరి జిల్లా.)

బ్రాంచి : 1/44 ఇరుసప్పగ్రామణి వీధి,

ట్రిప్లికేన్ - మదరాసు.

Printed at Avanti Press - Rajahmundry.

